# శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము



శ్రీ

# వేంకటేశ్వరోపాఖ్యానము

ఇది
శ్రీ మహాలక్ష్మీ పరిణయాద్యనేక శృంగార ప్రబంధరచనా
ధురీణుండును కవిచంద్ర బిరుదాంకితుడును అగు

**వద్దిపర్తి కోనంరాట్కవీంద్రునిచే**
**(క్రీ.శ. 1754 నుండి 1834 వరకు)**

రచియింపఁబడినది

ప్రచురణకర్త కవిపౌత్రజ పౌత్రుఁడగు
**వద్దిపర్తి కోనంరాజు**
Retd. Senior Accounts Officer
(S.E. Rly.)

మొదటి కూర్పు 1000 ప్రతులు



మూల్యము రు 25/-00

ఓం

నమో శ్రీ వేంకటేశ్వరాయ



THIS BOOK IS
PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
AID TO PUBLISH RELIGIOUS BOOKS



ఈ ప్రబంధమును ముద్రింప జేయుటకు కారణభూతులైన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారులకును, అత్యంత శ్రద్ధ తీసుకొని నాతో మనస్ఫూర్తిగా సహకరించి అతితక్కువ కాలంలో దీనిని ముద్రింప జేసిన **శ్రీ మల్లంపల్లి రాజా లక్ష్మణరావుగారికిని, శర్వాణీ ప్రింటర్స్‌**వారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతలు ఇందుమూలముగా అందజేయుచున్నాను.

- ప్రచురణ కర్త

శ్రీరస్తు

# శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము

అను నీదివ్య ప్రబంధరాజము కవిపౌత్రజుఁడగు వద్దిపర్తి వీరరాఘవ స్వామిచే మున్ను ముద్రితంబైన శ్రీ మహాలక్ష్మీ పరిణయప్రబంధ కృతి కర్తయు, నవరసాలంకార దివ్య ప్రబంధ నిర్మాణచాతురీ ధురీణుండును, శ్రీరామ పాదారవింద భజనానందుండును నగు వద్దిపర్తి కోనంరాట్కవి శిఖామణి పౌత్రుండును వేంకటరెడ్యామాత్యుని పుత్రుండునగు వేంకట రాజాఖ్యుని, తృతీయాత్మ జాతా విజయ లక్ష్మ్యంబాసుపుత్రుండును కాశ్యప సగోత్రుండును, కాస్యప, వత్సార, నైథ్రువ, రేఫ, రైఫ, శండిల, శాండిల్య సప్తార్షేయ ప్రవరుండునగు, గుడిపాటి సుబ్బరాయ మంత్రి తనూజుండగు నీలకంఠేశ్వరునిచే తొలిసారి 1941వ సంవత్సరమున ముద్రితంబై ప్రచురింపఁబడియె.



# శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము

## విషయసూచి

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము





### ఓం నమోనారాయణాయ

## విజ్ఞప్తి

**సుజనులారా!**

మదీయ ప్రప్రపితామహులగు కవిచంద్ర బిరుదాంకితులైన కోనం రాట్కవీంద్ర విరచితంబై, వరుసకి మా పైతృష్వసేయులు (మేనత్తగారి కుమారులు)ను, నాకు స్వయముగ మామగారును అగు గుడిపాటి నీలకంఠే శ్వరునిచే 1941లో ముద్రింపబడిన యీ శ్రీవేంకటేశ్వరోపాఖ్యానమును నేను ధనార్జన నిమిత్తము ప్రచురింప జేయుట లేదు. అయితే వెలలేకుండా దీనిని అందరికినీ ఉచితంగా పంచిన యెడల దీనియందు శ్రద్ధ ఎవరికినీ ఉండదు. కనుక దీని వెల తక్కువలో తక్కువగా రూ|| 25-00 (ఇరువది యైదు రూపాయలుగా) నిర్ణయించడమైనది.

ముద్రించిన 1000 ప్రతులలోను 500 ప్రతులు ఆ తిరుమ లాధీశునకు సమర్పించబడును. వద్దిపర్తి వంశజులగు మా కుటుంబ సభ్యులకును, ఇతర బంధువులకును, సన్నిహితులకును, ఈ గ్రంథమును ముద్రింప జేయుటలో నాకు సహకరించిన వారికినీ నాయభినందనములతో నీయగా మిగిలిన ప్రతుల వలనవచ్చు ఆదాయము నేను అనువదించిన శ్రీమ చ్ఛంకర భగవత్పాద విరచితంబైన భగవద్గీతా భాష్యమును ముద్రింపజేయు టకు వినియోగించబడును. ఆ గ్రంథమువలన వచ్చు ఆదాయమేమి మిగిలినను అది సద్వినియోగమే చేయబడును.

విశాఖపట్నం
1-3-2000

ఇట్లు సుజన విధేయుడు
**వద్దిపర్తి కోనంరాజు**
Retd. Senior Accounts Officer
(S.E. Rly.)

# పీఠిక

శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము అను నీ దివ్య ప్రబంధమును రచించిన కవిచంద్ర బిరుదాంకితులైన వడ్డిపర్తి కోనంరాజు గారు ఆరువేల నియోగి బ్రాహ్మణులు. భార్గవ, చ్యవన, ఆప్నువాన, ఔరవ, జమదగ్నిః, పంజ్చా ఋషేయ ప్రవరాన్విత శ్రీవత్స గోత్రీకులు ఆపస్తంభ సూత్రులు. క్రీ॥శ॥ 1 7 5 4 వ సం॥ర ప్రాంతమున జన్మించి, ఎనుబది సం॥లు జీవించి 1 8 3 4 వ సం॥న దివంగతులైరి. వీరు వేంకట తమ్మయామాత్యునికి వారి సతీమణి రామాంబయందు జనించిన ముచ్చురు పుత్రులలో మూడవ వారు. మాతాతగారగు కోనంరాజుగారికి తాతగారైన కోనంరాట్కవీంద్రుని బాల్యము, విద్యాభ్యాసము మొ॥గు వాటిని గూర్చి ఏమియు తెలియరాకు న్నది. విద్యాబుద్ధులు నేర్చి పెరిగి పెద్దవారైన పిదప కులక్రమాగతముగ వచ్చు కరిణీకమును జేకొని పిత్ర్యమగు 3 0 0 ఎకరముల పరిమితి గల నౌఖరీ ఇనాం భూముల వలన వచ్చు నాదాయముతో సుఖముగా జీవయాత్ర గడి పిన ధన్యులు. అందువలననే కవితావృత్తిని జీవనాధారముగ జేసికొన నగ త్యము లేనివారై గాలము గడిపిరి. గ్రామాధికారిగనుండియును, కవిత్వక ళయందు అత్యధిక ఆదరము కలవారై కృషిచేసి సరస కవిత్వవైభవములను జూపు ప్రబంధరత్నములను రచియించి కీర్తికాయులయ్యిరి.

పూర్వము నెల్లూరులో నెరజాణలు' అని ప్రసిద్ధి నొందిన మహా యుక్తి పరులుండేవారట. నెల్లూరు నుండి వారు పంపించిన ఉత్తరములకు యెచ్చటనుండియు ప్రత్యుత్తరములు గానక సర్వసిద్ధి గ్రామమునకు వచ్చిన పిదప కోనకవిగారు వాటికి సదుత్తరంబులిచ్చి పంపిన పిదప వారు సంతసించి ''శ్రీమత్సకలకవితా చాతుర్య ప్రవీణులైన సర్వసిద్ధి సరసులుగారికి నెల్లూరు నెరజాణలు సాష్టాంగ కర్తలు'' అని యారంభించి ప్రత్యుత్తరము వ్రాసినా రట. వీటిని గురించి మా పినతండ్రి గారగు వీరరాఘవస్వామిగారు క్రీ.శ. 1 9 1 7 లో ముద్రింపజేసిన కోనకవీన్ద్రవిరచితమగు శ్రీమహాలక్ష్మీ పరిణయ మున వ్రాసియున్నారు. దానిని ఇచట గ్రంథవిస్తరణ భీతిచేత పొందుపర చలేదు.

కోనకవిగారు మహాభక్తులు గను, అద్భుతదివ్యశక్తి సంపన్నులు గను ఆరోజులలో కీర్తితులైనారు. వీరి గురించి ఇతర వివరములకు 1, 2

అను బంధములు చూచెదరు గాక !

కోనకవిచంద్రులు జానకీరామ కృతులను, శ్రీ మహాలక్ష్మి పరిణయము, రేవతీ పరిణయము అను దివ్యప్రబంధములను గూడ రచించియున్నారు. ఆ జానకీరామ కృతులు, రేవతీ పరిణయముయును, గూడ ఇపుడెచ్చటను కానరాకున్నవి.

శ్రీ మహాలక్ష్మి పరిణయమున ప్రథమాశ్వాసము నందలి 35 నుండి 41వ పద్యముల నుండియు, మా పెదతాతగారగు అప్పలనరసింహదాసు గారు (జననము క్రీ॥శ॥ 1805 నిర్యాణము 1885) రచించిన మహాప్రభుశతకమునందలి 18వ పద్యము నుండియు, మా పితృదేవులగు వేంకటరెడ్డి పంతులు (జననం క్రీ॥శ॥1867 దేహత్యాగము 1954) గారు 1930లో ముద్రింపజేసిన మహాప్రభుశతకము యొక్క పీఠిక యందలి సీసపద్యమునుండియు గ్రహించిన మా వంశ వివరములు ఈ క్రింద పొందు పరచడమైనది.

## మా వంశ పరిచయము

ఇప్పటికి 4,5 వందల సం॥ల క్రిందటి రోజులలో ఆరువేలనియోగి బ్రాహ్మణులు అనేక సంస్థానములలో అమాత్యులుగా నుండేవారు. వారిని గురించి కోనకవి చంద్ర విరచితంబైన శ్రీ మహాలక్ష్మి పరిణయమున ఈ క్రింది విధముగ చెప్పబడియున్నది.

సీ॥ సకల భూపాలకాస్థానమండల మాన్య
విబుధ సంపూజ్యులార్వేలవారు।
సురరత్న సురభూజ సురభామల హసించు
వితరణోదారు లార్వేలవారు।
ఘటనా ఘటనరాజ కార్యమంత్రాంగ ప్ర
విద్యాధురీణు లార్వేలవారు।
బలవద్విరోధిరాట్కుల గాఢతరతమో
విదళనాదిత్యు లార్వేలవారు।

గీ॥ విధికులాంభోధిచంద్రు లార్వేలవారు ।
వివిధలోకోపకారులార్వేలవారు।

పిసుతసత్కార్యధుర్యులార్వేల వారు।
విమలులు నియోగి వర్యులార్వేల వారు॥ (1-33)

మ॥ క్షితిపార్వేల్లనియోగి పుంగవులలో శ్రీ వత్సగోత్రోద్భవుల్
చతురోపాయసమర్థ వైభవకళా చాతుర్యవంతుల్ జగ
ద్ధిత సత్కీర్తి కళానిధుల్ సగుణ సందీప్త ప్రభావోన్నతుల్
మతి మంతుల్ హితకార్యవంతులు మహామంత్రీశ్వరగ్రామణుల్॥
(1-34)

ఇక వద్దిపర్తివారి మూలపురుషుడై వెలసిన వేంకటరాజాఖ్య ( బహుశ 16వ శతాబ్దమునకు చెందియుండవచ్చు) విషయమున

3. మ॥ వర శ్రీ వత్సపవిత్ర గోత్రజులలో వాచాఫణీంద్రుండు శ్రీ
వరపాదాంబుజ పూజకుండు విమలాపస్తంభసూత్రుండు భూ
వరసన్మాన్యుల సద్గుణుండు బహుసుపద్వైభవేన్ద్రుండు శ్రీ
కరుండొప్పారెను వద్దిపర్తికుల వేంకట్రాజ చంద్రుడిలన్॥ (1-35)

వారి సతీమణిదేవలాంబ

4. సీ॥ ఆదంపతుల కిద్ద అధిక భద్రాత్ములు రతిశచీపతులన రామరాజు
కామరాజులనంగ గలిగిరందగ్రజుండగు రామరాజునకమరెపత్ని
విస్సమాంబయనంగ; వెలయు వారికి సముద్భవ మొందెవేంకట
తమ్మయాఖ్యుం
డాతనికాంతరామాంబ పుణ్యకదంబ; వారికి శ్రీరామువరము పేర్మి

గీ॥ పుత్రకులు ముప్పురొక పుత్రిపొడమిరందు
ఘనుండు సర్వయమంత్రి, వేంకట విభుండు
వారికనుజుండనై ధరావలయమందుం
గోనకవిచంద్రుండనిపేరు గొంటినిపుడు ॥ (1-37)
(వీరే వద్దిపర్తివంశవర్ధనుడగు కోనంరాజుగారు)

5. సీ॥ ఇట్టి వంశఖ్యాతి వెలయంగ నలరారి
కులకాంత పాపాంబ గుణకదంబ
పుత్రత్రయంబును బుత్రికాషట్కంబుం
గాంచె నందగ్రఘనసుతుండు ।

మూర్తిన్ విభుండు సత్కీర్తి శీతాంశుండు
వేంకటరెడ్డి పృథ్వీతలేంద్ర
సామంత పూజ్యుండు సకల విద్యాశాలి
రాజమంత్రాంగ నిర్వాహకుండు. ॥

గీ॥ సర్వయాఖ్యుండు వరసత్కళత్ర
పుత్రపౌత్రాభివృద్ధి సద్గోత్రవృద్ధి
గలిగి సేవింపఁగాదాత్రి నలరినాఁడ
రమ్యగుణరాజిఁ గోనమరాజనంగ ॥ (1-38)

6. మా ప్రపితామహులగు యావేంకటరెడ్డి నార్యుని పుత్రద్వయం బునఁదగ్రజుఁడగు అప్పల నరసింహదాసు విష్ణుభక్తుడు. మహాప్రభు శతకమును, రామశతకమును అనేక రామకీర్తనలను రచించడమే గాక కాశీ రామేశ్వరాది పుణ్యక్షేత్రములను పలుమారు దర్శించి ఆయాక్షేత్రముల మహాత్మ్యములను గూర్చి కీర్తనలు రచించిరి. వీరి జీవితకాలము 1805 నుండి 1885 వరకు.

7. ఇక ద్వితీయ పుత్రుడును అత్యుదార మానసుఁడుగా పరిగణించబడుచుండెడి వారును అగు కోనంరాజు (వీరేమా పితామహులు)న కాయనసతి మాపితామహియగు నర్సమాంబ యందుద్భవించె వేంకటరావు, వేంకటరెడ్డి (వీరేమాపితరులు), వీరరాఘవస్వామీ, పేర్మి పుత్రత్రయంబు నొక పుత్రీ బుచ్చయ్యమ్మయున్.

8. మా పితృదేవులగు వేంకటరెడ్డి పంతులుగారు 1867 నుండి 1951వరకు) జ్ఞానసాధనమను శీర్షికతో శ్రీ మహావిష్ణుని దశావతారాభివర్ణనమును రచించియున్నారు. ఆ కృతి ఇందు మూడవయను బంధముగా జేర్చబడినది.

మా మాతృదేవత పేరిందేవి గారు, మేము నలుగురు అన్నదమ్ములము, ముగ్గురు అక్కచెల్లెండ్రు, వారిలో నిప్పుడున్న వారు ద్వితీయ పుత్రుడగు నేనున్నూ. మా సహోదరి పర్వత వర్ధనమ్మయును మాత్రమే.

మాయన్నగారగు పంచముఖేశ్వరరావు "హేమకుంభము అను కృతిని రచించినారు.

9. మా పినతండ్రిగారగు వీరరాఘవస్వామి గారికిని మాపిన్నిగారగు సత్యన్నారాయణమ్మగారికిని ప్రకాశరావు, రామచంద్రరావు, అన్నా

జీరావుయను పుత్రత్రయమును నర్సమాంబయను నొకపుత్రికయును గల్గిరి.

10. మాయన్నగారు పంచముఖేశ్వరరావు (1915 నుండి 1993 వరకు) మా వదినగారు నారాయణమ్మ, వారికి వేంకటరెడ్డి పంతులు, వేంకటరావు, నరసయ్య, రామకృష్ణ, జగన్నాథస్వామి, రాజేశ్వరయ్యయను పుత్రషట్కంబును, పేరిందేవియను నొకపుత్రికయును గల్గిరి.

11. South Eastern Railway యందు Senior Accounts officerగా పదవీ విరమణ గావించిన కోనంరాజును నేను 1924లో జన్మించినాను నా ప్రథమ కళత్రమగు రాజేశ్వరికి పేరిందేవి, వేంకటరామకృష్ణ, జోగులాంబ కమలాబాయి శారదాదేవియును (ఈమె 1963లో దివంగతురాలైనది) శారదాదేవియును, కలిగిరి. నా ద్వితీయ కళత్రమగు నర్సమాంబకు నరసింహమూర్తి, రాజేశ్వరరావు; వేంకటరమణియను నొక పుత్రికయును గల్గిరి.

శ్రీ మచ్ఛఙ్కర భగవత్పాదవిరచితంబైన దేవనాగరిలిపిలో నున్న భగవద్గీతా భాష్యమును మన మాతృభాషయగు తెలుగులోనికి స్వేచ్ఛానువాదము చేయుటయేగాక నేను పరబ్రహ్మస్తోత్రమును రచించి, మోక్ష సాధనమను శీర్షికతో శంకర భాష్యానుసార భావతాత్పర్య సహితముగా శ్రీ మద్భగవద్గీతయందలి భక్తియోగమునుద్బోధించు శ్లోకముల మూలమును కూడ రచించియున్నాను.

విశాఖపట్నం
1-3-2000

**వద్దిపర్తి కోనంరాజు**
(ప్రచురణకర్త)

## కవిచంద్ర బిరుదాంకితుడగు పట్టపర్తి కోనంరాజు వంశవృక్షము

- వేంకటరాజు = దేవళాంబ
  - రామరాజు = విస్సమాంబ
    - వేంకటతమ్మయామాత్యుడు = రామాంబ
      - సర్వయ్య
      - వేంకట విభుడు
      - కవిచంద్ర కోనంరాజు = పాపాంబ (వీరికి ముగ్గురు కుమారులు, ఆరుగురు కుమార్తెలు) (1754-1834)
        - వేంకట రెడ్డి (ప్రథమ పుత్రుడు)
          - కవి అప్పలనరసింహదాసు (1805-1885)
          - కోనంరాజు = సర్వమాంబ
            - వేంకటరావు
            - కవివేంకటరెడ్డి (1867-1951) = పేరిందేవి
              - కవిపంచముఖేశ్వరరావు (1915-1993) = సత్యనారాయణమ్మ
                - వేంకట రెడ్డి పంతులు
                - వేంకట రావు
                - పేరిందేవి
                - నరసయ్య
                - రామ కృష్ణ
                - జగన్నాథ స్వామి
                - రాజేశ్వరయ్య
              - కోనంరాజు = - - - - - - - - రాజేశ్వరి (1930-63)
                - సర్వమాంబ
                  - నరసింహమూర్తి
                  - రాజేశ్వరరావు
                  - వేంకట రమణి
                - పేరిందేవి
                - వేంకట రామకృష్ణ
                - జోగులాంబ
                - శారద
              - సర్వత సర్ధనమ్మ
            - వీరరామస్వామి = సత్యనారాయణమ్మ
              - ప్రకాశ రావు
              - సర్వమాంబ
              - రామ చంద్రరావు
              - అన్నాజీ రావు
  - కామరాజు

# ఓం నమో శ్రీవేంకటేశ్వరరాయ సమర్పణ

శ్రీ వేంకటేశ్వర స్వామి ఆదిత్య పురాణమందు మహా విష్ణువుగాను, స్కాంధపురాణమందు సుబ్రహ్మణ్యుడుగాను, మార్కండేయ పురాణమందు సుబ్రహ్మణ్యాత్మక విష్ణువుగాను వర్ణించబడియున్నాడు.

శ్లో॥ కృతేతునరసింహో౽భూత్। త్రేతాయాంరఘునందనః ।
ద్వాపరేవాసుదేవశ్చ । కలౌవేంకటనాయకః ॥

(ఆదిత్యపురాణము)

తా: ఆ మహావిష్ణువు కృతయుగమున శ్రీవరాహనరసింహుడును. త్రేతాయుగమున శ్రీరాముడును, ద్వాపరయుగమున శ్రీకృష్ణుడును కలియుగమున శ్రీ వేంకటేశ్వరస్వామియును అయెను.

శ్లో॥ కృతేసేనాపతి స్కందః । త్రేతాయాంతు కుమారకః ।
సుబ్రహ్మణ్యోద్వాపరేతు। కలౌవేంకటనాయకః ।

(స్కాంధపురాణము)

తా: కృతయుగమున స్కందుడును, త్రేతాయుగమున కుమారస్వామియును, ద్వాపరయుగమున సుబ్రహ్మణ్య స్వామియును, కలియుగమున శ్రీవేంకటేశ్వర స్వామియును మోక్షమార్గ దర్శకులు.

శ్లో॥ కలౌకుమారరూపేణ । షణ్ముఖో భగవాన్ హరి : ।
దృశ్యఏకముఖేనైవ । వేంకటాచల నాయకః ॥

(మార్కండేయ పురాణము)

తా : కలియుగమునందు భగవానుడగు శ్రీహరి ఆరు ముఖములతో గూడిన కుమారస్వామి (సుబ్రహ్మణ్యేశ్వరుడు) యగుచు ఒక్కముఖముతోనే వేంకటాచల నాయకుడుగా కనబడిన వాడాయెను.

శ్లో॥ వినావేంకటేశం ననాథోననాథః ।
సదా వేంకటేశం స్మరామి స్మరామి।

హరే వేంకటేశ ప్రసీద ప్రసీద ।
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥
(శ్రీవేంకటేశ్వర సుప్రభాతము)

తా.. శ్రీ వేంకటేశ్వరుడుకాక నాథుడైనవాడు లేడు, దిక్కైన వాడులేడు. ఎల్లప్పుడును వేంకటేశ్వరుని స్మరించు చున్నాను. ఓ శ్రీహరి। ఓ వేంకటేశా! ప్రసన్నుడవు కమ్ము. అనుగ్రహించుము. ఓ వేంకటేశా ఇష్ట మును అనగా కోరిన దానిని ఇమ్ము ఇమ్ము.

శ్లో॥ కామతో౽కామతోవాపియత్కరోమి శుభా౽శుభమ్ ।
తత్సరం త్వయి విన్యస్య త్వత్ప్రయుక్తః కరోమ్యహం ।
(శ్రీమచ్ఛంకరాచార్య విరచితమగు వివేకచూడామణికి
శ్రీ చంద్రశేఖర భారతీస్వామివారు వ్రాసినవ్యాఖ్యనుండి)

తా.. కోరికతోగాని, కోరిక లేకుండాగాని ఏ శుభా౽శుభ కార్య ములను చేయుచున్నానో దాని నంతను నీచే ప్రేరేపింబడినవాడనై నీయందే సమర్పించి నేను చేయుచున్నాను.

వద్దిపర్తి కోవంరాజు
ప్రచురణకర్త

# శ్రీ వేంకటేశ్వరాష్టకమ్

కీ।।శే।। శ్రీ ఆకెళ్ల అమృతరామం (Former FA & CAO S.E. Rly and Retired General manager BHEL Secunderabad) గారు రచించిన నీ యష్టకమునువారి సతీమణి సూర్యకాంతంగారి యొక్క అంగీకారముతో నిచట ముద్రించబడినది. -

★ కౌముదీసితకాంతి విస్ఫుర దూర్ధ్వ పుండ్రవిభాసితం
శత్రు దర్పవిదారణోజ్జ్వల శంఖచక్ర విరాజితం
సర్వలోక విమోహనాత్మక దివ్యరూప విశోభితం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పదపంకజే।।

★ రత్నభూషణ పుష్పదామ విరాజితాద్భుత విగ్రహం
కౌస్తుభాంచిత సుందరాయత దివ్యమంగళ వక్షసం
ఇందిరామణి మందిరాయిత పావనోత్తమ హృత్తటం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పదపంకజే।।

★ బర్హిపింఛ విభూషణం బహుగోపికా ప్రియనాయకం
వేణునాద విమోహిత వ్రజకామినీప్సితదాయకం
కోటిమన్మథ సుందరం వసుదేవపుత్ర జగద్గురుం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పద పంకజే ।।

★ హీరమౌక్తిక హారభూషిత నీలగాత్ర విభాసురం
దైత్యనాశక లోకరక్షక దివ్యచాప విరాజితం
ధారుణీతనయా ప్రియం రఘునాయకం పురుషోత్తమం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పదపంకజే।।

★ కోమలారుణ రాగరంజిత సుందరాంఘ్రి సరోరుహం
పంకజాసన ఫాలలోచన పూజితాంఘ్రి విరాజితం
పాపమోచక మోక్షదాయక పావనాంఘ్రి సుశోభితం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పద పంకజే ।।

★ శ్యామలోన్నత శాంతి సంవృత సప్తశైల నివాసినం
స్వామి పుష్కరిణీతటస్థిత హేమమందిరవాసినం
సర్వలోక నివాసినం నిజభక్తమానస వాసినం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పదపంకజే॥

★ చంద్రికాసమ మందహాస సుశోభితానన భాసితం
శాంత శీతల మోదపూర్ణ దయార్ద్ర వీక్షణలోచనం
హస్తసూచిత నైజపాద శరణ్య సద్గతి సంపదం
వేంకటేశ్వర మాశ్రయే ప్రణమామి తత్పదపంకజే॥

★ సర్వమంగళ సర్వమోహన రూపవైభవ శోభితం
సర్వదేవ మునీశ్వరస్తుత దివ్యశక్తి సమన్వితం
రామమాది సుభక్తలోక కృపాకరం కరుణా నిధిం
వేంకటేశ్వరమాశ్రయే ప్రణమామి తత్పదపంకజే ॥



# శ్రీ వెంకటేశ్వరోపాఖ్యానము

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీ మద్రాజత్షైలపంకజ ఫణిక్రీడానిశాంతాద్రిజా
శ్రీమాప్రాంచదురోజసాంకవమద శ్రీపత్రసువ్యక్తవ
క్షోమధ్యాతతరత్న హారవిలస త్కుంభిఘ్న ధాత్రాచ్యుత
త్రైమూర్త్యాత్మక రామనామక పరబ్రహ్మంబు సేవించెదన్. 1

### ఇష్టదేవతా ప్రార్థన

సీ॥ శ్రీధరులకలంక చిన్మయాకారులు
ప్రణవస్వరూపులు పరమధాము
లబ్జలోచనులు ధరాత్మజాత్మేశులు
వేదాంతవేద్యులు విశ్వమయులు
నిర్జితకాములు నిఖిలలోకేశ్వరు
లఘసంహరులు సంత తాబ్జధరులు
ఘనసారనిభగాత్రు లనుపమ తేజులు
పురుషోత్తములు సర్వభూతపతులు

గీ॥ నిర్గుణబ్రహ్మమూర్తులు నిర్వికారు
లభవులక్షరులాది మ ధ్యాంతరహితు
లైనశివకేశవులు మదీ యాత్మనిలిచి
కరుణదలుకొత్తఁబ్రోతు రుత్కలికతోడ.

మ. అమితానందముతో సితాంబురుహ సింహాస్థానమందుండి చి
త్రముగావిశ్వముదివ్యయోగమున నిర్మాణంబుగావించి శీ
ఘ్రమ తత్ప్రాణిలలాటపట్ఫ్యులసువర్ణ వ్రాతమున్ వ్రాయు వా
గ్రమణీభర్తచిరాయురున్నతులు భద్రంబొప్పమాకీవుతన్.

సీ॥ అవతంసకుసుమ కైరవహితామృతముచే
నుదుటికుంకుమచుక్క కుదురుదడియ
ఘనగాత్రచందన గంధమాస్వాదించు
ఫణిరాజహారంబు పడగలెత్త
నిగమంపుఁబేరులు నెమ్మివక్షోజాగ్ర
పాళియందముల వైభవముదెలుప
మహనీయరుద్రాక్ష మాలికతనుదాని
తారకబ్రహ్మమంత్రముపఠింప

గీ॥ సకలసురమౌని నికరంబు సన్నుతింప
సంతతంబెడబాయక శంభుమూర్తి
వామభాగంబుఁదాల్చు శివావధూటి
సిరులుసమకూర్చి మమ్ము రక్షించుగాత. 4

సీ॥ మిసిమిబంగరు లేట మెయితళుక్కనపాల
మున్నీటఁబుట్టిన మోహనాంగి
యలఘునిత్యవిభూతి నలరారుహరిముద్దు
పట్టంపు రాణియౌ పద్మగంధి
దివ్యవైకుంఠమందిరలసద్భోగిత
ల్పంబునశయనించు పల్లవాంఘ్రి
పలుకువాల్గంటి కొండలరాచలేఁబట్టి
తోడనాడెడుపూవుఁబోఁడిమిన్న

గీ॥ పద్మగర్భపులోమజా ప్రాణనాథ
వందితపదారవింద పూర్ణేందువదన
యైన శ్రీ వైష్ణవీరత్న మాదిలక్ష్మి
మించువేడుక మమ్ము రక్షించుగాత. 5

సీ॥ రమణీయతరమైన రాయంచగుజ్జంబు
బంగారువీణియ పలుకుఁదోడు
కబరిపైనున్న చక్కనిపువ్వుజాబిల్లి
భద్రాసనముపొందు పంకజంబు
వేదాంతమార్గముల్ విహరణస్థలములు
ముంజేతి రాచిల్క ముద్దుపాప
యఖిలవిద్యలు మనోహరమైన రూపంబు
సకలాక్షరము లక్ష సరముగాఁగ

గీ॥ ధవునితోఁ గూడికేరు మందారహీర
క్షీర తారపటీర తుషారహార
సారవర్ణవిభాసిత శారదాంబ
నిండువేడుక నాజిహ్వ నుండుగాత 6

మ. బలవద్వైరినిశాటరాడ్గహనమ ప్పద్మాక్షుఁడుగ్రాంబక
జ్వలనజ్వాలలసేర్చునత్తఱి జయధ్వానంబుగా నొత్త ది
వ్యులకున్ మర్త్యులకున్ భుజంగులకు న త్యుల్లాస మోహోభయం
బులుగావించెడి పాంచజన్య మనిశంబు గూర్చునిష్టార్థముల్. 7

చ. నరకమురాదిదైత్యకుల నాయకమూర్ధ్ని విభేదకాల భీ
కరరణధారుణీస్థలి నఖండపరిస్ఫుటరశ్మిభూనభోం
తరయుతదిఙ్ముఖప్రళయ దావశిఖామయమైన చక్రముం
జిరతరభక్తిశోభిలఁగఁ జిత్తములోనఁదలంచికొల్చెదన్. 8

చ. ధరమగధేంద్ర వీరభట దర్పమహీధర చక్రపక్ష సం
హరణ సురేంద్ర హస్తకలి తాంచిత వజ్రసమాన చండభీ
కరపటుశాత దైత్యహర కాండసమూహ విముక్తశార్ఙ్గ ముం
గరమనురక్తిభక్తిని దగంబ్రణుతించి తలంచి కొల్చెదన్. 9

చ. ఉరక సమిద్ధరాస్థలి మ హోగ్రనిశాటకదంబమత్తకుం
జరనికరోత్త మాంగచయ జర్జరితక్షత జాతరక్తవి
స్తరయుత భూతలాంబర దిశావలయాంతరచండదీధితి
స్ఫురణగదామహత్త్వము వచోనిపుణంబునఁ బ్రస్తుతించెదన్. 10

క. మధుకైటభ దానవరా
ట్పృథుకంఠవిలుంఠ సమయభీకరలయకా
లధనంజయ నిభధారా
ప్రథితంబగు నందకంబుఁ బ్రస్తుతిచేతున్. 11

మ. గిరిజాశంకరు లాత్మమెచ్చఁగ జలక్రీడారతిన్ సప్తసా
గరముల్ తుండమునందుఁ బీల్చివెసన క్రగ్రాహముల్ జూపి గ్ర
మ్మరనిండింపుచు బాల్యచేష్టలఁగడున్ భాసిల్లి కైలాస భూ
ధరమందున్ విహరించు దంతిముఖు నిత్యంబాత్మఁగీర్తించెదన్. 12

సీ॥ వల్మీకసంభవ వ్యాస మా సీంద్ర వా
ఙ్మాధుర్య నైపుణ్య మహిమఁబొగడి
కాళిదాసమురారి కవిరాజబాణ స
త్ప్రజ్ఞావిశేషంబుఁ బ్రస్తుతించి
శ్రీహర్షభారవి శివభద్రభవభూతి
విద్యామహత్వంబు వినుతిచేసి
మాఘదండి మయూర మ్హణ బిల్హణ
కవితావిలాస విఖ్యాతిఁగాంచి

గీ॥ శబ్దశాసను శ్రీనాథు శంభుదాసు
సోముభాస్కరుఁదిక్కన సోమయాజి
భీమకవిఁ బెద్దనార్యుని రామభద్రు
సంతతంబు మదీయాత్మ సంస్మరింతు. 13

వ. అని యివ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబును సుకవిజన స్తోత్రంబును గావించి నవరసాలంకారఁ చమత్క్రియా బంధబంధురంబుగా నొక్కశృంగార ప్రబంధంబు నిర్మింపంబూని యున్న కార్తీకమాస శుక్లపక్షంబున శ్రీహరివాస రోపవాసంబుఁ గావించి లక్ష్మీనారాయణ పూజావిధానం బాచరించి భగవత్కథా సుధా రసాకర్ణ నోల్లాసమన స్కుండనై యున్న తదీయ నిశీధినీ చతుర్థ యామంబున. 14

సీ. ఘననీల మేఘసంకాశ దేహముతోడ
ధవళాంబుజాతనే త్రములతోడ
రమణీయకౌస్తుభ రత్నహారముతోడ
లాలితమణికుండలములతోడఁ
జండకాండయుత కో దండహస్తముతోడఁ
గమనీయ శంఖచక్రములతోడ
శతకోటి సూర్య భాస్వత్కిరీటముతోడ
మురిపెంపుఁ జిఱునవ్వు మొగముతోడ

గీ. సరససల్లాపచాతుర్య సరణిఁదెలుపు
మాటలాడెడు సీతాప ధూటితోడ
రఘుకులీనుండు రామచంద్ర ప్రభుండు
కృపను సాక్షాత్కరించినా కిట్టులనియె. 15

వ. మదీయ భక్తిపరతంత్రుండవు, సంస్కృతాంధ్ర భాషాకుశలుండవు, నీవాంధ్రభాష రచయింపబూనిన ప్రబంధంబు మాకు మనఃప్రియంబుగాఁ గృతియొనర్పుము నీకు, మహాభ్యుదయంబగునని యానతిచ్చిన లేచి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, యానంద బాష్పబిందు సందోహపులకితగాత్రుండనై తదీయ పాదారవింద సేవారతుండనై మహాప్రసాదంబని, నిటల తటఘటితాంజలి పుటుండనై యున్న నద్దేవుండు కరుణించి యంతర్హితుండయ్యె; నంతట మేల్కాంచి విస్మితుండనై మదీయ జన్మ సాఫల్యంబుఁ గంటినని సూర్యోదయానంతరంబునఁ గాల్యకరణీయంబులు దీర్చి స్నాన సంధ్యాద్యనుష్ఠానంబు లాచరించి యానంద కందళి తాంతరంగుండనై శ్రీమన్నారాయణార్పితంబుగా నే రచియింపంబూనిన యిమ్మహాశృంగార ప్రబంధంబునకు శ్రీరామదేవునిఁ గృతి నాయకునింజేసి తత్ప్రారంభంబునకు మంగళ ప్రదంబుగా గృతినాయకుని పుణ్యచరిత్రం బభివర్ణించెద. 16

## కృతినాయకుని వర్ణన

సీ. పటుతర బ్రహ్మాండ భాండపఙ్క్తులహస్త
కందుకంబులుగ నింపొందువాఁడు
వైష్ణవముఖ్య భవ్యవ్యూహములు కేళి
కాలయంబులుగఁ జెన్నలరువాఁడు
శరణుఁబొందిన విభీషణుని లంకారాజ్య
పట్టబద్ధుని జే యునట్టివాఁడు
నిండుభక్తినిఁగుచే లుండిచ్చు పృథుకముల్
గొని వలించనిసిరుల్ గూర్చువాఁడు

గీ. పరమ కళ్యాణగుణములఁ బరగువాఁడు
నిత్య లీలానుభూతుల నెగడువాఁడు
చెలఁగి రసికత్వమిగురొత్తఁ జిత్తగించు
మచ్చమత్కృతి కావ్యోక్తి మధురిమములు 17

చ. వెరవుగఁ దల్చులెక్కనర పేయుటఁ బెంచి తలంమరెట్టి చే
నరుదుగ భాగహారమిడి యయ్యది నల్పదినాలుగింట నె
చ్చరిక గుణించవచ్చిన ప్రశస్తపు లబ్ధపులబ్ధముల్ వసుం
ధర పరిపాటినేలు పరదైవముఁ గొల్తు నభీష్టసిద్ధికిన్. 18

సీ. సప్తార్ణవావృత క్ష్మాతల విజయేంది
రాసమాలింగితో రక్షలుండు
దశ దిగ్వధూపాల తటగంధ తిలక ప్ర
హసితోద్యదమల మహోయశుండు
దైత్య సంపన్మహీ ధరగరుత్ఖండనా
ఖండలాసిసమాన ఖడ్గధరుఁడు
నిజసత్కథాద్యోధు నీజల శాలనో
ద్భూత నానాజగ ద్విష్కృతుండు

గీ. సకల దేశాధినాథ శ శ్వత్కిరీట
ఘటిత నవరత్న సంభవ గాఢకాంతి

కలిత కమనీయ పాదపంకరుహయుగళుఁ
డిన కులీనుండు రామభూమీశ్వరుండు. 19

సీ. చండ కోదండోరు కాండయుక్త భుజుండు
ఖండేందు ధరధనుః ఖండనుండు
కుండలి రాట్పుణా మండలిశయనుండు
గురురత్నయుత కర్ణకుండలుండు
పాండు ప్రభాజాల భవ్యకీర్తిధనుండు
రణ శుంభ దుగ్ర పరాక్రముండు
నండజేంద్ర గురుత్సమారోహనిత్యుండు
రంగత్సితాబ్జనేత్రద్వయుండు

గీ. దశగళాది సురద్విష ద్దారుణోద్ధ
పక్ష విక్షేపకులిశాభ పటుకరస్థ
శాత ఖడ్గుండు దశరథేశ్వర తనూజుఁ
డినకులీనుండు రామ భూ మీశ్వరుండు. 20

సీ. జంభఘ్నజిత్కుంభ సముదగ్ర ఘనతమః
పటల నిర్దళనాబ్జ పతికరములు
కుంభకర్ణ నికుంభ ఘోరాసుగంధవా
హాస్వాద నిశితదంష్ట్రాహితతులు
వహ్నిరుగ్ధూమ్రాక్ష పవనభుః కాండప్ర
హతివైనతేయ పా దాంతరములు
ఖర విరూపాక్షాతి కాయ ధాత్రీధర
వ్రాత భిత్కులిశ ధారాగణములు

గీ. శక్రసంభూత దశకంఠ సమదకుంభి
కుంభ నిర్భిన్న హర్యక్ష గురుకఠోర
నఖరములు రాఘవ కర విన్యస్తదివ్య
వైష్ణవ ధనుర్విముక్తైక పటుశరములు. 21

సీ. శ్రీధరామర ధునీ శీతాద్రి రోచుల
విహసించు నేదేవు విమలయశము

సురరత్న సురధేను సురభూజముల యొప్పు
విహసించు నేదేవు వితరణంబు
భృగు పుత్ర మిత్ర కుబేర మిత్రులశక్తి
విహసించు నేదేవు విక్రమంబు
కంతు జయంత వసంత రాజుల సొంపు
విహసించు నేదేవు మహితరూప

గీ. మట్టి లోకాభిరాము నీ లాభ్రధాము
రాక్షస విరాము శివధను ర్భంగభీము
వినుత సుత్రాము రవికుల వనధిసోము
జానకీరాము శ్రీరాము సన్నుతింతు. 22

సీ. ఎవని తారకమంత్ర మెల్ల లోకస్థుల
కక్షయం బైనట్టి మోక్ష మొసఁగు
నెవని మహోశక్తి యిద్ధరా భారంబు
ధరియించె నవనభూ దార మగుచు
నెవని దివ్యాస్త్రంబు లెందు డాగినవైరి
జనముల వెంటాడి సంహరించు
నెవని సత్కారుణా రసేక్షణంబు విభీష
ణార్క సూనులకు రాజ్యం బొసంగు

గీ. నెవని లీలావిభూతి ననేక కోటి
పద్మ గర్భాండ సంభవ పాలన లయ
కారణం బగునట్టి భాస్కరకులాబ్ధి
చంద్రు శ్రీరామచంద్రునే సన్నుతింతు.. 23

సీ. సంఫుల్ల కుంభ ద్విశాలాబ్జ నేత్రాయ
భవ సేవితాయ తుభ్యన్న మోస్తు
క్షీరాబ్ధిసంభవ స్త్రీరత్న వక్షాయ
భక్తరక్షాయ తుభ్యన్న మోస్తు
శతకోటికందర్ప సన్నిభరూపాయ
పద్మోదరాయ తుభ్యన్నమోస్తు

చారుఘనాఘన శ్యామల దేహాయ
భవమోచనాయ తుభ్యన్న మోస్తు

గీ. కాలకంఠ శరాసన ఖండనాయ
పక్షిరాట్కేతనాయ తుభ్యన్నమోస్తు
క్ష్మాసుతాహృత్సరోజవికర్తనాయ
భద్రగిరి రాఘవాయ తుభ్యన్న మోస్తు. 24

## షష్ఠ్యంతములు

క. ఏవం విధసుగుణాబ్ధికి
శ్రీవత్సాంకునకు భక్తచింతామణికిం
బావనచారిత్రునకున్
శ్రీవైకుంఠాధిపునకు సీతాపతికిన్ 25

క. హీరఘనసారహార ప
టీరసుధాకర తుషారడిండీర శర
త్సారఘనాభ్రఝురీ మం
దారామరకరిమరాళ తారయశునకున్ 26

క. కౌశికమఖ రక్షణునకుఁ
గౌసల్యాగర్భ సింధుకములాంకునకుం
గేసరికుమార సేవిత
భాసురపదపంకజునకు భానుకులునకున్. 27

క. హాటక రేతః కేతు ని
శాటకబంధాహిరోమ సామజకుంభో
త్పాటన కంఠీరవ నఖ
కోటిసమానైక చండగురు విశిఖునకున్. 28

క. కోసలరాజ్య శ్రీ సిం
హాసనసంవాసునకు శరాసన దీక్షో
ల్లాసునకు దాసబృందకు
శేశయవన భాస్కరునకు శ్రీరామునకున్ 29

వ. సద్భక్తి సమర్పితంబుగా నే రచియింపంబూనిన శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానంబునకుఁ గథావిధానం బెట్టిదనిన. 30

## వేంకటాచలపట్టణ వర్ణన

సీ. బ్రహ్మలోకము భాతి రాజహంసలఁగేరి
ఖతలంబు పైఖరి ఘనులనలరి
గ్రహమండలము లీల కవిరాజులఁదనర్పి
వాయుదేవుని రేవబలము గలిఁగి
వసుగిరిమాడ్కి సువర్ణాళిఁ జెన్నొంది
క్షితిజంబువిధిపత్ర వితతిఁదనరి
శరధిపోలిక సురుచిరమణులఁజెలంగి
బలిసద్మమట్లు భోగులఁబెనంగి

గీ. గగనగంగానదిస్వర్ణ కంజభావ
రాజమణిసౌధపాళి వరద్విలోల
గంధవారణ గమనాముఖ ప్రకాశ
భాసురము వేంకటాచల పట్టణంబు. 31

సీ. అణిమాదులకు రాజ తాచల స్థానంబు
ధనసంపదకు దేవతానగంబు
సకలభోగములకు జంభారివాసంబు
కమలావధూటికిఁ గలశవార్ధి
మహితగంధములకు మలయమహీధరం
బఖిలరత్నంబుల కాలయంబు
వివిధవిద్యార్థులికి విధిజాయాపీఠి
రహినృత్యపటిమ కురంగశాల

గీ. కామితార్థంబులకు నెల్లఁ గల్పవల్లి
భూరిపుణ్యంబులకుఁ బెనుప్రోవు నిత్య
భక్తజన సంచయమునకు ముక్తివాటి
పుడమిఁజెన్నొందు శేషాద్రిపురవరంబు. 32

సీ. రాజహంసలచేత రాజహంసలచేత
రాజిల్లు రాజమార్గములు గలిగి
వరకుందములచేత వరకుందములచేత
భాసమానాంగణ ప్రతతిగలిగి
పున్నాగములచేతఁ బున్నాగములచేతఁ
బొలుపొందు ప్రాకార భూమిగలిగి
స్త్రీరత్నములచేత శ్రీరత్నములచేత
రమణీయమగు మందిరములు గలిగి

గీ. భర్మహర్మ్య గ్రదీధితి పటలమబ్జ
బాంధవునిగప్పి శశధర ప్రభలునిగుడి
తారకావళి రుచిమించి ధరణిఁదనరు
భవ్యమగు దివ్యతిరుపతి పట్టణంబు. 33

మ. వరపంకేరుహరాగ హీరకృత శుంభత్సారమూలాగ్ర భా
స్వరలౌహ్యోయతచారు దుర్గమమరెన్ వాణీవధూనాథ ది
గ్వరకోటీరకలాప రత్నఘృణి సంపద్వేష్టి తాంఘ్రుండునై
పురిలోనిల్చున భోధునీధరుఁడనాఁ బొల్పారియత్యున్నతిన్. 34

క. పురిసాలసంఘటిత భా
స్వరరత్నద్యుతులు ఋక్షసముదయ మనుచున్
నిరతం బురు రత్నంబుల
నరయుదురెంతయు గ్రహంబులని జ్యోతిష్కుల్. 35

గీ॥ నగరివప్రంబు గను పట్టె జగతిజనుల
కన్నుదోయికిఁ గాంచన ఖగముఁబోలి
భాసురకవాటయుగ్మంబు పక్షయుగము
చారురత్న ధ్వజస్తంభ చంచువుదగి. 36

గీ. శైవలేందీవరని కరా చ్ఛాదనమున
వజ్రమణిరుచిబొలుపారు పరిఘజలము
వీటివరణంబురంగుకై విశ్వకర్మ
రహినిబిండిననీలాకు రసమనంగ.

మ. పరిఘాధ్వంబునమేతగోరిజగతీ భాగంబుజేరంగ త
త్పురిదుర్గస్థశిఖావళోరునినదం బుంగాంచి భీతిల్లి దు
ర్భరతృష్ణంబిలమందు జొచ్చినదయం బద్భోద్భవుండాశుగం
బురహింబెట్టఁగమారుతాశనపదంబుంగల్గె సర్పాళికిన్

మ. పురిసౌధస్థితహీరఖండములగుంపున్ గారుడాశ్మచ్ఛవుల్
నెరివీక్షించి సితాబ్జశైవలలతా నీక ప్రభాంచత్సరో
వరమంచాత్మఁ దలంచి డాయవడిబోపం బ్రీతిఁగాకున్కి బం
భరముల్ నివ్వెరనిల్చెనాఁదనరె జంభధ్వంసి రత్నాంకముల్.

మ. ఘనసౌధ స్థితరత్న కాంతులెదు రెక్కంగాంచి రత్నాకరం
బని మందాకిని సంభ్రమంబునఁ దదీయావాసముం జేరి భ
ర్తను గానన్ వెరవేదిలేక కడుఁజింతన్ నిల్చెనో నాఁగ నొ
ప్పును రాజోపలనిర్మితాయత మహాభూయిష్ఠ సోపానముల్. 40

మ. ఘనవేశ్యాజన హేమసౌధ పరివర్గస్థాపితాదర్శ పా
ళిని జాలాంతరదృశ్య బుతగణలాలిత్యోరు ముక్తావళీ
ధనమొప్పించి రమించఁ దద్ధనమురిక్తంబైన కాలవ్యధం
గనిమిధ్యావిటులంచుఁ గట్టిరనఁగాఁ గన్పట్టుఁజిత్రాకృతుల్. 41

మ. ఘనజాంబూనదనీల వజ్రకృతరంగ త్సౌధపాళీచర
ద్వనితావ్రాతముఖాబ్జగంధకలనాస్వాదేచ్ఛ రాఁదేఁటులం
గని తత్కాంతలు నేత్రవైరమునఁ జిక్కంబట్టఁ బల్మాలలం
జొనుపన్ జాలములందుఁదోఁచెనన సంశోభిల్లెధూమావళుల్. 42

శా. జీమూతంబులు తత్పురీవరమునం జెన్నారుసౌధాద్రులన్
భీమప్రౌఢిని గప్పగంతల నతుల్ వీక్షించి రోషాత్ములై
యామేఘంబులఁ బట్టికొట్టి కడు నుద్యద్దీర్ఘవత్కేచక
స్తోమాగ్రంబులనిల్పిరోయనఁ దనర్చుంగేతన వ్రాతముల్. 43

క. ఉన్నత సౌధాగ్రంబులఁ
జెన్నగు పాంచాలికల విశేషము లెన్నం

గిన్నెరలు మీటివేలుపుఁ
గన్నెలు తానములఁ జొక్కు కరణిందనరున్ 44

గీ. సౌధ శిఖరస్థహేమ భాస్వత్కలశము
లభ్రభాగీరథీ సంభ వాబ్జకోర
కంబులని దేవకాంతలు కరతలములఁ
ద్రెంపరాకున్కి వ్రీడఁ జింతింతురాత్మన్ 45

మ. కనకోద్యన్మణిసౌధరశ్మి చపలౌఘంబంచుధారాధరా
శినిజ స్త్రీలనిడాయ తద్ఘనుల నాళికాక్షులాత్మీయ నూ
తన ధమ్మిల్ల సమానవైరజని తాత్మక్రోధులై త్రుంచి గె
ల్చినవేడ్కన్ ధ్వజకోటినిల్పిరనఁ బొల్చెన్నీల చేలౌఘముల్.

మ. వరసౌధాంతర నిర్మితైందవ శిలావర్గంబు చంద్రప్రభం
గరగందత్కమలాళి దీములగుచుం గాల్రవ్వఁగాఁదోఁచెఁగా
కరవిప్రాంశువులంటు వారిగ్రహసంఘం బాధరామండలిం
దొరగంజేయుట తత్ప్రభావ గరిమందూఁగున్ దవీకౌఘముల్. 47

మ. వరకేళీవన చంద్రకాంత కుసుమాంభఃపూరయంత్రంబు భా
స్వరమైయొప్పె సువర్ణరత్నమయ శుంభత్పట్టణ శ్రీధ్వజాం
బర హస్తంబుల పాద్యమిచ్చి బహుపుష్పశ్రేణిఁ బూజించె నో
కరమంభోజ దళాయతాక్షుపద ముత్కర్షేచ్ఛనానిత్యమున్. 48

చ. పురితరుణీకుచంబులను బూసిన కుంకుమ గంధసారముల్
నిరతము కేళికాఝురము నీటమునుంగఁ గరంగితజ్జలం
బిరవుగఁజేలనాని పలియించె ననందగె రాజభోగ సుం
దరతర చిత్రధాన్యములు తద్ధరణీభువన ప్రకాశతన్. 49

మ. కలితాభ్రంకషసౌధ సంఘటిత రంగత్స్వర్ణకుంభావృతో
జ్జ్వలతారోపల చిత్రపఙ్క్తిదనరెన్ శైలాగ్రమందుండి యు
త్కలికామాన వినూతనామ్ర ఫలసంఘ భ్రాంతినల్లేగి యం
తల సమ్పూతఫలాలిగా కునికిఁ జింతన్నిల్పు కీరాళినా. 50

సీ. వేదశాస్త్రపురాణ వివిధ విద్యాధ్వర
ప్రౌఢిఁజెన్నలరు విప్రవ్రజంబు
గజతురంగాందోళి కాస్యందనారోహ
పటిమ భాసిల్లు భూపాల జనము
ధన ధాన్య రత్న గోధన కృషి వాణిజ్య
భాగ్య సంపద నొప్పు వైశ్యగణము
అగ్రజన్మనిరంత రాజ్ఞాప్రవర్తన
భద్రవృత్తిఁ జెలంగు శూద్ర కులము

గీ. భూరి నిత్యాన్నదానతపో విభూతిఁ
బ్రకట కీర్తిపరాక్రమ ప్రాభవమున
దాన ధర్మాభిరతిని శ్రీ ధరునిసేవఁ
బరగి విహరింతు రిట్టు లప్పట్టణమున. 51

ఉ. విలసత్కుంభ విజృంభణంబు లబలల్ వీక్షించి కూర్పాస కం
బులలో దాచిరటంచు శేషనగరాడ్భూజానికిందెల్ప సం
చలతం బొంది ధరాపరాగమునిజాం చద్గండభాగంబులం
దలరందుండములెత్తి కోట గవనిస్ వ్యాపించు మత్తేభముల్. 52

ఉ. పురికంఖాణ కదంబధాటినిలస త్పుంఖాఖురోద్ధూతదు
ర్భరధాత్రీరజమెల్ల సాగరములం బంకాకృతిం జేయున
త్తటిమాతంగ నితాంతకర్ణవమధు ప్రాఘిష్టవాతాహతిన్
విరియం జేయఁగ వారణంబులనఁగా విఖ్యాతిఁగాఁచెంగరుల్. 53

. మునినయనాగ్ని పక్షయుగముల్ దెగిపడ్డ నిరాకరించున
ప్పనమృగ కోటులంచునట వానింగనుంగొనరోసి నిల్చెనో
యనగరుడాద్రివాసినగ రాంతరభూముల హేమపట్టముల్
కనుగవలందు రంజిలఁగఁ గానఁగనయ్యెఁ దురంగరత్నముల్. 54

క. రంగ న్నిశాంగనాధవ
సంగతి నుప్పొంగు దుగ్ధసాగరజనితా
భంగ తరంగమ్ములనసె
సంగుహోరంగగు తురంగసంఘము లెలమిన్. 55

సీ. గంధసింధురయాన కాంచన సుమనాస
బిసబాహువల్లరి భసలనేత్ర
కోమలాంభోజాంఘ్రి గురుసైకతనితంబ
క్రముకపృధ్వీజాత కంఠమూత
పల్లవపాణి, సం పుల్లగుచ్ఛ స్తని
పున్నాగనాభి క ర్పూరగంధి
పాండుకోరకదంత పాళి, కోకిలవాణి
రంభోరు యుగమృగరాజ మధ్య

గీ. నవలతాతన్వియిట్లు నాతిలీల
నలరెశశి కాంతసంఘటి తాలవాల
సాలకాసార చారు మ రాళమృగ వి
శాలభాసుర కేళివ నాళియుచట 56

సీ. కమనీయ వజ్రకం కణకాంతిఁ దగురక్త
జలజముల్ ధవళాంబు జంబులనుచుఁ
గురువింద ముద్రికాం కురదీప్తిపుండరీ
కంబులు నరుణాంబు జంబులనుచు
వరపుష్యరాగభా సురహారరుచి నీల
కైరవంబులు చంప కంబులనుచు
నీలంపు ముంగర డాలుభాసిలు చంప
కంబులు నీలోత్ప లంబులనుచు

గీ. నిటునటుఁ గలంచి విటకోటి నటుభ్రమించి
చాటుచతురంపు మాటల నూటినొసఁగి
ధనముఁగొని మానధనము పెం టనెహరింతు
రనిశమును బుష్పలావిక లప్పురమున. 57

సీ. అలకంధరముఁబోలు టరిదియే పాదముల్
కమనీయతరనీర జములఁబోలు
నలపాదములబోలుఁటరిది యే నేత్రముల్
మంజుల రాజీవ మహిమఁబోలు

నలనేత్రములఁబోలుఁ టరిది యే గమనంబు
రమణీయసారంగఁ రాజిఁబోలు
నలగమనముఁబోలు టరిది యే ఘనవేణి
ప్రాంచదండజ వంశ భర్తఁబోలు

గీ॥ శంఖకూర్మ సరోజ పైసారిణాళి
కరిమరాళ భుజంగ మ ఖ్యాతినవయ
వప్రకాశత శోభిల్లి వారసతులు
వేడ్కవిహరింతు రప్పుర వీధులందు. 58

ఉ. వళులను మెట్టులూరులను వంతరనిల్పిన రంభలున్ దనూ
జ్జ్వలరుచివారి పూరవిభవంబునుగా గణికాలలామలన్
బలువగు పేట కాంద్రధరపల్లవముల్ గదియించి మోహకం
దళమను తొండమందు విటదంతులఁజేర్పుదు రప్పురాటవిన్. 59

ఉ. రంగుచెలంగ కిన్నెర లురంబునఁజేర్చి నఖాళిమీటిసా
రంగ సమాఖ్య రాగ మలరం బలికించి మృగాళిరాఁగవా
రాంగనలెల్ల సౌధశిఖ రాగ్రములం బెనఁగింతు రెంతయున్
నింగినిలింప భామినుల నేకవిధంబుల గ్రేణిసేయఁగన్. 60

సీ. జంభారిమణి విభా దంభజంబూభుక్త
బహులదంతచ్ఛిన్న భల్లుకంబు
పటుపద్మరాగ ప్రభావ్యాజబింబికా
స్వాదచంచూభంగ వనశుకంబు
వరదివ్యగారుడో పలకాంతి కపటరం
భాతుండనిర్భిన్న వారణంబు
వజ్రదీప్తిభ్రమా వారిసంప్లావన
క్షతవిషాణోదగ్ర సైరిభంబు

గీ. చారు విద్రుమరుచిరమ్ము షారసాల
కోమలదళౌఘ వైఫల్య కోకిలంబు
నభ్రమంబిత చక్రదే వాలయంబు
మౌనిసేవ్యంబు వేంకట క్ష్మాధరంబు. 61

మ. ధరశేషాచల బద్ధగారుడలస త్సౌపాన సంఘాత సు
స్థిరసంధ్యాసమయ ప్రదీపతతి బొ ల్చెన్ స్వామికైరాత్రియన్
దరళాక్షిన్ గగనస్థలంబున శర త్సైరంధ్రి కై సేత య
త్తరుణీ కంఠ విలంబమాన కురు విం దస్ఫార హారాకృతిన్. 62

మ. సరిగా సచ్చరు లిచ్చ కిన్నెర లుర స్థానంబులం జేర్చి య
త్తఱిగుండ క్రియమేఘ రంజియను గీతం బొప్పఁగాఁదంత్రులం
బరిపాటింబలికింపఁ దజ్జనిత శుంభన్నీర ధారాళినా·
గిరి గండోపలపఙ్క్తుల న్వెడలె నక్షీణారుణోద్యజ్ఝరుల్. 63

గీ. భాసురాంభోజ రాగ రు క్పటలి వెలుఁగ
నున్నతంబైన తీవిచే నొప్పి దేవ
తాల యాగ్రస్థ కనక కుంభాళి గగన
తరళ నేత్రకుఁ జెందమ్మి దండఁబోలె. 64

సీ. దంభోళి ధర చతు ర్దంతి సంతతిమత్త
దంతులనా వజ్ర దంతిచయము
రథభారమున కతి శ్రమ నిల్చు మార్తాండ
హరుల నా గరుడాశ్మ హరి నికరము
స్వర్ణదీ క్రీడాని సర్గ శైవల యుక్త
హంసల నా నీల హంసతతులు
గజ కుంభ రక్తార్ద్ర గాత్ర సింహముల నాఁ
జెలువారు కురువింద సింహగణము

గీ. గారుడ త్రాసకంటక క్షత శరీర
కలిత ఫణులన గోమేధి కంపుఫణులు
హాట కద్వార కుడ్య కవాట చిత్ర
భాసుర స్ఫూర్తి ప్రాకార పటిమఁదనరు. 65

సీ. సతత సుగంధ మి శ్రిత వాయు భరమాను
హరిణంబులన నీల హరిణగణము

జింక మోములు దక్క జిక్కుసంగములు మె
క్కినవులు లన పచ్చ పని మెకములు
బెబ్బులి కొదమల నుబ్బడంపఁ గడంగు
సింహంబులన వజ్ర సింహచయము
హరిమధ్యముల కుత్త రాంగముల్ సగమిగి
కబళించు శరభ సం ఘాతములును

గీ. జారు గోమేధి కంబుల శరభ సమితి
శరభములఁ గట్టి గమకించు బలజ రాగ
వీర భటకోటులఁ జెలంగి వివిధ చిత్ర
మహిమఁ జెన్నొందు ప్రభుదివ్య మందిరంబు 66

మ. భువిజేగంటల నాద మెప్పెసఁగె కం బుధ్వాన సంయుక్తమై
రవికాంతాలత భూమి దేవనిలయ ప్రాకార లక్ష్మిన్ స్ఫురీ
ద్భవన భ్రాజితలక్ష్మి జూచుతఱి గా ఢాలింగనాంగ ద్వయో
ద్భవ బాహాంచితభూషణ స్వనమనాఁ బ్రత్యూషసాయంబులన్. 67

మ. ధరణిన్ వేంకటభర్త పార్శ్వ కురువిందద్వంద్వ కాంతిచ్ఛటల్
మెఱయున్‌గాన కళావిధిజ్ఞులు నఖాళీ మేళనాభ్యాస బం
ధురతన్ వీణలయందు దీపకలికం దోద్తోడఁ బల్కింప సు
స్థిరతన్ వెల్గెడి తైలరిక్త విలన ద్దీపాళినా నిత్యమున్. 68

చ. గిరిసుత వామహస్తమునఁ గిన్నెరందాల్చి నఖాళి శంకరా
భరణముమీట, గానరతి బాము లనేకము జుట్టఁబన్నగా
భరణుఁ డనంగసార్థకము బాటిలె నట్టి గజాసురేంద్ర సం
హరణుఁ డఖాంతకుం డభవు డప్పురినిల్చెను క్షేత్రపాలుఁడై. 69

సీ. అక్షరాలంకార లక్షణకలిత గాం
ధ ర్వేతి హాసవే దండ వైద్య
గణిత సాముద్రికా గమవైద్య గోచార
వహ్ని జలస్తంభ వాది శాస్త్ర
భరత కళాశాస్త్ర వాయుబంధన శిల్ప
మార సంజీవనీ మంత్ర యంత్ర

యోగ తర్కా కర్ష ణోచ్చాట నాంజన
గజకర్ణ గోకర్ణ గమకవాస్తు

గీ. లక్షహృదయ మహేంద్ర జా లాస్త్ర శస్త్ర
జ్యోతిషా నింపేగ క న్యాది వాద
గాన రసవాదమణి పర కాయ ముఖ్య
విద్యలందును నేర్పరుల్ వేనవేలు. 70

క. ఆపట్టణమున కధిపతి
య్యై పరగును వేంకటేశుఁ డతఁ డమి తారి
క్ష్మాపాలకుంభి దళన
వ్యాపార నిశాత బాణహరి నఖరుండై. 71

సీ. తనదివ్య ఖడ్గ ప్ర తా పాగ్ని కన్య రా
ట్సంపదల్ కాంతార చయముగాఁగఁ
దనశుభకీర్తి వి స్తారహంసమునకు
శత్రుకాంతాశ్రువుల్ సరసిగాఁగఁ
దన భుజాబల సముద్భవ జయేందిరకరి
పట్టణంబులు నాట పట్లుగాఁగఁ
దన మహా దాన జీవనఝష ధ్వజునకు
విమత వర్గముసైకతములు గాఁగఁ

గీ. దన సుగుణభవ్య మందార తరు లతాలి
కఖిల తారాగ్రహంబు లుదారకుసుమ
గుచ్ఛములుగాఁగఁ దనరు వైకుంఠ పట్ట
ణేశ్వరుండగు శ్రీ వేంకటేశ్వరుండు.

సీ. విదళించునెవ్వాని విమలనామాభ్ర గం
గాజలంబునజగ త్కల్మషంబు
భరియించునెవ్వాని భాసురోదరమునఁ
బంకజాతభవాండ భాండసమితి
ఖండించునెవ్వాని కరుణారసంబున
చక్రంబుననిశాట సముదయంబుఁ

గలిగించునెవ్వాని ఘనహస్తవిన్యస్త
భక్త సంతతికిఁగ్రై వల్యపదము

గీ. జగములెవ్వాని సత్త్వర జస్తమోగు
ణములసంభవసంస్థితి నాశములగు
నట్టి వైకుంఠపురవాసుఁ డైన విష్ణుఁ
డవతరించెను శ్రీ వేంక టాఖ్యనలరి.

సీ. వితతసోపాన సం తతియయ్యెనెవ్వాని
కరఖడ్గమరులు నాకమున కరుగఁ
జెదరి దిక్కులఁబర్వఁ జేసె నెవ్వనిబాణ
గరుదనిలమ్ముపైరి కంథరముల
వెలయుచీఁకట్లు గా వించెనెవ్వని సైన్య
పాదధూళివిరోధి పట్టణముల
దావానలస్ఫూర్తిఁ దనరారెనెవ్వాని
ఘనకోపమన్య రా ద్గహనమునకు

గీ. ననుచు బ్రహ్మాదిసురలెల్ల నభినుతింప
మహిఁదనరుచుండు శేషాద్రి మందిరుండు
హయసుపర్ణుండు జలధల శ్యామలుండు
హేమచేలుండు శ్రీ వేంకటేశ్వరుండు 74

సీ. అలఁతపాల్పడదహో ర్యద్వీపముద్రి తా
ఖిల సముద్రములు లంఘించువేళ
భయముఁజెందదుతమః పటల దుర్దాంత పా
తాళలోకంబునఁ గేలిసలుప
జంకదించుక నిరా తంకవృత్తినసంత
కమల జాండంబుల గంతులిడఁగఁ
గాంతిఁ దప్పదుకోటి కల్పముల్ జన్న ను
దృద్దీప్తిగాఢమై తనరుచుండు

గీ॥ ననుపమవిలాసవైఖరి నతిశయిల్లి
యిట్టి ప్రాగల్భ్యరీతిఁ దా నెట్టునేర్చె
గారుడాచల విభుహస్త కమలజనిత
దివ్యమంగళనవ్య స త్కీర్తికన్య. 75

మ. ధరణిన్ వేంకట భూధరప్రభుసము ద్యత్కీర్తియన్ రాశిన
య్యరవిందోద్భవునంగుళద్వయమితం బభ్రష్టలింగైరవీ
వరుడన్బస్తముచేఁ వ్యయింప నచటన్ వర్ధిల్లెశీతాద్రి య
త్తఱిపంజ్ఞార్థమునిద్ధప్రోవులనఁగాఁ దారౌఘమొప్పారెడిన్. 76

మ. ధరణిన్ గారుడశైలభర్త కరజాతంబైన సత్కీర్తివ
ల్లరితారాపథమన్న చప్పరమునిం డంబ్రాకి తద్విక్రమ
స్ఫురణంబన్ మధువందుబుత్కలికల్ శోభిల్లెచంద్రుండనా
సెర మొగ్గొక్కటి పూయపెల్గెనిఁకన స్నింబూయ నెట్లుండునో 77

క. ధరమీఁద వేంకటేశ్వరు
సురుచిరతరమైనకీర్తి శోభిలె హిమవ
త్స్ఫుర శైవలినీపురజి
త్కారిభిచ్ఛురదబ్జచంద్రికానిభమగుచున్. 78

సీ. అర్కోదయంబున కటమున్న సంగీత
నిగమపాఠకవాద్య నృత్యగోష్ఠి
యామంపుప్రొద్దున కటమున్న మజ్జన
పూజావిలేపన భోగగోష్ఠి
యామద్వయంబున కటమున్నదర్శనో
ద్యోగధనార్జన స్తుతులగోష్ఠి
యామత్రయంబున కటమున్నదధ్యాజ్య
శర్కరాపూపప్ర సాదగోష్ఠి

గీ. సంజజామున కటమున్న సకలదాస
మౌని గణికాప్రదీపికా యానగోష్ఠి
యర్ధనిశి లక్ష్మి తోడనే కాంత గోష్ఠి
తనరు వేంకట భర్తకి ట్లనవతరము.

## వేంకటేశ్వరుండు కొల్వుండుట

సీ. రాజీవములకన్నఁ దేజరిల్లు కన్నుల
పక్వబింబాధరుల్ పాడుచుండ
సంచలేనిసువుల మించుయానంబుల
పూర్ణేందుముఖులు తాంబూలమీయ
మించుతీవెల ధిక్కరించు గాత్రంబుల
పద్మపాణులువింత పడగఁబట్ట
జీమూతపఙ్క్తిదీ ప్తేయుకచంబుల
తరుణులు తాళవృంతములువీవఁ

గీ. బసిఁడిబెత్తంబు పావజోడు
వరుసఁదాల్చివిలాసినీ వతులుగొల్వ
నమలనవరత్న కనక సింహాసనమున
నిండుకొల్వుండె మధుదైత్య ఖండనుండు. 80

సీ. ఒక వంకవైష్ణవు లకలంకద్రవిడ ప్ర
భాషాప్రబంధాళిఁ బల్కుచుండ
నొకపఙ్క్తి భూసుర ప్రకరమత్యంతాభి
లాషవైఖరివేద ఘోషణింప
నొకపజ్జఁబండితుల్ ప్రకటపురాణేతి
హాస తర్కాది విద్యలు పఠింప
నొకయిక్కసుకవి గాయకసమూహము నిజ
బిరుదాంకములుభక్తి నెరపు చుండ

గీ. నొకదిశ నమాత్యదండనాయకులు గొల్వ
సరసచక్రాది సాధన సమితి మెఱయ
మహిమఁజెన్నొందు నాస్థాన మంటపమున
నఖిలభక్తులు సేవించు నవసరమున 81

సీ. కాంచి పాంచా లాంధ్ర గాంధార కాశ్మీర
వంగ ప్రాగ్జ్యోతిష వత్సలాట

కర్ణాట మహారాష్ట్ర కర్హాటసౌవీర
కామరూపత్రిగర్త గౌడద్రవిడ
కోంకణటేంకణ కోసల కర్ణోజ
బంగాళకేరళ పాండ్యమగధ
మద్ర బర్బర సింధు మలయాళ బాహ్లిక
నేపాళకాంభోజ నిషధ యవన

గీ. కుంతలావంతి కేకయ కురు విదర్భ
ఘూర్జర కళింగ దాశార్ణ కుకురభోజ
సాల్వమిథిల పుళింద మత్స్య నృపముఖ్య
జనములర్పించు ముడుపులు సంగ్రహించు. 82

మ. వరరక్తాంశుక దీప్తిమిన్నలమర్రా వస్ఫురతాటంక రం
ధ్రరవిప్రాంశువులొప్ప కొప్పుముసుఁగుల్ రంజిల్ల నీరాడి భ
క్తిరహిన్ వేంకటభర్తగాన కరముల్ గీలించి ధర్మంబులన్
గురురత్నంబులఁ బాళ్ళమాత్య యువతుల్ గొంపోదురె
క్కాలమున్ 83

మ. కటులన్ వల్వలుజుట్టి చన్గవలఁజక్కన్ లేపముల్ బూసి సం
పుటహస్తంబుల రౌప్య కాంచనసుమం బుల్ కాన్కకై పూని వేం
కటభర్తంగనదాక్షిణాత్య యువతుల్ కౌతూహలస్వాంతలై
పటుసోపానములందు మ్రొక్కులిడుచుం బ్రాపింతురెక్కాలమున్. 84

ఉ. ఫాలములందుచందనము భాసిలగౌడల పేర్లు కంఠ స
న్మాలములన్వెలుంగఁగరము ల్మకుళించి సమాధియోగ లీ
లాలసితాత్మభక్తి కమలావిభుఁగొల్చుచు భూసురోత్తముల్
వ్రేలుదురన్నగాగ్రమణి వేదికలందును మోక్షకాములై. 85

సీ. అరుణోదయంబున కటమున్నమజ్జనం
బాడియాచమన కృత్యములుదీర్చి
తిరునామములు చాంది తిరుమంత్రము జపించి
సారిదినీర్కావివే ష్టువులుగట్టి
తులసి పేర్లుధరించి నిలయముల్ వెలువడి

కోవెల కేగు బెంద్రోవగురుల
కన్యోన్యదాసోహ మమరసంసేవించి
పద్మాక్షుకైంకర్య పరతఁదీర్చి

గీ. పడిప్రసాదముల్ గొని తిరువళిఘుకెరగి
ద్రవిడసూక్తులు నొడివి సాదములుమెక్కి
దంపతీయుక్తముగ నిరంతరముఁబొల్తు
రనఘ శ్రీ వైష్ణవోత్తము లప్పురమున.

చ. తిరుమణి పాలభాగములఁ దీర్చికరంబుల దంతికర్ణముల్
మెఱయఁగఁగావి వస్త్రములు మేదులకింపఁగఁ దామ్రపాత్రముల్
శిరములఁబూని పద్మతుల సీవనమాలిక లొప్పనిందిరా
వరురమణీయకీర్తనలు బాడుచు దాసరులుందురప్పురిన్. 87

సీ. గతమయ్యె కలికాల కలుష సంఘాతంబు
బహుదురాచార సంపర్కమడఁగె
సమవృష్టి భూమిసస్య సమృద్ధిఁజెన్నొందె
క్షామంబు పంచబంగాళమాయె
నఖిలవర్ణాళి సదాచార రతిఁబొల్చె
పరబాధకము పటాపంచలయ్యె
వన రాజిఫలపుష్ప భరితమైతనరారె
జనలోకమానంద సరణిఁగాంచెఁ

గీ. గవిగణంబు పయఃపూర కలనఁబొదలె
నిత్యకల్యాణ యుక్తమై నెగడెలోక
మంబుజోదరుండైన శేషాద్రివాసుఁ
డింపుదచుకొత్త ధాత్రిఁ బాలింపుమండ 88

గీ. శంఖచక్ర గదా ఖడ్గశా ర్ఙ్గ సమితి
హస్తములఁదాల్చి గరుడ వాహనము నెక్కి
వేంకటాచలవాసుండు వేటగోరి
మలయగిరికాన కేగంగ మదిఁదలంచి 89

## శ్రీ వేంకటేశ్వరుండు వేఁటకేగుట

వ. ఇట్లనంత వైభవంబున మృగయావినోదార్థం బంగీకరించి వేంచేయునెడ శ్రీమన్నారాయణ చరణకమల సేవా (కైంకర్య) ధురీణులగు వైష్ణవ సహస్రంబులును, శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన క్రియాపట్వాధర్మ ప్రవీణులగు యజన పౌరాణిక తార్కిక తాంత్రిక పండిత కవిశేఖర పురోహితాది మహీసుర సహస్రంబులును, పరమభాగవత మంత్రి సామంత భృత్యమిత్ర సైన్యాధిప సహస్రం బులును, వంది మాగధ వైతాళికగాయక గణికాఫణిహార వేత్ర హస్త చామరాతపత్ర ధర్త, దాసవార్తావహ పరిచార పరిహాసక సహస్రంబులును, గంధ కర్పూర కస్తూరి కాగరు చందన సురభి కుసుమ వీటిపేటికాది వస్తు సంభరిత భరణ వైభవులగు విలాసినీ సహస్రంబులును, భాస్కర హయంబులను విడంబించు వేగవంతంబులైన వారువంబులంబూన్చిన దివ్యకనక రథసహస్రంబులును, వియ ద్ధునీతరంగంబులం దెగడు జవవత్తురంగ సహస్రంబులును, తిరస్కృ తాశాదంతి నికరంబగు దంతావళ సహస్రంబులును, చక్రచాపబాణ కుంతశక్తి పరశు తోమరభిండివాలగదాముద్గర క్షురికాశతఘ్ని, ప్రాస ముసలకృపాణ ప్రముఖాది వివిధాయుధ పాణులగు వీరభట సహస్రంబులును, బలిసి యిరు కెలంకుల వెనకముంగలఁ బరివేష్టించి తత్తదుచిత యానంబుల మణి విరాజి తానే కభూషణా లంకృతులై కొలువ భేరీమృదంగాది పంచమహావాద్యంబు లులియ ననంత వాహినీ పరివృతుండగు సాగ రేంద్రుండునుం బోలివెలుంగ నయ్యవసరంబున.

సీ. కలిత భేరీమృదం గధ్వానముద్దండ
బ్రహ్మాండ పంక్తులు బగులనడువ
బహువిచిత్రధ్వజాంబర మారుతాహతి
నాపోదములఁబటా టోపముడుప
శితశస్త్రసాయకాం చితదీప్తి మార్తాండ
కిరణజాలంబులఁ గ్రిందుపఱుప
ఘనచమూపాద నిర్ఘాతఘట్టనముల
ధరణీధరాహిమూర్ధములు చెదర

గీ. గంధసింధుర దానార్ద్ర కర్దమాఢ్య
మధిగమించుచు శీఘ్రప్ర యాణగరిమఁ
జనియె జందనశైల విశాలకాన
నాంతరమునకు మధుకైట భాంతకుండు. 91

మ. అటఁగాంచెన్ గరుడధ్వజుండు రమణీయ స్వర్ణరత్నప్రభా
పటలాక్రాంత దిగంతరాళము, లస త్పాటీరవృక్షావృతో
త్కటభోగీంద్ర మణిద్యుతి స్థగిత రంగద్గహ్వర వ్రాతముం
జటులోదార సుగంధమారుతము చం చచ్చందనగ్రావమున్. 92

మ. పటుకుంభి స్ఫుటకుంభనిర్దళన శుంభత్సింహసంరంభమున్,
కటకధ్వాంతగుహా సమీరణమృదంగ ధ్వాననాట్యైకశా
పటికవ్రాతము, నిర్ఝరోరుసికతా ప్రాంతస్థముస్తాగణ
స్ఫుటనిర్భేదవరాహజాలము మహా భోగీంద్రసంచారమున్. 93

మ. గిరిపాంతం జనికాంచెశేషనగరా ఢ్గిహస్థితుండంతశా
బరకాంతోరు కుచాగ్రరత్నఘటిత ప్రాంచద్విపంచీలతా
కరశాఖోద్భవ మధ్యమస్వరభయా క్రాంతావనీభృత్తటో
పరిసంజాత నదీస్థలాంత చలన భ్రంశాండజ వ్రాతమున్. 94

ఉ. హీరదరీముఖంబు నరుణేందుశిలామయ మండజేంద్రసం
చారసరోవరాంతరము షట్పదగాన విలాసమామ్రరం
భారమణీయ మభ్రగవి భాసురమున్ త్రిదివేశ రాట్పురీ
చారుముఖీ ప్రవర్తన విశాలము తద్గిరిసానుదేశమున్. 95

ఉ. చారుమరంద పాన వివశభ్రమరాంకము నీలకంఠ వి
స్తారనితాంత నాదము ర సాలపలవ్రజఖాద్యశౌక శృం
గారవచో విలాసము, సు గంధతరు ప్రసవాభిరామ సం
చారనవీనవాత మురు చందనశైల వనీనికాయమున్. 96

గీ. రతివిభుండేయు మల్లికా ప్రసవశరము
లాత్మఁదగిలిసఁగడునొచ్చి యలఁతనొందు
పాంథతతి మాడ్కినంచలు బాతీవ్రాల
కంపమొందు సరోజాళిఁ గాంచె విభుఁడు 97

సీ. గొజ్జంగి తెలినీట మజ్జనంబాడిచెం
గలువపూవన్నె వల్వలు ధరించి
గోవజవ్వాదిబా గుగదావిదులకింపఁ
గమ్మకస్తూరి నిగారమ్ము చెలఁగఁ
బసమించుపచ్చ కప్రపుదుమారముచిండ
సొగసుగేదఁగి పూల శోభదనర
నేలాలతాతన్వి సెనయఁగొఁగిఁటఁ జేర్చి
సరసాళు లుభయ పార్శ్వములనడువ

గీ. మల్లెపొదరిండ్ల ద్రాక్షపందిళ్లఁజేరి
విమలకాసార చారుతీరములఁదారి
సకలఫల సాంద్ర వృక్షవాటికలఁగేరి
యచట విహరించు గంధవాహప్రభుండు 98

గీ. ఇట్టి కాంతారవీధి ననేకశరభ
గండభేరుండ శార్దూల కరిమృగేంద్ర
ఖడ్గచమరీ లులాయ సూకరకులాది
బహుమృగంబుల వధియింప భటులుగడఁగి. 99

సీ. బాహుబలోద్వృత్తి పరశుధారల మహో
ద్దండ గండకములఁ జెండి చెండి
పదములు ఘట్టించి పటుగదాతాడనం
బులఁ గుంజరంబుల మొత్తి మొత్తి
యట్టహాసస్ఫూర్తి గట్టిఖడ్గంబులఁ
జమరీమృగంబులఁ జంపి చంపి
భీషణాటోపతభిండి వాలంబులఁ
గొదమ సింగంబులఁ గొట్టికొట్టి

గీ. నిశిత శరవృష్టి శరభాళి నిగ్రహించి
చక్రముల గండభేరుండ సమితి నేర్చి
తోమరంబులఁ గిటికోటిఁ దునిమివైచి
వెలసి రిప్పాటకాననలో వీరభటులు. 100

సీ. దండిమైనొక్కఁడు ద్దండచండకరాజు
పదలాఘవంబునఁ బట్టి తెచ్చె
సూటిమీఱంగబ ల్పోటరియొక్కండు
కమ్మకస్తూరిమృ గమ్ముదెచ్చెఁ
బిన్నపయస్సునఁ బెంపొందు వాఁడొక్కఁ
డేనుఁగుఁ కడకాలి నీడ్చి తెచ్చె
బలిమిమై నొక్కండు పటుజవంబున గబ్బి
కడిఁదిసింగఁపుఁ బిల్లఁ గట్టి తెచ్చెఁ

గీ. బలు తెఱంగుల నురులొడ్డి భటుఁడొకండు
గోవజలవ్యాది పిల్లులఁ గూల్చి తెచ్చె
మఱియు నిప్పాటఁ దెచ్చిరి వరుసతోడ
భక్తిదళుకొత్త వేంకటప్రభుని కడకు. 101

సీ. చంద్రికారుచిమించు చమరువాలంబులు
నెర్రమైనగోవకస్తురిబిడారు
పరిపక్వమైవ్రాలు చెఱకుముత్తియములు
పసగుల్కుపచ్చక ప్రపుదుమారు
కొనలు మళ్లనిమంచి వనకరిదంతముల్
తేవమీఱెడి చిన్ని పూవుదేనె
జోకలీనెడిమేల్మి లాకిగంధపు తుండ్లు
ముదురు చెట్లనుబండు వెదురుబ్రాలు

గీ. చారుతరమైన నెమలి పింఛములబారు
పాండురంబగు నివ్వరితండులాళిఁ
దెచ్చిదేవాదిదేవుని దివ్యపాద
సన్నిధినొసంగి మృగయు లుత్సాహమునను 102

క. సేనాసమేతముగ న
క్కాననమునఁ గొంతప్రొద్దుగడిపి పటుధను
ర్జ్యానాదశంఖ భేరీ
ధ్వానంబులుజెలఁగఁ బనిచెఁ దత్సమయమునన్. 103

మ. అలగంధాచల హేమ శృంగరచితో ద్యద్రత్నధామంబునం
గలకంఠీమణులెందఱేని( గొలువంగా( జెంచుపూబో(డి రా
చిలుకం గేలధరించి ముద్దుపలుకుల్ జెన్నారవేడ్కన్ సము
త్కలికానూనవిలాస వైభవవినోద వ్యాప్తి(గ్రీడించుచున్ 104

స్రగ్విణి. భేరికానాదముల్ పిక్కటిల్లన్ పనిన్
ఘోరసింహంబు లాక్రోశముంజేయు(గా
నీరవంబెద్ది యూహించి వేరమ్మనం
జారుకీరంబు నాంచారు కార్యార్థమై. 105

క. చని యక్కాంతారంబున
వనజాయత( నేత్రుసుభట వర్గంబున ద
ర్శనమగు విచిత్రచరితము
వినయంబున(గాంచి మరలి వేడుకతోడన్ 106

గీ. వచ్చిశాబరకన్యా నివాసభూమి(
జొచ్చి నెచ్చెలులెల్ల( దన్మెచ్చి చూడ
నతిమధురవాక్యపటిమ నయ్యతివతోడ
విన్నవించె శుకేంద్రు( డవ్విధము( దెలియ 107

**చిలుక వేంకటేశ్వరు చరితము చెంచుకన్యకకు(దెలుపుట**

సీ. ఫణిరాజతల్ప శుంభద్దివ్య వైకుంఠ
మందిరుం డిందిరాసుందరుండు
కంబుసన్నిభకంఠ కలితకౌస్తుభ రత్న
భూషణుం డతిమంజు భాషణుండు
భీషణగ్రాహసం పీడ్యమానకరీంద్ర
రక్షణుం డసురేంద్ర శిక్షణుండు
చండపరాక్రమోద్దండ హిరణ్యాక్ష
ఖండనుం డురురత్న కుండలుండు

గీ. జంభశాసన మణిఘన శ్యామలుండు
శంఖచక్రగదా ఖడ్గసాధనుండు

తరుణకమల విశాల నేత్రద్వయుండు
స్వప్రకాశుండు శ్రీ వేంకటప్రభుండు 108

వ. ఈజగ మేలుచుండు తరుణేందు విలోకనుఁడాత్మభక్త పం
కేజవన ప్రభాకరుఁడు కీశచమూవర రాజ్యదాయ కుం
డాజిధనుర్విముక్త విశిఖాహతదానవ రాణ్ణికాయుఁడం
భోజభవాభవ త్రిదశపూజిత పాదసరోజుఁడంగనా. 109

మ. వసునీలాంబుజ రాగవిద్రుమ లసద్వైడూర్య వజ్రావళుల్
వెసతోఁదెచ్చి నిజాఖ్యలుల్లసిలఁగా వేడ్కన్ సమర్పింతు ర
వ్వసుదిక్పాల విరించి శంకర మునివ్యాళేంద్రగంధర్వ సి
ద్ధసురవ్రాతము గారుడాచల నితాంతస్థాన సంవాసికిన్ 110

గీ. నాగగంధర్వ యక్ష కిన్నర విహంగ
సాధ్య విద్యాధరామర చారణ ప్ర
సిద్ధముఖ్యులు భుజగేంద్ర శిఖరిఁజేరి
యాటపాటల విహరింతు రనవరతము 111

గీ. ధరణిరాజన్య కన్యాశతంబులెల్ల
కమలదళనేత్రు రూపంబు కనకపటము
లందు లిఖియించి కేళికామందిరముల
నిలిపి తద్ధ్యానవృత్తి వర్ణింతు రబల 112

క. ఆసుకుమారంబా చెలు
వాసాగసామ్యుదువుఁజూచి యనిశము కంద
ర్పాశుగశిఖిమన మెరియఁగ
నాసనుగవయంగఁజూతు రంబుజపాణుల్ 113

సీ. శేషాద్రివాసనీ శ్రీముఖాబ్జమెకాని
వీక్షింపఁబోవు మద్వీక్షణములు
ధరణీధరధారి త్వత్కథావళిగాని
విననొల్ల నస్మచ్ఛ్రవణము లెప్పుడు
వారణరక్షా భవచ్చరిత్రమెకాని

భాషింపఁజనవు మా భాషణములు
దేవేశతావక దివ్యమూర్తులెగాని
యర్చింపవు మదీయహస్తయుగము

గీ. సరసిజాతాక్ష మీ పదాబ్జములెగాని
చేరిమ్రొక్కవు మామక శిరములరయ
ననుచు నిబ్బంగిసేవింతు రనవరతము
సకలరాజన్య కన్య లుత్సాహలీల. 114

ఉ. అట్టిమహోత్కుఁడవ్యయుఁడనంతుఁడు శేషనగేంద్రవాసుఁడీ
గట్టున వేఁటలాడ తురగద్విరదాదిచమూ సమేతుఁడై
బిట్టుమ్రుగాలిఁగొట్టి పటుభేరులు ఘట్టనసేయఁ బంపఁగాఁ
బుట్టురవంబు సుమ్మిది ప్రఫుల్లనవాంబుజ పత్రలోచనా. 115

ఉ. ఏమని విన్నవింతు నతఁడెంతటి వాఁడని పల్కవచ్చు సు
త్రామధనంజయార్కసుత దైత్యజలాధిప వాయుసోమసో
మామర భుగ్దివాకర ధరాభ్రజలాంబుజ గర్భులా పరం
ధాముని శుద్ధసత్త్వమయ తత్త్వముగానఁగలేరు కోమలీ. 116

ఉ. పాములపాదుషాపరుపు బంగరుపట్టు హొరంగుసాలు, కెం
దామరబొజ్జ, పిట్టగమి దయ్యముగుఱ్ఱము, కల్వరాయఁడున్
గాములతోఁడు కన్నుగవ గాదిలిపట్టి మరుండు, త్రైజగ
త్స్వాముల కెల్ల పెన్మొదటిసామిసుమీ మదహంసగామినీ. 117

శా. శ్రీ వైకుంఠపురంబునన్ సిరియు ధాత్రీనీలలున్ నిత్యసం
సేవారక్తినిఁగొల్వఁదల్పము పయిం జెన్నారు కేళీ వినో
దా వైచిత్ర్య విలాసహాసముఖ నూత్న శ్రీలరంజిల్లు నా
కైవల్యాధిపుఁడీ మహాప్రభుఁడు రాకాచంద్రబింబాననా. 118

మ. అనివాణీకర కీరవంశజ విహంగాధీశుఁ డిమ్మాడ్కి న
వ్వనజాతాక్షు చరిత్రమెల్ల మృదువాగ్వైచిత్రివిన్పింపఁగా
వనితారత్న మపారసంభ్రమకళా వ్యాపారసంతోష సాం
ద్రనవానందిభోధి నోలలాడుచు నితాంతప్రేమవాటిల్లఁగన్ 119

ఉ. అంతటఁగొంతసేపు హృద యాబ్జము సమ్మదమందనుండి య
త్యంత కుతూహలంబలర నంబుజ పత్రవిశాల నేత్ర యా
వంతయు సంశయింపక శుకాన్వ వార్ధిశశాంకుతో రతీ
కాంతునిగాఢతాపశిఖిఁగ్రాగుచుఁబల్కెమృదూక్తిమాధురిన్ 120

## చిలుక - రాయభారము

ఉ. అక్కటవేంకట ప్రభు పదాంబుజ దాస్యవిధానమాత్మలో
మక్కువఁ గోరిసేయఁగ సమస్తవిధంబుల వేడుదాన నీ
వక్కమలాయతాక్షు వినయంబునఁగాంచి మదీయమోహమున్
మిక్కిలి భక్తియుం దెలుపుమీ భవదీయ వచోధురీణతన్. 121

శా. తద్దేవాలయ నిత్యవందనగురుత్వం బాత్మ భావించెదం
దద్దైత్యాంతకు సేవకావిధినితాం తప్రేమవాటించెదం
దద్దేవేశు పదార్చనాభిరతి హృద్యంబొప్ప భావించెదం
దద్దివ్యాంగ మలంకరింపు చుఁగృతా ర్థత్వంబునుం బొందెదన్ 122

ఉ. పలుకు వెలందికిన్ సిరికిఁ బార్వతికిన్ రతికిన్ వినోదవా
గ్విలసిత సత్కథల్ దెలిపి వేడుకఁదత్పతులన్ ఘటించు పె
ద్దలుగద తావకాన్వయ వతంసము లాచతురత్వవైభవం
బలర మదీప్సితార్థము రయంబునఁ జేయుము ముద్దుకీరమా. 123

చ. సమయమెఱింగి యవ్విభుని సన్నిధి కేగి తదీయదివ్య చి
త్తము తెరగెల్లఁ గాంచి వనితామణులన్ వెలయించు వేళక
య్యమునకు దూఁగువేళ మృగయారతినొందెడు వేళఁ గోపభా
వముఁగను వేళమానిమృదుభాషలవిన్నప మాచరింపుమా. 124

గీ. వింటితద్దివ్యతత్త్వంబు వీనులలరఁ
గంటిఁ దద్రూపమహిమహృ త్కమలదృష్టి
నాదుపాలింటి పెన్నిధానంబతండు
వేయుమాట లిఁకేటికి విహగవర్య. 125

క. కమలావిభుఁడగువేంకట
రమణుండీ భవమునందుప్రాణేశుఁడు నా

కమితపురాతన మత్కృత
సుమహోవ్రతఫల మితండుజూపెఖగేంద్రా. 126

క. అనిసారెసారె వేడిన
వినిసంతసమంది యుంతవిహగేంద్రుండ
వ్వనజాయతాక్షిఁ గనుఁగొని
మనమలరంగఁ బలికెమందమంద మృదూక్తిన్. 127

మ. అరవిందానన చిన్ని ప్రాయమున నిట్లాడంగనాశ్చర్యపై
ఖరిదోఁచెన్నినుఁ గన్న వారలుభవ త్కల్యాణ సత్కార్య త
త్పరులై యుండఁగ సాహనంబున స్వతంత్రవ్యాప్తిఁగాంక్షించె ది
త్తణీనీచిత్తసురుత్వ సిద్ధికిలఘుత్వప్రాప్తికన్వట్టెడున్. 128

చ. అనవినినవ్వి చెంచు జవరాలుశుకాధిపుతోడఁబల్కు చ
య్యన గుణనిర్గుణంబులు భవాభవముల్ పరతంత్రకార్యప
ర్తనము స్వతంత్రకారణ విధంబులు శ్రీహరిదివ్య లీలలం
చునునిగమాళి మ్రోయవినఁజోద్యము తావకసంశయార్థముల్. 129

క. చిలుకల కొలికిటు ముద్దులు
చిలుకఁగ నచ్చిలుక కలకవిటిలించి కరం
బులమేను నిమిరిముద్దిడి
వెలయరహస్యములుకొన్ని వినిపించితగన్. 130

క. లెమ్మి శుభకార్యము శీ
ఘ్రమ్మున సంఘటన పఱచిరమణీయపు వే
గమ్మున రమ్మన ముద్దుల
గుమ్మ మొగమ్ముఁగని చిలుకకులుకుచుఁ బలికెన్. 131

ఉ. పాటలగంధినీ సెలపు పద్ధతివేంకటభర్త సన్నిధిం
జాటుమృదూక్తులెల్ల సరసంబునఁ దెల్పిత్వదీప్సితార్థమున్
సూటిపడన్ ఘటించికడు శోభనవార్తనుభక్తిఁ దెచ్చెదం
జేటికలెల్లరు న్గొలువఁ జెల్వుగనుండుము నిండువేడుకన్. 132

క. సురుచిరగతి పీఠ్యోని శుక
వరుఁడరిగిన పిదప భిల్లవనితామణి బం
ధురవేణులు గొలువఁగ భా
సురముగఁదద్వార్తకెదురు చూచుచు నుండెన్. 133

మ. ఖరరక్షోజితకాండ, కాండరుహ సంకాశాక్ష, యక్షాంతకా
విరతస్తోత్రపదాబ్జ, యబ్జగృహదేవీచిత్తకాసారసం
చరదుద్యత్కలహంస, హంససుత రక్ష శ్రేష్ఠసామ్రాజ్యసు
స్థిరసంధాన విధానకారణ రణస్థేమాభిరామప్రభా. 134

క. సురవరవైశ్వానర భా
స్కరసుత దైతేయవరుణ శంబరహయ కి
న్నరవరపురదమన శిరో
వరచూడారత్న కాంతివలయిత చరణా. 135

మాలిని. బలభిదుపల తేజా భక్తకల్పావనీజా
జలజదళనిభాక్షా చండదైతేయశిక్షా
కలుషవనకుఠారా కాంచనగ్రావధీరా
జలనిధి మదభంగా జానకీచిత్తసంగా. 136

## గద్యము

ఇది శ్రీరామచంద్ర సాంద్ర కరుణా కటాక్ష వీక్షా ప్రసాద పరిపాకలబ్ధ ప్రసిద్ధ కవితా విలాస కళాధురీణ శ్రీమదాప స్తంబ సూత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర వద్దిపర్తి వేంకటామాత్య పుత్ర సకల సుజన విధేయ కోనంరాజ నామధేయ ప్రణీతంబైన వేంకటేశ్వరోపాఖ్యానంబను శృంగార ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.



# శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీకాకుత్స్థకులాంబుధి
రాకాహిమధామ పరశురామ విరామా
భూకామినీ తనూజా
తా కేళికళాభిరామ దశరథరామా.

వ. దేవా యవధరింపుము. 2

శా. ఆరీతిన్ శుకవల్లభుండరిగి పుణ్యారణ్యమార్గాంతమం
దారాశోకతమాల నింబకదళీ నారంగహింతాలజం
బీరప్రేంకణమన్మధేక్షులవలీ బిల్వామ్రదాడింబ ఖ
ర్జూరద్రాక్షపటీరకుందక్రముక స్తోమంబువీక్షింపుచున్. 3

సీ. బహుతర బ్రహ్మాండ భాండసంతతిబొజ్జ
నున్నవాని విధాతఁ గన్నవాని
దారుణదైత్య కంధరములొల్చెడుచేత
ముల్కివానిసురంబు కల్కివానిఁ
దూరుపు దొరబువ్వఁ జూఅదెచ్చినపక్కి
నెక్కువాని బలీంద్రుఁ ద్రొక్కువానిఁ
గమఠమీనగ్రాహ కలితగంభీరాబ్ధిఁ
గట్టువాని తనంతఁ బుట్టువానిఁ

గీ. బిట్టగమి వాదుషాగట్టు పట్టువాని
రేయిరాతమ్మిరాకన్ను దోయివాని
మించుబంగరు వల్వరాణించు వాని
నజ్జనార్దనుఁగాంచె విహంగవిభుఁడు. 4

ఉ. అంతటఁ జందనాచల తటాంచిత దివ్యనదీనదాంతరో
పాంతనితాంతపాటల లతాంతగుళుచ్ఛపరాగ సౌరభా
క్రాంతపటీర శీతల సుగంధమనోహర గంధవాహమ
త్యంత ముదావహంబయిన యవ్వనసీమవినోద వైఖరిన్ 5

సీ. మృగయావినోదియై మెలఁగు నొక్కొకవేళఁ
బటుసముద్భట వీరభటులఁగూడి
సరసులజలకేళి సలుపు నొక్కొకవేళఁ
బరమ మిత్రామాత్య పటలిఁగూడి
మించుభక్ష్యము లారగించు నొక్కొకవేళఁ
గోరిసన్నిధి భక్తకోటిఁగూడి
గానవిద్యాప్రౌఢిఁ బూను నొక్కొకవేళ
వివిధగాయకపటీ వితతిఁగూడి

గీ. పక్కిరాజక్కి నెక్కు నొక్కొక్కవేళఁ
జొక్కమగు కొల్వుదీర్చు నొక్కొక్కవేళఁ
జక్కసుఖనిద్రఁజెందు నొక్కొక్కవేళ
సుందరాంగుండు శేషాద్రి మందిరుండు. 6

శా. నానాచిత్రవిహారలీలల జగన్నాథుండు గ్రీడింప బ్ర
హ్మానందామృత వార్ధిఁదేలిశుకలోకాధ్యక్షుఁడబ్జిల్లక
న్యానూనప్రియకార్యవైభవశుభ ప్రారంభ మర్థించి యు
క్కానన్ నూత్నఫలప్రభాకలితమాకందద్రు మాసీనుఁడై. 7

గీ. చతురతర కార్య ఘటనా విచక్షణ ప్ర
శస్తిగాన ప్రభూత్సాహ సమయమెఱిఁగి
శబరబింబాధరీ భవ్య చారుచరిత
మాత్మపరిభాష నొడివె నాహ్లాదమెసఁగ.

గీ. చిలుకరాయని మురిపెంపుఁ బలుకు లెలమిఁ
గర్ణపుటమున కానందకరముగాఁగ
సకలభాషా నిరూపణ చక్రవర్తి
యైన దేవుండు తద్భాష ననియెనిట్లు. 9

క. ముద్దుల చిలుకాచెంచుల
ముద్దుటాయారపు వెలంది ముచ్చటలెల్లన్
నిద్దంపు నీనిగారపు
సుద్దులవినిపింప మదికిఁ జోద్యంబయ్యెన్. 10

ఉ. చెంచుమెఱుంగుబోఁడి యల చిత్రచరిత్రము జన్మవైభవం
బంచితరూప విభ్రమ కళాతిశయోన్నతి సద్గుణావళుల్
మించెడుశీలవృత్తమెలమిందలిదండ్రుల పెంపుసొంపు వ
ర్ణించుమ్మృదుత్వ కౌశల ధురీణసుధామధురోక్తులేర్పడన్ 11

చ. అనియిటులాన తిచ్చిన శుకాన్వయచంద్రుఁడపార సంభ్రమం
బుననునుగాలిమేఁతపఱుపుంగల దేవర దివ్యపాద నూ
తనసరసీరుహంబులకు దండ నమస్కృతులొప్పఁజేసి చ
య్యనవినిపింపఁగాఁదొడఁగె నవ్వనితామణి జన్మమాదిగన్. 12

**చిలుక చెంచుకన్య చరితంబు వేంకటేశ్వరునకు. దెల్పుట**

చ. తలఁచిన లెక్కనూఱిఁట ముదంబునఁబెంచి తలంచురెట్టిచే
నలవడభాగమెత్తియది యష్టమసంఖ్యను హెచ్చరించియున్
నలువదిఁటన్ గుణించిన ఘనంబగులబ్ధపు రాజకన్యలన్
వెలయవివాహమైన పెను వేలుపుఁగొల్చెద నిష్టసిద్ధికిన్. 13

మ. వరలీలామణి సౌధజాలముల రేవంబొల్చురాకాసుధా
కరబింబంపు మెఱుంగు టద్దమునఁ జక్కంజూచికైసేసిన
వ్యరతిక్రీడల నాథులందనుపు భి ల్లాంభోజనేత్రిసము
త్కరయుగ్గంధవతీ పురంబమరు గంధగ్రావరమ్యాటవిన్ 14

సీ. రమ్యకీర్తిప్రభా రాజులు రాజులు
బహుళవిక్రమకళార్భటులు భటులు
శత్రుసంహరణ సామిత్రులు మిత్రులు
సతతసత్కార్య సంహితులు హితులు
మథితకౌటిల్య దుర్మంత్రులు మంత్రులు
ఘనబలోద్ధతి దిశాకరులుకరులు
రణరంగజయ మనోరథములు రథములు
బరమవేగపతంగ హరులు హరులు .

గీ. సరససౌందర్యజిత మరుత్సతులు సతులుఁ
గలిగి శబరమహీపాలక ప్రదీప్త
చండదోర్దండ విదళనోద్దండవైరి
ఘట్టనంబగు మలయాద్రి పట్టణంబు 15

మ. వెలయుం దత్పురిచెంతఁ బావనజలా విర్భూతముక్తా ఫలం
బులఁ జెన్నారుచుఁ దామ్రపర్ణియనఁగాఁ బుణ్యాపగా శ్రేష్ఠ శై
వలినీవల్లభుముద్దురాణి జగతీ భాగంబునం బొల్చు కే
వల మందాకిని భిల్లరాజ వదనాంభఃకేళికాసారమై. 16

## శబర చక్రవర్తి చరిత్రము

ఉ. ఆపురమేలుచుండు శబరాన్వయ భూషణుఁ డత్యుదార రే
ఖాపరిపూర్ణ మానసుఁ డగణ్యచరిత్రుఁ డమిత్రచక్ర సం
తాపిత శీతభానుఁడతిదాన ఘనాఘనుఁ డార్తరక్షణో
ద్దీపుఁడు చంద్రకేతుఁడనథీనిధియై శిఖినాయకుండనన్. 17

సీ. అఖిలశాస్త్రవరాజ హంసహంసఘనుండు
బంధుజనాబ్జాత భాస్కరుండు
ప్రకటజయేంది రాంబక చకోరవిధుండు
కంటకఫణిఫణి గ్రాహకుండు
పరిపూర్ణ కారుణ్యపటిమాంబుధి వరుండు
శాబరీజనపుష్ప నాయకుండు

బంధురతరసత్యభాషా ప్రవీణుండు
భవ్యకీర్తి ప్రభా భాసురుండు

గీ. బహుళసామ్రాజ్య విభవసంపత్కరుండు
భూరిశమదమదాన తపోవిదుండు
మహితయోగసమాధి సమన్వితుండు
శాంతగుణమూర్తి శబరేంద్ర చక్రవర్తి. 18

శా. ఆరాజేంద్రుని ధర్మపత్ని పతిసేవాలోల సద్భక్తి ని
ష్ఠా రాజత్పరిపూర్ణశీలవిలసత్సత్యవ్రతోత్కేల, గం
భీరోద్వేల విలోలసుందర తనూవిద్యుల్లతాజాల, వి
స్తారోదారగుణాలవాల వెలయున్ పంశీల నామంబునన్. 19

వ. మఱియు శబరమహీమండలాఖండలుండగు శిఖినాయక చంద్రకేతు క్షమాకాంతుండు జగత్పూజ్యంబుగా నిజరాజ్యంబుఁ బరిపాలించుచు సామంతమిత్రామాత్య భృత్యపురోహితాది సకల జనంబులు నిజాజ్ఞా ప్రవర్తనోల్లాస మనస్కులై సేవించుచు జగజ్జేగీయమానవైభవంబున సుపర్వభూసుపర్వుల సపర్యలఁ గావించుచుఁ ద్యాగభోగ దానధర్మాది సత్కార్యంబులవార్యంబుగా నొనర్చుచు మలయాచలంబు క్రీడాచలంబునుంగాఁ దామ్రపర్ణీ మహానది విహార దీర్ఘికగా వివిధవినోదంబులు సలుపుచు సుఖంబుండి యొక్కనాఁడేకాంతసౌధంబున కాంతారత్నంబునుం గూడియున్న సమయంబున నిట్లని వితర్కించె. 20

గీ. చతురమతి దానధర్మ సువ్రతములెన్ని
చందములఁజేయఁగల్గునే జగతిసుగతి
సత్యసంకల్ప సామ్రాజ్య సహితవంశ
తిలకమగు పుత్రరత్నంబు వలనఁగాక. 21

క. అని వగగూడిన చిత్తం
బున సంతతియేయుపాయమునఁ గందునటం
చును సర్వకార్యసాధన
మునకుఁ దపోమహిమ చూపె మూలంబనుచున్. 22

## శబరచక్రవర్తి తపంబునకేగుట

చ. మనమున నిశ్చయించి హితమంత్రికి రాజ్యము సంఘటించి దం
డ నిబిడసత్క్వమండల జటాజి వల్కలముల్ ధరించి చం
దన భసితోర్ధ్వపుండ్రకలి తస్ఫటికాక్ష సరప్రయుక్త వ
ర్తనము లలంకరించి శబరప్రభుఁడేఁగె మునీంద్ర వేషియై. 23

కవిరాజ. చనిచనిముందటఁ జందనశైల విశాలతటాంచితపుణ్యతపో
వనసహకార పటీర తమాల లవంగకుటీఘనసారములం
బెనఁగొను ద్రాక్షగుళుచ్ఛములున్ గురివెందలతాళినికుంజముల్
నునుబువుదీవెలతావులగాడ్పులనూనమనోహరమై చెలంగన్. 24

కవిరాజ. కొలఁకులపజ్జల కప్రపనంటుల ఘుమ్మనుతావిమనమ్మలరం
గిలకిలలాడెడి కోకిలబర్హిశుకీమధుపాయిమరాళములం
గలసిమెలంగి చెలంగినటించుచుఁ గాంతకలస్వనముల్లసిలన్
ఫలములుపత్రములంచితతోయమపారముదావహ మావహిలన్25

చ. కమలవనంబు పొంత సహకారమహీరుహమూలమందు సం
యమ నియమాది యోగవిది తాత్మసుధీవిభవప్రకాశుఁడై
సుమహితవృత్తి లోవెలుఁగుఁ జూచుచు ఘోరసమాధి నిష్ఠచేఁ
గమలభవాసనస్థితిఁ దగంగదియించి నిమీలితాక్షుఁడై. 26

మ. ఘనుఁడాభిల్ల మహీమహేంద్రుఁ డకలంక స్ఫూర్తివాణీప్రభున్
మనమందొప్పగ నిల్పిసల్పెఁదపమున్ మౌనస్థుఁడై వార్షికం
బున హేమంతమునన్ నిదాఘసమయంబున్ భక్తిఁబైలంజలం
బునఁబంచానలమధ్యమందువరుసన్ మూఁడేండ్లునిష్ఠారతిన్. 27

గీ. అంతకంత కనాహారుఁడై తనర్చి
పర్వతాగ్రంబునం దూర్ధ్వబాహుఁడగుచు
నంతరాక్షులు నాసాగ్ర మందుఁజేర్చి
కన్గవను మోడ్చి ధ్యానించెఁ గంజభవుని. 28

సీ. అలకర్ణగహ్వరంబుల విహంగకులేంద్ర
ములు నిజాంగనలతో ముచ్చటింప
వరనాసికారంధ్ర వల్మీకములఁబోగి
సముదయం బొనేచ్చ సంచరింపఁ
జారుహంసద్వయ సానుదేశముల భీ
కరవన్యమృగములు పరువులెత్తఁ
గమనీయనాభికాకాసారమునఁ భృంగ
వర్గంబు మధుపానవాంఛఁ దిరుగ

గీ. నిశ్చలజ్ఞాన వైరాగ్య నిష్ఠఁబూని
చిత్తమరవింద భవపాద చింతనమునఁ
దగిలి విశ్వముమరచి పెన్నగముఁబోలి
చంద్రకేతుండు తపమంత సలుపఁదొడఁగె. 29

శా. పాదాంగుష్ఠమునందు నిల్చి, పవనున్ బంధించి షడ్వర్గవి
చ్ఛేదో పాయతనొంది యింద్రియమ హోత్సేకంబు ఖండించి య
వ్వేదాధీశ్వరు నాత్మలోనిలిపి భావిప్రాప్త సంతాన కాం
క్షాదీక్షా కుశలక్షమాకలితుఁడై చంద్రధ్వజుం డెంతయున్. 30

గీ. వానిదారుణ ఘనతపోవహ్ని దాహ్య
మానమున గంధశైలద్రుమములఁ బొడమి
ధూమమాకాశమునఁ గప్పఁగా మహేంద్ర
ముఖర దిక్పాలురును దేవమునులుఁ గలఁగ. 31

గీ. ఇట్టియాతనివిధ మెల్లనెఱిఁగి యరిగి
కలహభోజనుఁ డవ్వార్తఁ గనకగర్భు
సమ్ముఖంబున విన్పింప నమ్మహాత్ముఁ
డలిరయుంబున వాణీ సహాయుఁడగుచు. 32

ఆ.వె. బ్రహ్మఋషులు గొలువ బ్రాహ్మీసమేతుఁడై
రాజహంసవాహ రథమునెక్కి
కరుణనేగుదెంచె ఘనశిఖినాథ క్ష
మామహేంద్రుఁడున్న మలయగిరికి. 33

మ. చనికాంచెం గమలాననుం డనశనేచ్ఛాసత్కృశీభూతు భ
వ్యనితాంతో గ్రతపః ప్రభావకలితాభ్యాస శ్రమోపేతు పా
వనదేహావృతగుల్మభూజ లతికావల్మీక సంఘాతు సా
ధునిరాఘాటదమక్షమాగుణ సమేతుం జంద్రకేతున్ దయన్. 34

క. కాంచివిరించితదీయో
దంచితమహనీయ తపముకచ్చెరువడి లా
లించి కృపారసములుక వ
రించెంజంద్రధ్వజేంద్రు చిత్తంబలరన్ 35

ఆ.వె. లెమ్ము నీమనోరథమ్ము సెల్లఘటింతు
ననశశాంక కేతుc డజుని దివ్య
పాదపద్మములకు భక్తిసాగిలి మ్రొక్కి
నవనిమీcదcబులకి తాంగుcడగుచు. 36

ఆ.వె. కరపుటంబుమౌళి గదియించి యద్దేవు
దివ్యమూర్తియందు దృష్టినిలిపి
యిష్టమైనవరము లిత్తు వేడుమటన్న
విన్నవించెcదనదు విధముcదెలియ. 37

క. ధాతా, సకలజగన్ని
ర్మాతాదుష్కృత విధూతమహితాంబుజ సం
భూతా శుభసంధాతా
చేతోజాతాగ్రజాత శ్రీహృన్నేతా. 38

క. కులవర్ధనుcడగు కొమరుcడు
సలలిత సౌభాగ్యశీల సౌందర్య గుణో
జ్జ్వలయగు కుమారికామణి
చలనములేనట్టి సిరులు సమకూర్చుమజా. 39

## బ్రహ్మ శబరేంద్రునకు వరంబు లిచ్చుట

చ. అనియడుగన్ విరించి శబరార్యున కిట్లనిపల్కె నీపురా
తనభవమందు వైష్ణవహితవ్రత చర్యలొనర్చి యజ్ఞనా

ర్ధనుపదపద్మముల్ బహువిధంబులఁగొల్చినఁ బుణ్యమూర్తి వీ
వనఘఫలించు తావకమహామహనీయ విశేషసంపదల్. 40

క. కమలాలయాంశమున సుత
కమలాక్షునిపాద భక్తిగను సుతుఁడు సిరుల్
క్రమమునఁగలుగు నటంచును
గమలాసనుఁడరిగె నిజనికాయంబునకున్. 41

ఉ. అంత శిఖిక్షమావిభుఁడు హర్షముతో నిజపక్కణంబు కే
తెంతునటంచువచ్చుతఱి దివ్యవధూమణియోర్తు తద్వనా
భ్యంతరసీమ సౌరభ లతాంతములెంతయుఁ గోయుచుం దటి
త్కాంతితనూ విలాసలగు కాంతలఁగూడి చరించుచున్నెడన్. 42

మ. కమనీయస్థితినేగి కాంచెనతఁడా కాంతారమార్గంబునన్.
రమణిం గోకిలవాణిఁగుందరదనన్ రాజీవలోలేక్షణం
గమలాంఘ్రిన్ నవపల్లవాధర రథాంగద్వంద్వవక్షోరుహా
సమదానేకపరాజగామిని శరత్సంపూర్ణ చంద్రాననన్. 43

గీ. నెలఁతచన్నవనీటు, పెన్నెరులదీటు
ముదితకటి పెంపు, తలిరాకు మోవిసొంపు
కలికితొడలబెడంగు చెక్కుల మెఱుంగు
నబ్బురముదోఁప నచ్చెంత కరిగియరిగి. 44

గీ. లలన కన్నులతీరు కల్వలను గేరు
కాంతనూగారు డాలుఖడ్గాలబోలు
రమణిపల్కునిగారు కీరములమీఱు
ననుచుఁజిత్తంబునందెంచి యరసి యరసి. 45

గీ. బండిగులివిందపాదల లోపలఁగడంగి
పూవులు కరాగ్రమునఁద్రుంచు పొలఁతిఁగాంచి
నీదుతలిదండ్రులెవ్వరు నిలకడెద్ది
భర్తయెవ్వండు చెప్పవే పద్మనయన. 46

గీ. అననితంబినిమారు మాటాడకున్నఁ
బలుదెఱంగుల నట్లేని బ్రస్తరించి
యట నిరుత్తరమైన యావంత సంశ
యింప కత్తఱి శబరేంద్రుఁ డిట్టులనియె. 47

మ. విను మస్మద్విధమెల్లఁ దెల్పెదను తన్వీచంద్ర కేతుండవా
గ్వనితాభర్తృ వరప్రసాద కలనా వర్ధిష్ణుఁడన్ భిల్ల భూ
జనపాలుండ నగణ్యవిక్రమ కళా సంపద్ధురీణుండఁ బా
వనచారిత్రుండ చారుగంధవతియన్ పట్నంబునందుండుదున్. 48

క. అంతట రతిపతి నిశితల
తాంతాశుగ భిన్న మాన సాంబుజయై య
క్కాంతామణి శబర మహీ
కాంతునిపై మోహదృష్టి గడలు కొనంగన్. 49

ఆ.వె. కోర్కె లాత్మలోనఁ గొనసాగ పైఁదొఁపఁ
బాదయుగము తొట్రుఁ బాటుఁజెంద
గుబ్బచన్నులుబ్బ బిబ్బోకవతి చూచెఁ
గన్నులార నెదుట నున్న విభుని. 50

గీ. చూచి యాతని విధమెల్ల సురవధూటి
భావమున నెంచి తర్కించి పలుకు పద్మ
భవుఁడు హేమపుటంబిడి బాగుమీఱఁ
జేసెఁగాఁబోలు నీమేని చెలువమనుచు. 51

సీ. బహుధన స్ఫూర్తిచేఁ బ్రబలుమాత్రమెకాదు
కడు ధైర్యమునగెల్చుఁ గనకగిరిని
సంచితకీర్తిచే మించుమాత్రమె కాదు
గాంభీర్యమున గెల్చుఁ గంధివిభుని
మందహాసమునఁ జెన్నొందు మాత్రమె కాదు
సౌందర్యమున గెల్చుఁజందమామ
నలఘు దానంబుచే వెలయు మాత్రమెకాదు
పటు శౌర్యమునగెల్చు భానుసుతుని

గీ. సరస సద్గుణ చాతుర్య చారువైభ
వమ్ము లీతని సొమ్ము నిజమ్ముగాను
వేయు మాటలిఁకేటికి వీనిఁబోలు
రాకుమారులు గలరె ముల్లోకములను. 52

గీ. సురకరి కరోప మంబులీ సొబగుబాహు
లంగభవు హేమపీఠమీ యతి విశాల
మైన వక్షస్థలంబు, హేమాద్రి గహ్వ
రం బితని నాభియనిదివ్య రమణి పలుకు. 53

క. వలరాజు స్నెలరాజుఁ
నలరాజుల చారు మోహన కళాకృతులం
దొలఁగించున్ నలగించుం
దలఁగించు విలాసహాస తనురుచికలనఁ 54

ఇవ్వన భూమికొంటి నిటు లేమిటికై చనుదెంచినాఁడొ యీ
మవ్వపురూప వైభవ సమంచితమెన్న సురాలయంబునం
దెవ్వనియందుఁ గాననిఁక నెట్టు సహింపఁగవచ్చు రిత్త బో
నవ్వరె మత్ప్రియాంగనలు నాథుఁడుగల్గి వరింపకుండినఁ. 55

గీ. అహహయని వాని లావణ్య మనుపయోధి
నోలలాడుచు మునుఁగుచు నుండెఁగాని
సఖులఁ గూడంగఁబోవ దా సారసాక్షి
మదన కోదండ గుణముక్త మార్గణహతి. 56

సీ. పాదనుండి దారికిఁ గదియవచ్చెడు మిష
నడుగు మట్టెలు గల్లు మనఁగఁ జేయుఁ
గనక లతాంతముల్ గొను మిషచే హస్త
కటక ద్వయము తాళ గతులఁబెనుపు
రొదసేయు పక్షుల గదిమెడు మిషతోడ
సరస వాక్చాతుర్య సరణి నెరపుఁ
బెడమరలి సఖుల బిలిచెడి మిషతోడ
గడుఁ బ్రీతితోడఁ గ్రీ గంటఁజూచు

గీ. నిట్లు తన నర్మగర్వంబు లేర్పడంగఁ
జేయుచును నింతనంత జే జే నెలంత
చంద్రకేతు క్షమాపాల చంద్రుతోడ
నింపు సొంపార మృదుభాష నిట్టు లనియె. 57

## - చంద్రరేఖా శబరేంద్ర సంవాదము -

క. సురదైత్యులు కలశాంబుధి
గరమరుదుగఁజేరి తరువఁగాఁ బుట్టు రమా
తరుణీమణితోఁ బుట్టుట
ధరణిఁ బ్రశస్తంబు మాకు ధరణీపాలా 58

గీ. జన్మములు పేయు బ్రాహ్మణ సత్తములును
రణ మహిస్థలి మ్రగ్గిన రాజవరులు
దేవకాంతాను సంభోగ భావులౌదు
రనుట నార్యులు దెలుపంగ వినవెమున్ను. 59

గీ. జనవరోత్తమ నాపేరు చంద్రరేఖ
మేనకయు రంభ యూర్వశి సానుమతియు
మంజుఘోషయు హరిణి హేమయు తిలోత్త
మయు ననంగను మత్సఖీమణులు సుమ్ము. 60

క. మనమున వాక్కునఁ గర్మం
బున నిను విభుఁగాఁదలంచి ముదమున నిక్కా
నన మార్గంబున నిలిచితి
నను పేడ్క వరింపు భిల్ల నరవరతిలకా. 61

క. అనవిని భూవరుఁ డిట్లను
ఘనమగు నిగ్గిరినిఁ దపముఁ గైకొని వ్రతినై
మునివృత్తి నున్న నను నీ
మనమునఁ గామింప ధర్మమా సురమహిళా. 62

చ. అనవుఁడుఁ జిన్ని నవ్వొలయ నాతని కిట్లను చంద్రరేఖ నూ
తన మదనావతార వనితామణులుర్ ఋతువేళ నాథులం
గని హృదయంబు పల్లటిలఁ గంతుని కేళివసించుచుందు రే
నును ఋతువొప్పు వేశ్యను మనోవ్యథ సేయుట నీకు ధర్మమే. 63

ఉ. ఎక్కడి మాటలాడెదిటు లెగ్గుఁ దలంపక చంద్రరేఖ నీ
వెక్కడ నే నదెక్కడ వసించు టదెక్కడ గారవించులా
గెక్కడ సౌఖ్యమొప్పఁగ రమించుట దెక్కడదేటిమాట పా
పెక్కడికైన నీదుపయు నిచ్చఁ దలంచు మహాత్ముపాలికిన్ 64

క. ఇటులటు లనుటయు వినివిని
కటకటఁ బడి కాంత కాంతుఁ గాఁగోరిన న
న్నిటు నటు బొమ్మను మని య
క్కటకట వికటోక్తు లాడఁగా బేలవుగా.

మ. పరకాంతారతుఁడైన చంద్రుని నిలింపస్థాన గంగా మనో
హరుఁడౌ శంతను మౌని పుంగవుఁ గళ త్రాసక్తుజంభారి ధీ
వర కన్యాప్రియుఁడౌ పరాశరుని నెవ్వారైన వెల్వెట్టిరే
సరసాగ్రేసర నీవొకండ వతి నిష్ఠాశాలి విద్వారుణిన్. 66

చ. తెలియనిదానఁగాను సుదతీ నవమన్మథ నీకపత్యముం
గలుగుటకై విరించినిదగన్ మదినిల్పి తపంబొనర్చి త
జ్జలజభవప్రసాద వరసంపదనొంది నిజాంగనామణిం
గలయుట కేగుదెంచిన ప్రకారము సర్వము నామంబునన్. 67

గీ. పచ్చవిల్కాని బారికినొచ్చి నీదు
ప్రాపుఁగోరినదానినో రాకుమార
యుభయదానంబొసంగి సన్నాదరింపు
విరహపరితాపమును మేనుదొఱఁగకుండ. 68

క. మునుశర్మిష్ఠయనంజను
వనిత ఋతుస్నాతయగుచు వరుఁగాఁదనుఁగో
రిననాహుషుఁడనురాగం
బునఁగూడఁడె ప్రాణహత్యఁబొందునటంచున్. 69

క. బింబాధరమాధుర్య ర
సంబొలుకఁగ జుంబనాదిసౌఖ్యంబులతో
రంబగుసురతక్రీడల
శంబరహరునార్తిఁదీర్పు శంబరహరణా. 70

ఉ. చారుపటీర సంకుమద సారమృగీమదగంధసార వి
స్తారసుగంధబంధుర విశాల మదీయ నికుంజ కేళికా
గార లతాంతతల్పమున గారవమారఁగవుంగలించి న
న్నారతినాథసౌఖ్య విభవాంబుధిఁ దేల్పుము రాజనందనా. 71

మ. అనిదీనోక్తులతోఁజలత్కబరితో నార్తస్వభావంబుతో
జనితస్వేదకణాంగవైభవముతో సమ్మోహ విభ్రాంతితో
ఘననిశ్వాసభరాననాంబుజములోఁ గన్నీటి పెన్వెల్లితో
వనటంబొందు లతాంగిఁగాంచి మదిలో వాత్సల్యమేపారగన్. 72

ఉ. బంగరుబొమ్మ నావ్రతము పద్ధతిఁదెల్పితిఁగాక నీవిలా
సాంగకళావికాసము నొయారపుసోగమిటారివాలు జూ
పుంగవ నీటుక్రొమ్మిసిమి పుత్తడిగుబ్బలినేలు గబ్బి చ
న్నుంగవదీటు చంగునఁ గనుంగొన మోహమునిల్ప శక్యమే. 73

గీ. నెరిఁ బరస్త్రీనిబొందుట దురితమైన
నీవు ఋతుమతినంటివి నిజముగాను
ధరణినిబరోపకార మిదంశరీర
మనుట తెల్లంబుగాదె వామావతంస. 74

గీ. అనుచు ఋతుకాలధర్మ లోలాత్ముఁడగుచు
నగుచు నచ్చరపూబోఁడి జగమెఱుంగు
రంగుచేలాంచలంబుఁ గరంబునంటి
నొంటిమైయుంటి యాపూవుటింటిలోన. 75

ఉ. అయ్యరవిందగంధి నతఁ డల్లనకౌఁగిటఁజిక్కఁజేర్చిఁ పూ
శయ్యకుఁదార్చి క్రొమ్మిసిమి చక్కనిచిక్కని గుబ్బలంటి మే

ల్త్రియ్యని మోపిఁగ్రోలియు రతిక్రియసౌఖ్య సలక్షణంబులన్
నెయ్యమెలర్పనయ్యెడ ననేకవికారము లుల్లసిల్లఁగాన్. 76

సీ. ముపాలమ·హాసకళా మదనసుందరరూప
మమలదంతక్షత వ్యక్తిగండ
మంచితనఖర ముద్రారూపణ స్తన
మరుణతాంబూల యుక్తాధరోష్ఠ
మమితబంధ ప్రసంగా రావభూషణ
మతనువ్యధాకంపితాంగనికర
మంగుళీపల్లవ సంగతోభయపార్శ్వ
మకలంకరతికూజి తాచ్ఛవచన

గీ. మతులితానంద తృతనిగూహనవలగ్న
మతి నిమీలిత సద్వీక్ష ణాక్షియుగళ
మగణిత విలాస రుచిరాస్యమాలతాంగిఁ
బటుతరరతంబు భిల్లభూపతికరంచె. 77

ఉ. చక్కఁగనక్కుఁ జేర్చివలి చన్గవనిక్కఁగ మోవినొక్కి సొం
పెక్కడు చెక్కుగీటిమది నెక్కువమక్కువ మాటిమాటికిం
జక్కిలిగింతపెట్టి సుమశయ్యముదంబునఁ దేల్చెఁ జెంచు రా
చక్కరవింటి వానిసరసంబుగ వేలుపుటింతివింతగన్. 78

## శబరేంద్రుండు చంద్రరేఖయందుఁ బుత్రికమగనుట

ఉ. అంబుచరాంక సౌఖ్యవిభ వాంబుధి నీగతి నోలలాడు కా
లంబునఁ దత్పురాతనఫల ప్రభవాంచిత పుణ్యపాక యో
గంబున నింది రాంశనుదగన్ శబరేంద్రు నమోఘవీర్యమ
య్యంబుజ గంధిగర్భ కుహరాంతరమందు వెలింగెనంతటన్. 79

ఉ. అచ్చరమించుబోఁడి కళిలాంగకముల్ వెలవెల్ల నయ్యెఁగా
నచ్చుపడెన్ నడల్ నడలె నాననపద్మము కాంతినొందె లో
నిచ్చరుచుల్ జనించె మెఱుఁగెక్కె నొయారపుఁ జన్నుదోయి బ
ల్మచ్చుటలెచ్చె గర్భభరమున్ వెరఁగైకనుపట్టె నత్తఱిన్. 80

మ. ముదమారంగ పయఃపయోనిధిసిరిన్ మున్గన్న చందంబునం
త్రిదివేంద్రాదిసురల్ నుతింపఁగ ధరిత్రీలోకమత్యంత సం
పదనొందన్ శుభలగ్నమందు గ్రహసామ్యత్వంబుగల్గన్ మరు
త్సుదతీరత్నము పుత్రికంగనియె సద్యోగర్భమందంతటన్. 81

క. అత్తఱి సురదుందుభులు వి
యత్తలమున మ్రోసె నిర్జరాంగనలెల్లన్
మొత్తములై ధింధత్తా
తత్తా థైతత్తటంచుఁ దగనాడిరటన్. 82

క. పాడిరి కిన్నరకన్నియ
లాడిరిగంధర్వ కాంతలటఁ బన్నగులున్
వేడుకఁగూడినుతించిరి
చేడియజననంబునొందఁ జిత్తములలరన్. 83

ఆ. చంద్రరేఖఁబోలు చంద్రరేఖయుఁబూర్ణ
చంద్రరేఖమీఱు చారుసుతను
జంద్రకేతనామ శబరవంశపయోధి
చంద్రునకునొసంగి చనిత్రిదివికి. 84

క. ఉల్లమురంజిల ముద్దుల
పిల్లను దగఁదోడుకొనుచుఁ భిల్లాగ్రణి శో
భిల్లఁగ సిరులీనెడు తన
పల్లెకుఁజనుదెంచి యాత్మవల్లభకిచ్చెన్. 85

ఉ. మన్ననతో సుశీలయుఁ గుమారికఁగైకొని సంభ్రమంబునం
బెన్నిధిఁగన్న పేదగతిఁబేర్చి జలంబులనార్చి యుగ్గు బా
లున్నన దేనెసోనలిడి లోలతనెచ్చెలులైన చెంమరా
కన్నెలఁగూడిబంగరు నిగారపుటుయ్యెలఁజేర్చి వేడుకన్. 86

క. వనరాశితనయ కైవడి
ఘనమగు సిరినలరు నీచొకారపుఁ జెలియం
చును దలిదండ్రులు మోహం
బున మోహనయనుచు నామముం జేసిరిలన్. 87

క. జోజో కిసలయపాణీ
జోజోమదకీరవాణి జోజోరమణీ
జోజో పులినశ్రోణీ
జోజోహరి నీలవేణి జోజోయనుచున్. 88

ఉ. పాటలగంధులీకరణిఁ బాటలుబాడుచు ముద్దుపట్టి నా
నాఁటికిఁ బెంచుచుండ నర నాథుని పట్టపురాణికంతటన్
హాటకగర్భుచేఁగనిన యట్టిమహావరశక్తిఁజేసి యే
ర్పాటయి చూలుదోఁచె శబరప్రభుచిత్తము పల్లవింపఁగన్ 89

**శబరేంద్రునకు మలయధ్వజుండు జనించుట**

క. ఋతువుల లోపలఁదానే
ఋతువని హరిపలికెనట్టి ఋతుదినమున మా
నితమగు శుభలగ్నంబున
సుతుఁగనియె సుశీలకులము శోభిల్లంగన్. 90

ఉ. అయ్యెడశాబరేంద్రుఁ డతిహర్షముతో ధరణీసురాలికిన్
నెయ్యమెలర్పఁ గాంచన మనేక మొసంగి సబాంధవుండునై
తొయ్యలిదానుపైభవముతో నిజపుత్రుఁడు వంశపావనుం
డయ్యెడునంచుఁబొంగి మలయధ్వజనామ మొనర్చిరింపుగన్. 91

క. సిరిపాలకడలిఁ బెరిగిన
గరిమంబున శబరనాయక నివాసమునన్
మరునాఱవ శరమోయనఁ
దరుణీమణి పెరుఁగసిరులు తరుచుగఁ బెరిఁగెన్. 92

క. అనివిన్నవించి పిమ్మట
వనజేక్షణరూప సౌష్ఠవం బెఱిఁగింపన్
మనమునఁదలంచి యపుడి
ట్లనియెన్ శ్రీహరికి సమ్మదాలాపములన్. 93

శా. స్వామీయేమని విన్నవింతు లలనా సౌందర్యమెంచంగ వా
గ్భామాభర్తృభుజంగ భర్తల కశక్యంబౌట తథ్యంబు సు

మ్మీ మాబోటుల కెన్నఁగాఁ దరమె లక్ష్మీతుల్య యబ్బోటి మీ
నామోచ్చారణఁ జేసి పల్కెద రమానారీమనోనాయకా! 94

గీ. వెలయజంబేటి బంగరు మొలకలేర్చి
గంధకల్ప ప్రవాళ సంఘములుగూర్చి
మించులుఘటించి సుధనుమేదించి యెంచి
చెంచుటైదువఁ జేసెవిరించి మించి. 95

చ. అలికులవేణి కచ్చుపడె యౌవనమన్ మధుమాసమందుఁ గో
నుల తనువల్లికారుచి సముంచితముం బటుదంతకోరకో
జ్జ్వలముపయోధర స్ఫుటరసాల ఫలౌఘము మంజువాక్య స
ల్లలిత శుకప్రకీర్ణ శుభలక్షణముం బదపల్లవంబులున్. 96

సీ. నెమ్మోముదమ్మిపై గ్రమ్ము ముంగురులళి
సంఘంబటంచు హస్తములఁ జోపుఁ
దళతళలాడు చెక్కుల నిగారపు డాలు
మించుటద్దమటంచు నెంచిమాచు
మినమిసలీనుమై మిసిమితేటమెఱుంగు
గంధసారమటంచుఁ గలుపఁదివురు
విరిబోండ్లతోనాడు తఱిఘర్మకణములు
ముత్తియమ్ములటంచు నెత్తఁబోవుఁ

గీ. గనకకటిసూత్రపద్మ రాగపుహారంగు
వన్నెచెంగావిజిల్గు పావడయుటంచుఁ
గడుభ్రమవహించు వింతముగ్ధత్వమలర
పంకజాతాక్షి నవయౌవనాంకురమున. 97

**చిలుక మోహన సౌందర్యంబు వేంకటేశ్వరునకుఁ దెల్పుట**

సీ. కరిచక్రరాజీవ కంద రాంభోజాత
గమన పక్షోజాక్షి కబరిచరణ
సైకతతూణీర శంఖ శంపాచంద్ర
కటిజంఘకంధర గాత్రగంధి

కోకిల శ్రీకుంద రాకేందుదర్పణ
వాణీ శ్రవణదంత వదనగండ
చంద్రికాచాప కేసరి హేమ పున్నాగ
హాస భ్రుకుటిమధ్య నాసనాభి

గీ. బింబకరికరహల్లక బిస భుజంగ
రదనవాసోరుపాణి కరయుగరోమ
రాజిఁదగఁగూర్చి నిర్మించె రమణి నజుఁడు
మెఱుఁగుచామన నునుతిరుమేని సామి. 98

క. తారలు ముక్తామణులు ని
గారపుమగ రాలు మల్లికాకోరకముల్
తోరపుఁ గపురవు మొలకలు
నీరజముఖి గోళ్ళు బోలనేరవు జగతిన్. 99

గీ. జలరుహంబులు కిసలముల్ సకియపాద
తలమునను బోల నెదిరించి తద్విహాస
చంద్రికాస్ఫూర్తి ముకుళించె సరసమృదుల
కంఠ కలకంఠ వరముచే గాసిఁజెందె. 100

గీ. అవని హంసభ్రకుంసున కతివపదము
పేరిమింద్రొక్కు భారత పీఠమయ్యె
విద్యగరచెడి కందర్ప వీరునకును
రమణి భ్రూదృష్టులు ధనుశ్శరంబులయ్యె. 101

ఉ. సారసగంధి జంఘికల చందము నొందుదుమంచుఁ గంతు తూ
ణీరఫణీంద్రపుచ్ఛకరిణీకర కాహళులేఁగి యంతటన్
వారణదైత్య జిన్నయున వహ్నినణంగి రసాతలంబునం
జేరి చలించి తున్కలయి చిత్రముగాఁ గనుపట్టె ధారుణిన్. 102

మ. సకలక్ష్మాజములుండఁగా నిరతమన్మద్వైరమా భద్రదం
తికిసేలాయని రంభ యంతటఁ దపోద్వృత్తిం బ్రతిష్ఠించి బా
లికయూరుద్యుతినొంది సర్వతరలాలిత్యోరుశాఖా విలా
సకరంబున్ నిరసించి కాంచెఁ గటిచంచత్కుంభికుంభస్థితిన్. 103

మ. రమణీ నవ్యవయోపయోదము కుచగ్రావంబులం గాంతి తో
యము వర్షింపఁ దదీయజీవనము హెచ్చై నాభికాసార తీ
రముఁజేరంగ మహోర్ములన్ మృదునతుల్ గంజిల్లెనచ్చెంగటం
గమనీయంబగు హేమసైకత మనంగన్పట్టెఁ దచ్ఛ్రోణియున్. 104

గీ. మానవతి యౌవనోద్యాన మండలమున
సంచరించుచు విహరణ శ్రమమువాయ
రతి సుమాస్త్రులు గల్పించు నతిగభీర
మైన యమృతంపు బావినా యలరునాభి. 105

మ. వనితా నాభిసరోంతరాళ భిసలవ్రాతంబు మాధ్వీరసే
చ్ఛను జాల్గట్టికుచాద్రులంటి ముఖకంజాతంబు వీక్షింపఁ ద
ధ్ఘన నాసోజ్జ్వల కాంచనభ్రమముచేతన్ సంస్థితిన్ నిల్చెనో
యన నొప్పారు సురేంద్రనీలరుచి నూగారింతి మధ్యంబునన్. 106

మ. రతికందర్పధరా విఘాతుకులు తద్రామావయః కానన
క్షితి లావణ్య సువర్ణ మృత్తికను గాంక్షించంతటం ద్రవ్వి యం
చితమౌ ప్రోవులు వోసిరోయనఁదనర్చెం దత్కుచద్వంద్వ మా
గతిగాదన్న గభీరనాభిఖని చొక్కం పారుదారొప్పునే. 107

సీ. భద్రకుంభంబులఁ బ్రతిఘటింపఁగవచ్చు
విమల సుధాపూర మమరెనేనిఁ
గనకాద్రి శిఖరంబు లెనఁగూర్పఁగా వచ్చుఁ
జిరతరామోదంబుఁ జెందెనేని
శ్రీ ఫలంబులనీడు సేయఁజాలఁగ వచ్చు
పటుసువర్ణచ్ఛాయఁ బరగెనేని
జలజాతకలికల తులఁ బూన్పగావచ్చు
నిర్వికాస ప్రౌఢి నెగడెనేని

గీ. గురుతరోన్నతవర్తుల కోమలైక
సంపదల మించి చిత్ర వాసప్రసక్తి
నలరి ముక్తాఫలా వృతోజ్జ్వలత మెఱసి
సమతను గడంగు నాయింతి చన్నెడంగు. 108

చ. సరసిజ గంధకందరకు సామ్యమునొందుదు నంచునేఁగి భా
సురతర మౌక్తికప్రభల సుందరరేఖల గాఢనిస్స్వ స
స్ఫురణ నెదిర్చి మంజులతఁ బోలఁగఁజాలమి పాంచజన్యమే
డ్తెరహరి నాశ్రయింపఁ జనె దీనజనావనశాలి గావునన్. 109

మ. తరుణోద్యన్మృదుశోణ వైభవము చేతం బొల్చు రాకాసుధా
కరబింబానన సుందరోష్ఠమమరెం గంజాక్షి వాఙ్మాధురీ
చరితంబుం గని కోకిలంబులగళస్థం బైన దంచుఙ్ వసం
తరమా నాథుఁడు మచ్చుకిడ్డ నవచూతద్రు ప్రవాళంబనన్. 110

గీ. అంచితంబైన పక్వబింబాధరోష్ఠి
చారుకృష్ణోత్పలాభలోచనయుగంబు
కర్ణవైరంబు గలుగుట కాంతనిలిచెఁ
గాక లేకున్న తలచుట్టుగాఁ దిరుగదె. 111

శా. ఆరామామణియాన సింధుర మురోజాంభోజకుట్మంబులం
గారింపంగఁదలంప మధ్య మృగలోకస్వామి దుర్వారుఁడై
వారింపంగని తద్విచిత్రగతి విస్పష్టంబుగాఁదెల్ప శ్రీ
కారశ్రోత్రములందుఁ జేరె ననఁ జక్కంబొల్చు నేత్రాబ్జముల్. 112

మ. వరకర్ణాద్రి దరీముఖంబు నళికవ్రాతోరుధూమచ్ఛటం
గరమామోదముఁబూని చందురునెదం గాంక్షించి తాదాత్మ్యతం
బొరయంజూడఁగఁగన్నులబ్జమహిమం బొల్పొందెమోముంబయో
జ రమఙ్ బూనెను బింబమై నెగడెనోష్ఠం బవ్వరారోహకుఙ్. 113

మ. దరహాసంబునఁజంద్రికందరళ నేత్రస్ఫూర్తి నేణంబునఙ్
వరబింబాధరమాధురిఙ్ సుధను భవ్యంబౌ తనూవైభవ
స్ఫురణఙ్ నామము క్రొన్నఖంబుల నుడుస్తోమంబుఁ దూలించి చం
దురునిఙ్ డీలుపడంగఁజేసి ముఖచంద్రుం డొప్పెనబ్బోటికిఙ్. 114

గీ. దర్పణము చంద్రఖండంబు తరుణిగండ
ఫలకములఁబోల నెదిరి తద్బంధురోష్ఠ
బహుళనిశ్వాస పవమాన పటలిచేత
నడరికనుగంది హరియించె నద్భుతముగ 115

గీ. అజుఁడు చిరభాగ్యరేఖా కళాభిరతుల
నిందిరావాగ్వధూటుల కెనయటంచు
బాలికాఫాల ఫలక పార్శ్వములఁదద్వి
చిత్రములు నిల్పెనన శ్రుతి శ్రీలుదనరె. 116

మ. వదనాబ్జుండు వికాస చంద్రికలచే వక్షోజ చక్రంబులం
గదుమంగా గమకించి పోవఁగని యక్కంజాక్షి కేశాగ్రముల్
చెదరంబాఱి యుదంత మేర్పరుపఁ గాంచీదేశమున్ దాఁటి త
త్పద పద్మంబులకంతఁ దెల్ప జనెనా భాసిల్లు దీర్ఘంబులై. 117

సీ. ధారాధరస్ఫూర్తి దనరు ధమ్మిల్లంబు
ఫాలమర్ధశశాంక పటిమనెరపు
రతిమన్మథులవిండ్ల గతిమించు నెరిబొమల్
కన్నులిందీవర కాంతిఁజెందు
వనజాతరుచినెంచు వదనవిలాసంబు
వాతెరబంధు జీవముహరించు
పసిఁడిగుబ్బలనేలు పాలిండ్లసోయగం
బలకౌను మృగరాజు నపహసించు

గీ. చక్రములడాలుఁ దూలించు జఘనతలము
ఘనతరోరులు డీల్జేయు కరికరములఁ
గమలముల ధిక్కరించు జంఘాద్వయంబు
చుక్కలనడంచు సతిగోళ్ల చక్కదనము. 118

గీ. బాలికామణి సౌందర్య పదనమునకుఁ
గాంచనాబ్జ వికాసంబు కలితమయ్యె
గంధగజయాన నాసికా కంఠములకుఁ
గాంచనాబ్జ వికాసంబు కలితమయ్యె. 119

మ. భయముంజెందె నిభేంద్రయానకుచముల్ భాస్వన్ముఖాబ్జంబుపై
నయనద్వంద్వము వీక్షజేసి విలసన్నాళీక పత్రాక్షినే
త్రయుగంబంతమణంగెఁ జన్గవలకై తన్వంగి యీ రెంటికిం
బ్రియ మొందున్మదిఁ జంచలింపక రమాబింబాధరీవల్లభా! 120

సీ. అల నితంబముఁ బోలు టరిదియే కుచముఁ:
కమనీయకాంతి చక్రములఁ బోలు
నలకుచంబులఁ బోలు టరిదియే నూగారు
గురుతరంబైన భూధరముఁ బోలు
నలయూరుఁ బోలుట యరిదియే నేత్రముల్
రమణసారంగ శాబములఁ బోలు
నలనేత్రములఁ బోలు టరిదియే కరములు
కమలాతనూజ బాణములఁ బోలు

గీ. నలకరంబులఁ బోలుటే యరిదియధర
మమితరుచిర ప్రవాళ సంఘములఁ బోలు
నల యధరకాంతిఁ బోలుటే యరిదివదన
మలఘుతర బింబమునఁ బోలు నద్భుతముగ. 121

చ. మరుఁడు గిరీశనేత్ర శిఖి బ్రుగ్గి రమాసతికిన్ జనించి భా
స్వరశరచాపమౌర్వీహయ సంఘముఁ గానక వాగ్వధూమనో
హరునెదఁ గూర్చి ఘోరతపమర్థి నొనర్చ ఫలించెనా గనా
ద్విరదసమానగామిని సుదృగ్భ్రుకుటీకచ భాషలొప్పెడిన్. 122

సీ. కలహంసముల టెక్కు గదిమివచ్చిన తేవ
నున్న దానిష్టంపుఁ గన్నెనడక
ముక్కంటి శిరమెక్కి మురియుగంగావీచి
కలరీతినున్నవా కలికివళులు
మలయజామోదంబు తలమీఱివచ్చిన
భాతిఁ జెన్నారు నా పడఁతితావి
నీలమేఘముడాలు దూలఁ జేయఁగఁ జాలు
గతినొప్పు నా వాలుగంటికొప్పు

గీ. పంకజంబులదువి సొంపు పొంకమణఁచు
కరణి జిగిఁ దోఁచు నా లేమ చరణయుగము
లీలరతికంతు లాడెడు పూలచెండ్ల
వన్నెఁ గనుపట్టు నాయింతి చన్నుకట్టు. 123

క. మారునిగురాల బారొగి
నీరజదళనేత్రి వచననిపుణత కులుకున్
మారుని మామదినంబున్
నీరాజనమిచ్చు కాంత నెమ్మోమునకున్. 124

క. బలుకెంపు ఱాలగుంపుం
దులకింపున్ దంతపాళితోరపు నీలం
బుల డాల్గుండింపు వధూ
విలస త్కబరీభరంబు విశ్వాధ్యక్షా! 125

క. కంబా కంఠంబుల పగ
డంబావాతెఱ కడానిడంబామైబిం
బంబావదనము శుభకర
భంబాయూరువుల కచ్ఛపంబాపదముల్. 126

ఉ. నీలపురంగు ముంగురుల నిగ్గుధగద్ధగలాడుమేను వ
జ్రాలహొరంగు నవ్వువలరాయని డాల్పసమించుకన్నుల
ద్దాలమెఱుంగు చెక్కులు కడానిపనంటులు చన్బెడంగు ము
త్యాలహొయల్ నఖావళిమదాళుల బారలయూరు నాతికిన్. 127

సీ. కగము లోచనములు గాంచి పూర్వాంతమై
నాజేరగాఁగమనం బెదిర్చె
ప్రథమాక్షరము డించి భంగూడవళులంత
బొడమతద్వర్ణంబు నడఁగఁద్రొక్కి
పూబొందనంతటఁ బొక్కిలిగనుపింప
నాదిమాత్రయుదూలి యటనకార
మునుగూడకుచపాళి మొనయుంగ మొదలీగి
సారంబుఁజెందఁ గవంబుగదిరె

గీ. కడఁగి యిరుపార్శ్వములు గుందిగాఁ జెలంగ
లాముడియు నౌత్వమును గూడ లలితమైన
వదనమండల మొప్పారె వరుసనిట్లు
మించురుచిరాంగ సీమయా చెంచులేమ. 128

క. భాసుర ముఖమున కంబుజ
మేసరి మేనదిదలంప మృదుతరమగు మిం
చేసరి చేసరి నాళం
బేసరియై మించుచెంచు బిత్తరి జగతిక. 129

గీ. మదనుఁడను పేఁటకానికి మగువనూత్న
యౌవనముఁ జూడ నంతి కొ ద్యానమయ్యెఁ
గీరమను గాయకునికి నా సారసాక్షి
యున్నతంబగు కంఠంబు కిన్నెరయ్యె. 130

క. కుందమ్ముల చెందమ్ముల
యందముఁ దొలఁగించు చెలిరదాంఘ్రుల సొబగుల్
కంధరముల సింధురముల
కందువలదలించుఁ గలికికచ గమనంబుల్. 131

సీ. హరిణ మత్కులతోడ సరిజెంది కడడింది
కమనీయరోమాళిఁ గదియఁజూచె
శంఖముగళముతోఁ జాలక మొదలీగి
సుందర మధ్యంబు నొందఁ బూనె
భంగముల్ వళులతో బ్రతిమాలి నడుమోడి
ఘననఖావళితోడ నెనయఁగదిరె
గంధరంబురు కైశి కంబుతో నెదిరిరు
గడగంది కుచపాళిఁ దొడరనేఁగె

గీ. చెలఁగి హరి, ఖ. భంధరములు కలికిమిన్న
కలితరోమాళి మధ్య న ఖ స్తనములు
గాంచి పారబడి మాయమై కాంతిఁ దొలఁగి
కూలె నిటు జూపె వేంకట కుధర నిలయ. 132

సీ. శ్రీరామ లక్ష్మణాంచిత శోభనాకార
యలఘు కేసరి కిశోరావలగ్న
ఘనకుంభి కుంభ సంకాశ వక్షోజాత

యైరావణ ప్రహస్తోరు యుగళ
మసురేంద్ర జిద్వి నీలాంగద కేయూర
కోమల నలపాద కుముదనయన
హరి రోమరాజి శుకాలాప సుగ్రీవ
భాసుర కలమ గర్వాప్రజంఘ
గీ. మహిత తారాధినాథ సమాన వదన
లాలిత సుబాహు వల్లరి నీలవేణి
సమద గజయాన రామాయణమును బోలి
మించి రాణించుఁ జెంచు క్రొమ్మించుఁ బోణి. 133

మ. రమణీయాంగ విలాస విభ్రమములన్ రంజిల్లునాలేమ యా
కమలాక్షీమణి యాతటిల్లతికయాకప్రంపుఁగ్రొందావి యా
కొమరుం జిల్కలకొల్కి యాకలికి యాక్రొమ్మించు బెన్నద్దమా
సమచక్రస్తని యామనోజకరి యాచంద్రాస్య నీకేతగుః. 134

ఉ. సూర్య సహస్రకోటి రుచి శోభితరత్న కిరీట వేంకటా
హార్య నివాస యాసరసిజానన మీకు నమస్కరించి కైం
కర్యము సేయఁగోరియుఁదగన్మదిఁ బూని వివాహ మంగళా
దార్య రహస్యముల్ దెలుపు మంచనిపెన్దయఁ జిత్తగింపవే. 135

**చిలుక మోహనచెప్పమనిన రహస్యంబులు**
**వేంకటేశ్వరునకు. దెలుపుట**

సీ. గగన గంగాకన త్కనకాబ్జ మధుపాన
భృంగమేఁగునె మాతులుంగమునకుఁ
బరిపక్వబింబికా ఫలములానెడు కీర
రాజమేఁగునె కందరాళమునకుఁ
జారుచందన లసత్సార భాస్వాదైక
భుజగమేఁగునె నింబ భూజమునకు
విమల మానస సరోవీధి నాడెడు రాజ
హంసమేఁగునె పల్వలాంబువులకు

గీ. యామినీ వల్లభుని రాక కాత్మనలరు
నల కుముద్వతి గోరునే జలజహితునిఁ
గావున భవద్వివాహైక కాంక్షఁబొదలు
నామనంబన్యుఁజేరునే కామ జనక. 136

ఉ. వేంకటనాథ నీపలుకు వేమఱు వీనుల సోఁకినంతనే
కొంకక మన్మథుండనెడు క్రూరుఁడు పుష్పశరంబు లేయఁగా
జంకెమనంబు తోడుతనె సాఁగెపిపాస భవత్కృపామృతం
బంకి లిలేక కూర్చి విరహార్తి హరింపు వరింపు మింపుగన్ 137

క. మదన జ్వరపీడిత మగు
మదీయ విమలాంగమునకు మంగళమగు నీ
మృదు సంగతియను దివ్యౌ
షధ సేచనఁ దేర్చి బ్రోవు సరసిజనాభా! 138

సీ. వైకుంఠ నీనామ వర్ణనల్ సేయని
మంజుల వాక్సుధా మధురమేల
ప్రణవస్వరూప నీ పైఁజింత సేయని
విమల చిత్తాంభోజ విభవమేల
కమలాక్ష నీకలంకారంబు సేయని
కరపల్లవంబుల కలిమి యేల
నిఖిల లోకేశ్వర నిన్పూజ సేయని
సతత సత్యవ్రత చర్యలేల

ఆ. దేవదేవ నీదు దివ్యమంగళరూప
మరసి చూడలేని యక్షులేల
గరుడ గమన నీకుఁ గైంకర్య మతిభక్తిఁ
జేయలేని నాదు జీవమేల? 139

సీ. కైటభాంతకనీవు కౌంగిలింపఁగ లేని
తళుకు లీనెడుమేని చెలువమేల
తిరుపతీశ్వర నీదు కరములంటఁగ లేని
లలిత వక్షోజ విలాసమేల

సుజన ... నీవు చుంబింపఁగా లేని
మంజులాధర సుధా మధుర మేల
పురుష పుంగవ నీవు భోగింపఁగా లేని
విలసితంబగు వయో విభవ మేల

ఆ. మోహనాంగ నీవు ముద్దు సేయని మాన
ధనమదేల చక్కఁదనమదేల
జీవితేశనీవు జేరిపొందనినాదు
బ్రతుకదేలయెన్ని భవములకును. 140

మ. కమలానాథభవత్సమాగమమెదం గాంక్షింతుమర్థి రుక్మిణీ
రమణీరత్నము నిన్నుఁగోరినఁ గృపన్ రాజేంద్రులందోలి వి
క్రమమొప్పారగఁ దెచ్చికైవడిననుంగైకొమ్ముకాదేని ని
క్కమునీమూర్తిఁ దలంచుచున్ విడుతుమ త్కాయం
బవార్యంబుగర్థి 141

క. అనుచునిటు భిల్లవనజా
ననతెల్పిన పలుకులెల్ల నగధరుసముఖం
బునవిన్నవించి వెండియు
మనమలరఁగఁ జెప్పఁదొడఁగె మహితప్రౌఢిన్. 142

ఆ. సరసిజాక్షనీదు సాంగత్యవాంఛచే
మోహమనునిదాఘమున మనోజ
తాపమనుదవాగ్ని తప్తయైఘనతపో
వ్రతముఁబూనెభిల్ల రాజవదన! 143

చ. భవదురురూపమున్ హృదయ పైరికభాగమునందుఁ జేర్చిక
న్గవవిరిసోనలర్చలిడి కౌతుక మొప్పవచో మధూర్మిలన్
వివిధ తరోపహారములు వేగసమర్పణ మాచరించుఁదా
నవిరళ పూజలిట్లహరహంబును జేయుఁజమీమురాంతకా. 144

చ. ఘనశయనీయ పల్లవ నికాయమనోభవ తోమరాళిపైఁ
దనువొగిఁజేర్చి తక్షతజ తాపమునోర్చుచు సాముసేయుచుం

డనిశము భావిభవ్యభవ దంగజసంగరకేళి నోడకుం
డనుశబరాంబుజేక్షణి దృఢస్థితి శేషనగేంద్రమందిరా. 145

ఉ. పంకజగంధి పుష్పశర బాధనలంగి కృశాంగవల్లియై
కంకణముఖ్య భూషణ నికాయము భారముగాఁదలంచుఁబ
ర్యంకమునందనర్చుకుసు మాగరుచందన పల్లవంబుల
గ్న్యంకురపాళిగాదలఁచు నాత్మనహర్నిశ మోముఁరాంతకా! 146

మ. మదనాస్త్రంబులు మాటిమాటికి నిజాత్మం దాఁకుటంజేసినీ
పదపద్మంబు లఖండ వజ్రకవచ ప్రాయంబుగాశోభనా
స్పదమౌతావక నామమంత్రమతి నిష్ఠంబూని యబ్బిల్లరా
ట్సుదతీ రత్న మొగిన్ జపించును గృపం జూపట్టులోకేశ్వరా.

క. విరహోపశమంబునకై
పరభాషలు వినకనొండు బలుకక యిహమున్
మఱచి శబరేంద్రబింబా
ధరిత్రికరణముగ భవత్కథలు వర్ణించున్. 148

ఉ. ఓనలినాక్షయో కరికు లోత్తమరక్షక యోకృపాబ్ధియో
మానిత తేజ యోదితి కుమారకదంబవిదూర యోమహా
మౌనివరేణ్యహృజ్జలజ మత్తమధు వ్రతరూపయంచున
మ్మానవతీ లలామపలు మాఱునినున్ మదిలోఁ దలంచెడిన్. 149

ఆ. చారుహంసిలేని జలజాకరమువోలె
మధురఫలములేని మావివోలె
శాబరేంద్రతనయ సఖ్యమబ్బనినీవి
లాసవైభవంబు లాఘవంబు. 150

గీ. కేళిగృహమునఁ జెంచు పూబోఁడితోడ
నతనుశాస్త్ర క్రియాతంత్ర మభ్యసించు
కాలమందునమణిపుత్త్రి కాచయంబు
వెలయమీమీఁదనించును విరులసోన. 151

క. ననుదిర్య గ్జంతువుగా
మనమునఁ దలఁపంగవలదు మద్విహితోక్తుల్
విని విశ్వసింపఁగాఁదగు
ననుమానము దక్కు వేంకటాచల నిలయా! 152

మ. లలితంబైన యనంగతంత్రజనితో ల్లాసంబుఁగల్పింతు మం
జులావాఙ్నైపుణ చాతురీమధురతల్ జూపట్టుదున్ దూర భూ
ముల యందొప్పు విచిత్రవార్తలెలమిన్ బోధింతుభూమండలే
శులశుద్ధాంత కులాంగనామణులకుం జోద్యంబు రెట్టింపఁగన్ 153

వ. కావున మత్పురాకృత సుకృతఫల విశేషంబునం జేసి భవత్సందర్శనంబు గలిగె, సకల విద్యాప్రావీణ్యంబులుఁ గరతలామలకంబులై యుండు, విశేషించి చెంచుక్రొమ్మించుబోఁడి ప్రాణపదంబుగా రాయబార చక్రవర్తివని నన్ను మిగులమన్నించుచుండు నది మొదలు నెన్నండును మృషాభాషణంబులు వలుకఁ బలికిన కార్యంబు సాధింతు ననంతకోటి బ్రహ్మాండనాయకుండవైన నీపాద పద్మంబుల సన్నిధి మము బోంట్లు సేయు కార్య సంధానంబు లెంత గొప్ప, గొప్ప కొంచెంబని విచారింపక నన్నుంబనిగొమ్ము లెమ్ము కాలయాపనంబు సేయ వలవదు మేఘంబులు మెఱుంగుఁ దీగెయుం బోలి, లతాంతంబును సౌరభంబునుంబలె, గౌరీశంకరుల చందంబున, వాణీహిరణ్య గర్భుల వడువున, నితాంతా నందకల్యాణ వైభవంబున నక్కాంతాతిలకంబు నీవు నన్యోన్య ప్రేమానుబంధబంధురంబుగా ననుకూల దాంపత్య ధన్యత్వంబు నొందుండని విన్నవించిన. 154

## వేంకటేశ్వరుండు చిలుకను గారవించుట

గీ. ఆశుకాన్వయ వార్ధిశశాంకువలనఁ
బ్రాప్తమైనట్టి వాక్సుధా రసముఁగ్రోలి
ముద్దు మోమునఁ జిఱునవ్వు మొలక లెగయ
శేషనగవాసి యాశ్చర్య చిత్తుఁడయ్యె. 155

గీ. ప్రకటితానంద సాంద్రకృపారసంబు
చిలుక చిలుకలరాయని చేధరించి

కుంచియెఱకలు దగసవరించిదువ్వి
యింపుదళు కొత్తమృదుభాష నిట్టులనియె. 156

సీ. పతగలోకేశ నీప్రజ్ఞావిశేషంబు
వినుతింపఁదరమె వాగ్విభుని కైన
ద్విజకులోత్తంస నీదివ్యగుణావళుల్
గొనియాడశక్యమే గుహునికైన
స్మరహయోత్తమనీదు సాహోగ్రగరిమంబు
వర్ణింపనగునె గీష్పతికినైన
ఖగవర్య నీదు వా క్యమృదుత్వ చాతుర్య
మూహింపవశమె శేషాహికైన
ఆ. విహగనాథనీదు విమలాంతరంగంబు
నరయఁదగునె వజ్ర ధరుని కైన
గానభవదుదార గంభీరవాక్పూర
మతనుతాపవహ్ని కాజ్యమయ్యె. 157

ఉ. ఇక్షురసంబుఁబోలె శబరేందు ముఖీతిలకంబు భాగ్య స
ల్లక్షణ రూప విభ్రమ కళాగుణశీల విశేషమిట్లు ప్ర
త్యక్షము దోఁపఁ బల్కఁగ ముదావహమయ్యె మదాత్మసీమ కో
పక్షికులావతంస కనుపండువయయ్యె భవత్ప్రసంగముల్ 158

చ. అతివ రుచిప్రవాహజనితానన పంకజ వాటియందు నం
చిత మధుపాన వాంఛితముఁ జెందఁగ మామకదృఙ్మిళింద సం
తతి విహరింప నెంతయు ముదంబునఁ దోఁగె శకుంతమా సదా
గతి గతి నేఁగి తద్విరద గామివిఁగూర్పుము నేర్పు పెంపునన్. 159

ఉ. చిత్తము పల్లటిల్లె నవశీకృతమయ్యె మదింద్రియాళిమేన్
తత్తరపాటు నొందెఁ గడుధైర్యము దూలె రతీంద్రసాయ కా
యత్త ధనంజయోగ్ర నిహతావయవ వ్రజ మోహటించెఁగీ
రోత్తమ తచ్ఛశాంకముఖి నొప్పుగ నన్గదియింపు మింపుగన్160

ఆ. అని నృసింహదేవుఁ డానతిచ్చిన శకుం
తాధిపుండు తత్పదాబ్జములకు
ముదముతోడ మ్రొక్కి ముమ్మాఱు వలగొని
వినయవృత్తినంత వీడుకొనియె. 161

వ. ఇట్లఖిలఖగేంద్రుండరిగిన ఖగేంద్ర వాహనుండు క్రీడాకాంతారంబునం దేలామిళల్లవలీ నికుంజాంత రైందవ శిలా భాగంబునం దొక్క రమ్య స్థలంబున విశ్రమించి భిల్ల పల్లవాధరీ సౌందర్యాది గుణంబులు మనంబునం దలపోయుచుండె నట శకుంతవల్లభుం డక్కుటిల కుంతలి మనోరథంబు సఫలంబు సేయంగంటినని యవ్వానాం తంబు గ్రామక్రమంబునం గడచి చని సుగంధ గంధ బంధుర గంధవహాక్రాంతంబైన తదీయ నివాసంబు చేరు సమయంబున. 162

ఉ. ఇంతులతోడఁగూడి శబరేందు ముఖీతిలకంబు కేళి శు
ద్ధాంత మృగాంకరత్నమయ హర్మ్యతలంబున విశ్రమించి యే
కాంతపు గోష్ఠినుండి విహగాధి పురాకకు నెమ్మనంబులో
నెంతయుఁ గోరుచుం దడవదేమిటి కయ్యెనటంచు నెవ్వగన్ 163

ఆ. చెలిమికత్తెలైన కలకంఠి కనక ల
తా లతాంగులెల్లఁ దన్ను బలసి
కొలువఁ గొలువుదీర్చి చిలుకరాయనిరాక
కరసి చూచుచున్న యవసరమున. 164

క. వామాక్షి కప్పుడంతట
వామాక్షి భుజాకుచోరు వర్గంబదరెన్
వామాక్షులు మేలన వా
గ్వామాక్షీ ధవకృత ప్రవర్ధన మగుచున్. 165

చ. కలువ కటారివీరుఁడు నిగారపువాఁడి మెఱుంగుటైదు తూ
పుల నడు చక్కి మేల్తరపు మూఁడవ బాణము తుంట వింటనే
ర్పలరఘటించి పొంచి రయ మారఁగ నేసెననం దటాలునం
జిలుకలరాజు రాజముఖి చెంగటఁదోఁచె మనోహరంబుగన్. 166

శా. జంగల్పచ్ఛహొరంగు చట్టుపలుతాజా డాల్పిసాళించు పి
ట్టం గన్పండువుగాఁ గనంగనెద నిండఁగ మెండుగాఁ గొర్కొలు
ప్పంగెం బున్నమరేయి రేవెలుఁగు రాఁ బొల్పారు దుగ్ధార్ణవో
ద్రం గత్తుంగతరంగమాలికల నా రాజీవపత్రాక్షికిన్. 167

**చిలుక వేంకటేశ్వరు నంగీకారంబు చెంచుకన్యకకుఁ దెలుపుట**

ఆ. ముద్దుఁ గులుకఁజెంచు ముద్దు గుమ్మలమిన్న
ముద్దు చిలుక మోము ముద్దుఁగొనుచు
ముద్దు పలుకులెలమి ముచ్చటింపఁదొడంగె
గబ్బి గుబ్బలుబ్బి గగురు పొడువ. 168

గీ. మంగళమె వేంకటాచల మందిరునకు
భద్రమే తన్మహాదాస వర్గమునకు
క్షేమమే నీకుఁ గృతకార్యసిద్ధిఁగాంచి
వచ్చినాఁడవె గుణధుర్య పక్షివర్య 169

గీ. అతుల ధీనిధియైన యా యండజంబు
వనిత మనమును సంతోషవనధియందు
మోహ నిబిడతరంగ సందోహములను
దూఁగఁజేయుచుననియె మాధుర్య కలన. 170

గీ. మంగళము వేంకటాచల మందిరునకు
భద్రమును దన్మహాదాస వర్గమునకు
భవ్యతరమైన కార్య సాఫల్యమయ్యె
నేమిచెప్పుదు నీ భాగ్య మిందువదన. 171

మ. పరమామోదముతోడఁ దావక శుభ ప్రారంభమర్థించి స
త్వరతంబోయి రమాంగనారమణు హృద్యంబొప్ప దర్శించి నీ
వరసౌందర్య విలాస విభ్రమ కళావర్గం బెఱింగించి త
త్కరుణా లోకన లబ్ధకార్య ఘటనాఢ్యుండనై వచ్చితిఁ 172

మ. వనితా నీకును వేంకటేశునకు భావద్వంద్వ మేకీగతిఁ
జన లీలాగృహమందు రేఁబగలు నెంచం గాల మింతేకదా
యని నిర్ణీతము సేయకుండ భవదీయానూన మోహేచ్ఛ నాం
దిన దాఁకన్ మరుకేళినుండెదవు తాదృగ్రాజహంసస్థితిన్ 173

మ. లలనా నీవును వేంకటేశ్వరుఁడుఁ గ్రీడల్ సల్పు నవ్వేళ గ్రు
చ్చిలు గంధానిలచోరుఁ డిష్టధన మార్జింపంగఁ గేళీ నిశాం
త లసజ్జాలక జాలమార్గ గతినంతం జొచ్చి తల్పంబునం
గలయం గ్రుమ్మరుచున్ రతిశ్రమజ సద్ఘర్మాఘు ముక్తావళుల్. 174

ఉ. అంబుజ పత్రలోచన సితాంబుజ నేత్రునితోడఁ గూడి నీ
వంబుచరాంక సౌఖ్య విభవాంబుధి దేలెడు వేళలన్ సరో
జాంబకధారి దంభకల నాప్తినిముం గెలిపించు చూపులే
యంబకముల్ బొమల్ ధనువునంచిత మోహమె
నారిఁజేయుచున్. 175

మ. తరుణీ నీకును వేంకటేశునకు నూత్నప్రేమ వాటిల్లు నాఁ
డరవిందాంబఁక సంగరోరుజనితాయాస శ్రీ మంబింక భా
సుర యంత్రాన్వితతాళ వృతంగరిమన్ శోభిల్లి వీచున్ సుమా
గరు కర్పూర సుగంధబంధురమిళద్గంధా నిలుండెంతయున్176

మ. సరసీజాయతనేత్రి నీవతఁడు శేషగ్రావ సౌవర్ణ కం
దర దేశంబులఁగూడి యాడెడుతఱిన్ ధారాధరై రమ్మద
స్ఫురణంబంచును మీ తనూవిలసంబుల్ గాంచి గోకర్ణ భు
గ్వర సందోహ మొనర్చు నాట్యములు కేకాధ్వానముల్
సేయుచున్ 177

మ. అరవిందానన నీ వతండతను తంత్రాభ్యాస వృత్తిన్ సుధా
దర చుంబీకృతమైన కాలమున మోదంబందు నేత్రౌఘము
త్తతిఁజూడ న్ననుకూల కంజములుగా తద్బింబవీక్ష నిరం
తర మోహేచ్ఛఁ జెలంగు వాని కిఁకఁ జింతల్లేవు భావింపఁగన్178

చ. కమలజగంధి వేంకటనగప్రభుతో శశికాంతచారు కు
టిమకటకంబులం దిరుగు వేఁగనుంగొను చంచలాఘనో

ద్యమగతినొప్పుమీ తనువులం గదరావముగర్జలైరతి
శ్రమజలపఙ్క్తి వర్షమయి రత్నసరుల్ కరకాకలాపమై 179

మ. గరుడారోహణ కేలిమైదివికి నేగంగాంచి మందాకినీ
తరుణాంభోరుహ నేత్ర విచికలఁ బాద్యంబిచ్చి సౌవర్ణ భా
సురపద్మం బులఁ బూజఁజేసి మధువున్ శోభిల్లు ముక్తామణుల్
గురుపూజారతి కాన్కఁజేసి తగ మ్రొక్కుఁ గమీకు మోదంబునన్ 180

మ. కలకంఠీ హరికీర్తికల్పకము లోకాలోకముల్ మీఱ ది
వ్యులు జింతింతురు నాత్మలందు దనుజవ్యూహంబునం దారుము
గ్గలశాంభోధి మథించు కాలమునఁ జక్కంబుట్టు భృంగావృతో
జ్జ్వలకల్పద్రుమ మెంచలే కరసిలజ్జందత్ప్రియాహీనులై. 181

శా. కాంతాకంతుని తండ్రి దానమహిమం గద్రూజమర్త్యామరుల్
సంతోషంబునుబొంది యుండఁగని యాస్వర్ధేను చింతామణీ
సంతానంబులు చింతనొంది తమభాస్వత్తేజముల్దూలె నం
చంతన్ వెల్వెలనై మహోపలమునై యచ్చంపుఁబ్రాఁకయ్యెడిన్. 182

మ. ధవళాక్షీ వినవమ్మ తెల్పెద సమిద్ధాత్రీస్థలిల్ ఘోరశా
త్రవరాజన్య కిరీటఘట్టితమ హోద్య ద్రత్నసంఘాత ప
ల్లవముల్ ఖాద్యము సేయుఁజూపె ఫణిశైలశ్రేష్ఠ సంవాసి హ
స్తవహోభీల కృపాణకోకిల ముదంచత్క్రోధ మేపారఁగన్. 183

మ. ఘనసంగ్రామ ధరాట్టహాస దనుజక్ష్మాపాలకా సు ప్రభం
జనసందోహముఁ గ్రోలుగారుడ మహోశైలేంద్ర సంచారి హ
స్తనటద్భైరవ చండరోషనిశితోద్దా మోగ్ర ఖడ్గాహి నూ
తనసంపుల్ల సరోజలోచన శరత్సంపూర్ణ చంద్రాననా. 184

మ. ప్రకటస్ఫార గదచ్ఛి దారిధరణీ పాలవ్రజోద్య న్మహో
మకుటాగ్రస్థగితోరుహీర కలితక్ష్మామండలంబై యనిన్
మకరీంద్రాంతకు బాహుదండ మెలమిఁ భాసిల్లు సత్కీర్తి బీ
జకలాపంబలికించు శేషగజసంచార క్షతక్షోణిలోఁ. 185

మ. వెలఁదీ వేంకటభర్త కీర్తిలతికల్ వేధోండభాండంబులం
గలయంబర్విఁ జంద్రశేఖర శశాంక స్వర్గజద్యో ధునీ
కలహంసంబుల కంఠ చిహ్నామదరంగ త్రైవలోద్రక్తిమం
బులభేదించి కనంగలే కమరరాణ్ముఖ్యుల్ ప్రశంసించెడిఁ 186

గీ. నిటలలోచనుపటు జటాపటలినుండి
క్రతుభుజోరగ మనుజలోకముల దిరిగి
పతితపావనమూర్తియై వనధిఁజేరు
జాహ్నవీదేవి హరిపదజాతసుమ్ము 187

ఉ. ఆమహనీయమూర్తి భవదన్వయరూప కళావిలాసముల్
మామకవాక్సుధామధుర మంజులపద్ధతి నేర్పరింపఁగాఁ
దామదిలోఁ గరంగి పెనఁదాలిమిఁదూలి రతీంద్రసాయక
స్తోమశిఖాకలాపహతిఁ జొక్కెసుమీ శరదంబుజాననా. 188

గీ. బాలనీపెట్టి శ్రీమంతురాల వొక్కొ
లలితలావణ్యరూప కళావిభూతి
చారువనలక్ష్మి మాధవస్వామివోలె
సంతసిలఁజేసెఁ దత్సుతునంతవాని. 189

సీ. తావకభవ్య సౌందర్య దర్శనలాల
సస్వాంతమేపారి సంభ్రమింప
ఘనతరానందాశ్రుకణ సిక్తసితపద్మ
దీర్ఘలోచనముల తెలివిగంద
మదనతాప జ్వరోన్మాద కంపితగాత్ర
వల్లరిసుమశయ్య నుల్లసిల్ల
నిశ్వాసభరమున నెఱిదప్పి కసుగందు
పాటలాధరకాంతి పరిఢవిల్ల

గీ. నధికచింతా దురంతమోహ ప్రవాహ
పూర నిర్మగ్నుఁడయి దరిఁజేరలేక
విముఖుఁడైయున్న ఫణిశాయి విప్రలంభ
భారమేమని వినిపింతుఁ బద్మగంధి. 190

మ. భటులంగూడక నిల్చు నూరకభయభ్రాంత స్థితింజెందు ను
త్కటకందర్ప శరాగ్ని తప్తఘనచింతాడోలలం దూఁగు దు
ర్ఘటమూర్ఛావివశార్తి గాసిలును లక్ష్యాలక్ష్యముల్ మాను న
క్కట నిష్కారణలీలలన్నగు శరత్కంజాత పత్రేక్షణా 191

ఉ. సందియమేమిలేదు ఫణిశాయి నిను న్వరియించుభిల్ల సం
క్రందనపుత్రి తచ్ఛుభకరగ్రహణోత్సవ లీలఁదేలెదా
నందకృతాభిలాషకలన స్థితిఁగాంచెదవమ్మ మున్ రమా
సుందరిఁబోలి భోగములఁజొక్కి వహించెదు వైభవంబునన్ 192

క. అన్నువలమిన్న కేర్పడ
విన్నపమొనరించెఁ జిలుక వినయముతోడన్
మన్ననతో వేంకటవిభు
సన్నిధికింబోయివచ్చు చందము లెల్లన్. 193

క. కమలా మనోహరుండగు
కమలాక్షు గుణంబులెన్నఁ గమలజగౌరీ
రమణుల కశక్యమగు నో
రమణీమణి తెలుపఁగాఁ దరంబే నాకున్. 194

గీ. అనుశుకస్వామి మధురవాక్యామృతంబు
కర్ణములసోఁకఁ గర్పూరగంధి మాన
సాంబుజాతంబునకు గోచరంబుగాని
ఘనతరానంద రసపూరమనుభవించి. 195

## చెంచుకన్య చిలుక రాయబారంబునకు సంతసించి గారవించుట

మ. చతురత్వంబు సుధీజనానుమత సంచారంబు సన్మార్గలో
లతయున్ సమ్యగుపాయ కార్యకృత లీలాసౌమనస్యంబు సం
తత మేధాకుశలత్వమున్ సుగుణ సత్యజ్ఞాన సంపత్తి నీ
కెతగుం జూపె మనోజ వాహనమణీ కీరాన్వయగ్రామణీ. 196

చ. వనజభవాభవత్రిదశ వర్గముగానఁగ రాని యజ్ఞనా
ర్దనుఁగని యస్మదీయ విహితంబెఱిగించి శుభైకవార్తఁ దె
చ్చిన పరమోపకారగుణ శీలుఁడ ప్రత్యుపకార మెద్ది సే
యనుగననేరనీకని రయంబున ముద్దిడియెన్ ముదంబునన్. 197

శా. సీతాచిత్తనివాస, వాసవసుతచ్ఛేదోగ్ర యుగ్రాంశుసం
జాతగ్రావ చరాధిరాజ్యపదవీ సంధాన, సంధాన వి
ఖ్యాతోద్యత్కరణీవహోద్రి చరహృద్యస్తోత్ర పాదాబ్జ, య
బ్జాతాదిత్య శశాంకలోచన ధనుర్భంగ ప్రతాపోదయా. 198

క. సాకేత పురనివాసా
రాకాశశికోటి భాస రమ్యవిహాసా
భీకరదనుజ కదంబా
నేకపరాణ్మదమృగేంద్ర నిబిడోల్లాసా. 199

మాలిని. రవిహృదయ మహామంత్ర ప్రహృష్టాంతరంగా
పవిధరసురమౌని వ్రాత చిత్తాబ్జభృంగా
వివరపటు నభోద్యర్భిన్న నాగేంద్రబంధా
పవనజకృత హృద్యద్భవ్య దివ్యప్రబంధా 200

## గద్యము

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్ష వీక్షాప్రసాదపరిపాక లబ్ధప్రసిద్ధ కవితావిలాస కళాధురీణ శ్రీమదాపస్తంబసూత్ర శ్రీవత్సగోత్రపవిత్ర వద్దిపర్తి వేంకటామాత్య పుత్ర సకలసుజనవిధేయ కోనంరాజ నామధేయ ప్రణీతంబైన వేంకటేశ్వరోపాఖ్యానంబను శృంగార ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



# శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము

## తృతీయాశ్వాసము

క. శ్రీమద్భద్రమహీభృ
ద్ధామా సంగ్రామభీమ దనుజకులేంద్ర
స్తోమవిరామా నుతసు
త్రామా లోకాభిరామ రాఘవరామా 1

వ. దేవా యవధరింపుము. 2

గీ. కీరవల్లభు భాషాప్రకారమహిమ
తనదుకర్ణంబులకు రసాయనముగాఁగ
గబ్బిచనుదోయిపులకించె నిబ్బరంపు
మేనురంజిల్లె నబ్బిల్ల మానవతికి. 3

చ. జలజదళాయతాక్షుని భుజాలతికాధనువందునం దదు
జ్జ్వలసుగుణంబు శింజినగఁ జారుతనూవిభ వాభిరామమం
జులమయతద్వికాసమురు శోభితబాణముగా గదించి య
య్యలరులవింటిజోదుకమాలసన సేయఁ దొడంగె నొక్కటన్. 4

గీ. మాటిమాటికి నవపుష్ప మార్గణములు
చిత్తజాతుండు నిగుడంగఁ జేయుకతన
నురగశయనునిలావణ్య సరసిలోనఁ
జెలఁగిక్రీడించెఁగమలాక్షి చిత్తహంసి. 5

క. వదనాంభోజము వాఁడఁగ
మదిఁజింతవహింపఁ బ్రేమమల్లడిగొనఁగాఁ
బెదవిమ్మై దీఁగెకందఁగ
మదవతి విరహాగ్నిఁగాలమానము గడిపెన్.

గీ. స్వేదమంతటఁ దనువునఁ జెంగలింప
స్మరశరవ్యధ మానసం బెఱియఁగంట
నీరునింపుచు బొటవ్రేలు నేలవ్రాయు
చుండె మోహాంధయగుచు వేదండగమన.

మ. అతనుండంత నితాంత రోషమునఁ బ్రత్యాలీఢుఁడైమండలీ
కృతబాణాసనమందు భృంగగుణముం గీలించి పద్మాశుగ
ప్రతతుల్ నెమ్మెయి గాడనొక్కవడి నింపం దచ్ఛరాగ్నిచ్ఛటా
హతిఁజింతించు నుండె నంత నరవిందామోద పెన్వేదనన్.

గీ. కడఁగి విరహజ్వరంబుమై నడరియున్న
వనరుహానన హరికథావనధిఁ దోఁగె
నట్టి విపులవికారగుణాభివృద్ధి
నంతకంతకుఁ బరితాపమతిశయిల్లె.

మ. మదనానూనశరాగ్ని చేతనిజశుంభ ద్గాత్రలావణ్యముం
జెదరంబాఱకమున్నె శేషగిరివాసిం జెక్కు గీటంగనున్
బెదవిందేనియఁ బ్రేమతోడఁ గొన దోర్మధ్యంబునం గౌఁగిలిం
పఁదలంచున్ వికచాబ్జనేత్రి మదిలో భావించి తర్కింపఁగన్. 10

చ. సరసిజ గంధి వక్షమునఁ జల్లని చందనకర్దమంబు బి
త్తరులొగిఁబూయఁ గట్టెదుటఁ దార్కొని మన్మథుఁడంపవెల్లిపే
బఱపఁ దనర్చి చిట్టుడుకుబట్టి తదుద్భవబుద్బుదాళినా
మెఱసెఁ గుచాగ్రహారముల మేలగుమౌక్తిక జాలమంతటన్. 11

సీ. చంద్రంబుఁబూయదు చంద్రసంకాశాన్య
కల్పముల్ దొడవదు కల్పగాత్రి
రాజీవమంటదు రాజీవలోచన
కనకంబు ముట్టదు కనకనాస

సారంగిఁ బెంపదు సారంగగామిని
మధురసం బానదు మధురభాషి
భువనంబులాడదు భువనైక మోహిని
యాళిఁ బేర్కొనదు మత్తాళివేణి

ఆ. వనికినాడఁబోదు వనితాశిరోరత్న
మలరు బాన్పుఁజేర దలఘుచరిత
బంధువులఁబిలువదు బంధూకసుమనోష్ఠి
వనజనాభుమీఁది వాంఛఁజేసి. 12

క. మరునకు దయగల దెన్నఁడు
వరునిముఖాబ్జంబుఁజూడ వచ్చుట యెన్నం
డరిది యిదియనుచుఁజింతిలెఁ
దరుణీమణి మోహవార్ధి దరియింపంగన్. 13

సీ. సకియ సెయ్యపువయస్యల నిచ్చఁగనుఁగొన
దక్షులంతః చక్షులౌటఁజేసి
సతిచక్రిదర్శనో త్సవనితాంతప్రేమఁ
బలుమాఱునిదురలోఁ గలవరించు
వనితచింతాంభోనిధిని మునింగి పయోధ
రాగ్రంబులకునించె నశ్రువారి
తరుణికన్నులవింటి దొరకమ్మ పూవుట
మ్ములవేఁడిఁ బాండిమమ్మును వహించెఁ

గీ. బొలఁతి మదికింపుగాదయ్యె భోజనంబు
చెలికి వెగటయ్యె శుకశారికలరవములు
కాంతకరుచయ్యె వల్లకీ గానరసము
నంతకంతకు సంతాపమతిశయిల్లె. 14

చ. అలజవరాంద్ర మిన్నతలిరాకుల విందులకున్ ఫలాశియౌ
చిలుకలపాలికిన్ మధువు జిమ్మనఁ గ్రొలెడి దుర్మదాళి ప
జ్క్తులకును బాపరావిసపుకుత్తుకఁద్రెళ్లెడువేఁడి గాలికిన్;
అలరులవింటి దేవరవయాళిహాళాహళికుల్కి యాత్మలోన్. 15

సీ. చతురంగబలసముద్ధతివేఁట కైరమా
లోలుఁడివ్వనికిఁ దానేలవచ్చె
వచ్చిననేమి యవ్వనజాతు భేరికా
రవమదేమిటికి నాచెవులసోఁకె
సోఁకిన నేమి యాచొప్పుఁ గానఁగఁ గిర
ముఖ్యనంపఁగనేల బుద్ధివాడమెఁ
బొడమిననంత నెవ్వఁడినేఁగి మధువైరి
దివ్యలీలలఁ జిల్కు తెలుపనేల

గీ. తెలుపఁగానంతమాత్రానఁ దిరుపతీశు
పైమహామోహ విభ్రాంతిఁ బడితినేల
కటకటా! దైవకృతమెట్టుగడఁగునొక్కొ
యంచుఁ బలవించునచ్చెంచు మించుబోఁడి. 16

సీ. పంకజంబుల పెంపు పగటియందెయటంచు
ముకురసన్నిభమయ్యె ముద్దు మోము
నీలోత్పలంబులడాలు రేలనటంచు
ఘనచకోరపు తీవిఁగనియెదృష్టి
గగనంబురీతిఁజూడఁగన భావంబని
సింహమధ్యంబుగాఁజెందెనడుము
మదపికంబులసొంపు మధువేళ నెయటంచు
దరవిలాసంబుగాఁ దనరెగళము

గీ. కలితచంచలకాంతి చంచలమటంచుఁ
గల్పవృక్ష స్వభావంబుఁ గాంచెమేను;
అసమశరభిన్నరుచిర రసానులేప
నమునధవళిమగన్పట్టె రమణి కపుడు. 17

క. ఈకరణిసుందరీమణి
శ్రీకరమణిమందిరమున సిరికొమరుని బి
ల్చికాకునొంది డెండం
బాకులతంబొందియుండె నాసమయమునన్. 18

మ. తన కెల్లప్పుడు వైరిరాహువని చిత్తంబందుఁగోపించి త
ద్ఘనసత్వంబుడుపన్మ హూద్ధతి బుభుక్ష వ్యాప్తిఁదూలించ నా
య్యన నవ్వార్త నెఱుంగఁజేయుటకు నయ్యర్కుం డదాక్షిణ్యుఁడై
యనిలుంగానఁగ నేఁగెనోయన నుదీచ్యస్థానమందెన్ వడిన్. 19

సీ. లలితరసాల మంజులఫలంబులు మెక్కు
మదకీరసంచార మహిమఁదనరి
బహుతరనవ్యప్రవాళ సంతతిఁజెక్కు
కలకంఠకులనాద కలనఁబొదలి
కలితప్రసూనైక గంధసంకులమాను
మధుకరగీతసంపదలనెనసి
కమనీయకాసార కమలకేళిఁ జెలంగు
కాంచనహంసప్రకాశమంది

గీ. కనకమందారకుందచందనలవంగ
లుంగనారంగసారంగ తుంగమాతు
లుంగముఖ్యవనాంత విలోలవైభ
వంబగుచుఁదోఁచె వాసంతవాసరంబు 20

## వసంతకాల వర్ణనము

ఆ. జాతితరులు దక్క సకలభూజంబులు
సురుచిరముగనొప్పెఁ జూడఁ జూడ
దినదినమున కొక్క ఘనమైన చాయగా
నజ్జుఁ జేసి వనల గుజ్జుబెరసె. 21

సీ. రతిమనోహర సముద్ధత చమూరజమనా
ఘనసారతరుపరాగము దనర్చె
ననవింటి పాదుషా ఘనతోమరములనాఁ
దతకేతకీగర్భ దళములమరె
ననమాయుధునియశో విసరాంకురములనా
రమణీయకుందకోరకము లలరెఁ

గరువలి వేరిదేవర చామరములనా
ద్రాక్షగుళుచ్ఛ వితాన మెసఁగ

గీ. శంబరవిరోధి భేరికా శంఖమురజ
ఘంటికాతాళముఖనాద కలితమనఁగ
మత్తపికశారికాకీర మధుపబర్హి
కలరవంబుల కలకలంబులు చెలంగె. 22

గీ. విరహులఁ గలంపరతిమనోహరుఁడు పొంచి
యుంచువిల్వంచి యాత్మఁ గ్రోధించి మౌర్వి
చంచదురుసాయకములు సంధించునోజఁ
దనరె సెలతనవ్యదీర్ఘ కుందప్రజంబు. 23

గీ. వనరమాసతి మధుమాస వరునిఁగూడ
వేడ్కఁ సేయంగఁ బొడమెడు విపులతాప
వహ్నిఁ జల్లార్పఁ జెలులుంచు ప్రకటమైన
ముత్తియపుఁబేరులన మల్లెమొగ్గ లమరె. 24

సీ. చిగురాకుఁ గొరికిన యొగరువో గొజ్జంగి
నీటనాలుకలుంచ నిగుడుఁ గొన్ని,
వెస జీడిపండులు మెసవిన పొగరువో
బింబికారసమానఁ బెనఁగుఁ గొన్ని,
ముక్కులఁ బాముల మెక్కిన విసము వో
నమృతంబుఁ గ్రోలంగ నరుగుఁ గొన్ని,
భ్రమచేతఁ గనకంబు పజ్జనేఁగినకందు
బోవంగ మల్లెలఁ బొరలుఁ గొన్ని,

గీ. పిక శుకమయూర మధుకర నికర మెలమిఁ
గూడి తమతమ విరసంపు జాడలెల్ల
వల్లభల కేర్పరించుచు నుల్లసిల్లు
నతి మనోహరమైన వనాంతరమున 25

చ. కలువకటారిరాజు కలకంఠమధువ్రతకీరశారికా
కలరవ బర్హి సద్భటనికాయముఁగూడి వసంతమంత్రితన్
గొలువఁగ బాంధవైరులను గొట్టి తదీయమనోధనంపురా
సులుదగ నిల్పెనోయనఁగ శోభిలుఁ బుష్పిత హేమభూజముల్. 26

ఉ. గుంపులు గట్టి గంధతరు కోటరసీమలువట్టి సౌరభం
బింపెనయంగ దొట్టి భుజగేంద్రరథస్థలి మెట్టిపేద్కఁదో
రంపురసాలశాఖలఁ దిరంబుగ డోలలుగట్టి భూమిపై
సొంపెసలారఁ బాలురులఁ జుట్టి చరించు సమీరమామనిన్. 27

చ. సొరిదిని నూటయొక్కగతిఁ జుట్టి వియన్నది చెంతవట్టి భో
జ్యరతిమృణాళజాలములు చక్కఁగఁ దున్కలు గొట్టి పొట్టల
న్నురువడిఁ బెట్టి వీచికల నోలలు గట్టి సరోవరంబులం
బరువులు వెట్టి హంసములు భాసురలీల నటించునామనిన్. 28

గీ. అంగభవుఁడేయు నిందీవరాంబకములు
చన్నుఁగవ దొట్టుటయుఁ బాంథసతివిధమున
మహితకోమల దళఖాద్యమత్తపైక
కలితమైనట్టి చూతమక్కానఁబొలిచె. 29

సీ. బహుకేతకీనవ పల్లవంబులు దినఁ
బోయి కో కో యనిపోవు కొన్ని
తత్సుమాంచిత మధుద్రవ మారగించంగఁ
బోయి జుంజుమ్మని పోవుకొన్ని
తత్ఫలాపేక్ష చేతను నందుఁ జేరంగఁ
బోయి రామాయని పోవుకొన్ని
తద్దీర్ఘ పత్రగంధవహాశనుల మెక్కఁ
బోయి కేకాయని పోవుకొన్ని

గీ. మత్తకోకిల మధుకర మదనహయ మ
యూరములు సంభ్రమత సహకారసరసి
జాత సద్బింబికాసర్ప సహజభుక్తిఁ
జెంది వర్తించు నవ్వనసీమయందు. 30

సీ. చెలువైన పన్నీటి చిఱుచెమ్మటలు గ్రమ్మఁ
గనకాంబరపు రంగులెనయుచుండ
గండుతేఁటిమిటారి కలికి చూపులు వ్రాలఁ
గమ్మ పువ్వులతావిఘుమ్ము రనఁగ
బింబికాధరరుచి పెంపు వే తూలంగ
రహిఁ జిల్కపల్కుల రవముసడలఁ
దీరైన కస్తూరి తిలకంబు చెదరంగఁ
గడుమంజరీస్తన గంధమురులఁ

గీ. జారుతరకుందమౌక్తిక సరులుచింద
ఘనలతోరు భుజోప గూహన మెసంగ
వనరమాపల్లవాధరి ననకటారి
దొర దుర మొనర్చె మాధవ వరునిఁగూడి. 31

సీ. ఘననికుంజము కేళి కామందిరముగాఁగ
వాలుఁగొమ్మలు కిటికీలుగాఁగఁ
జెలువంపుఁ దలిరుటాకులగుంపు పాన్పుగాఁ
బరువంపు విరులు చప్పరము గాఁగఁ
దెలిమొగ్గగములు ముత్తియపుజాలరులుగా
భసలంబులగరుధూపములు గాఁగ
మెఱుఁగారు దళములు మించుటద్దములుగా
వలపుఁ బుప్పొడిగందపొడియుఁగాఁగఁ

గీ. గోకిలమయూరశారికా కూజితంబు
మణితశబ్దంబుగా లతల్ మగువపిండు
గాఁగనొప్పారి వనరమాకాంతయపుడు
వివిధరీతులఁ జెలఁగె మాధవునిఁగూడి. 32

క. అట్టివసంతపు వేళం
బుట్టిన మోహాంధకారమున మోహన దా
నిట్టట్టుఁ దెలియనేరక
దట్టపు మరువెట్టమనము దల్లడపెట్టన్. 33

క. కనకలతాకలకంఠీ
కనకాంగులఁ గన్నొఱంగి క్రన్నన నిజకా
ననవాటిఁ జేరి మోహన
ననవిల్తుని గాఢ మోహనవికారమునన్.

సీ. కమనీయ తనునవ్య కనకసుగంధంబు
గండుఁదేఁటుల మనోగర్వముడుప
సురుచిరతరవక్త్ర ఖరగంధవాహంబు
పుష్ప గుచ్ఛ చ్ఛాయ పొంకమణఁపఁ
జటుల తాపస్వేదజలకణా సారంబు
రాయంచకొదమలఁ బాయనొత్తె
దశన వాసోరుణో ద్యత్ప్రభాపటలంబు
కువలయంబుల కాంతిఁగొల్లలాడఁ

గీ. గమ్ర కంకణ మంజీర కాంచికాని
బద్ధఘంటా నినాదంబు బర్హికీర
శారి కలకంఠ కులములఁ బాఱఁదోలఁ
జేయుచు నెలంత వనవీథిఁ జేరెనంత.

**- మోహన విరహవేదనచే వనంబున కేఁగుట -**

సీ. మందానిలోద్ధూత మహితోప వన నవ్య
కర్పూరరజముపైఁ గలయనలఁదు
ఘనకంట కారణ్య గమనశ్రమాంబువుల్
కడురక్తిఁ బన్నీటఁగడగఁదివురు
విరహ భారానల వేదనఁదనుపల్లి
కలఁగఁగెందమ్మి క్రేగంట నద్దు
మలయాచలేంద్ర శీతల వాతపోతమ్ము
లొలయ నిట్టూర్పులు వెలపఁదనరుఁ

గీ. గలిత కలకంఠకులనీల కంఠకంఠ
కలరవం బాలకించును గర్ణయుగళిఁ
బంచశరధూత సంభూత పంచకములఁ
దత్తదుచితస్థలంబులఁ దార్చుకరణి.

క. ఇక్కరణి బాలికామణి
యక్కాసన సీమయందు నలసి సొలసి పెం
పెక్కెడు పున్నాగముకడఁ
జక్కనఁ గూర్చుండి యున్న సమయమునందున్. 37

అంత నెలంత లమ్మణి గుహాంతర మందుఁగనంగలేక య
త్యంత విషాదమంది శబరాంబుజపత్ర విశాలనేత్రి యే
చెంతకు నేఁగెనోయని వచించుచుఁగేళివనాంతవీధి న
క్కాంతలువోయి కాంచిరి చొకారపుటన్నులమిన్న నొక్కెడన్. 38

క. కనుఁగొని కలకంఠీముఖ
కనకాంగులు జాలినొంది కటకటఁ బడియో
వనితామణి వనితావనిఁ
జనుదెంతురె యింతులొంటి సాహసవృత్తిన్. 39

గీ. కొమ్మలకునింత బిగి దగదమ్మముద్ద
రాలవు గదమ్మ లేవమ్మ రాఁగదమ్మ
కమ్మ విలుకాని యమ్ముల కుమ్మలించి
మమ్ము దిగనాడి యేఁగుటర్హమ్మటమ్మ. 40

క. అనిబహువిధ భాషణముల
వనజాక్షులనూనయింప వారనితాపం
బున నన్నుమిన్న క్రన్నన
ననవింటి వజీరు ధాటి నాటిన కతనన్. 41

సీ. సంహికేయ భుజంగ సంహారి చంక్రాంక
భానువంశ ప్రదీ పా యటుంచుఁ
జండికా హృదయేశ చాప దండ విఖండ
ఘనసాంక వామోద గాత్రయనుచుఁ
గాంచనశైల సంకాశ ధైర్యవరేణ్య
భద్ర భూధర దివ్య భవనయనుచు
దైత్యపంక నిదాఘ తపనకోటి విలాస
రావణాటోప విరామయనుచు

గీ. నులికి భ్రమం జెంది పలుకునచ్చెలి కరోక్తి
లపన గళములుగాంచి హల్లకశుకాబ్జ
పికములం‌దలంచి చంద్ర దర్పకమిళింద
మధులు తనచూడ్కిం‌గట్టిన మహిమ దోంప. 42

క. ఆ రామామణు లంతట
నారామద్రుమవిలాస మభివర్ణింపన్
గారామునం గైదండిడి
యారామకుం దెల్పం‌దొడంగి రద్భుతభంగిన్. 43

సీ. పున్నాగ మిదినీల పున్నాగరోమాళి
కాంచనంబిది లసత్కాంచనాంగి
మందార మిది దివ్య మందారసుమగంధి
మధుమహీరుహ మిది మధురభాషి
ఘనసారమిది ఘనాఘనసారనిభవేణి
కమలాకుజంబిది కమలచరణ
సారంగమిది మత్త సారంగ గామిని
చంద్ర భూజంబిది చంద్రవదన

ఆ. మదన పాదపమిది మదన సమ్మోహిని
సరళధరణిజమిది సరళహృదయ
గజమహీరుహమిది గజకుంభవక్షోజ
యని యెఱుంగంబల్కి రబ్జముఖులు. 44

సీ. సరసిలోం‌గ్రీడించెం జక్రవాకస్తని
యటుబోకుమీ వినీలాహిరోమ
మాకందములం జేరె మహితకోకిలవాణి
యటుబోకుమీ పల్లవాంచితాంఘ్రి
విరితోంటనాడె బంభరమేచక శిరోజ
యటుబోకుమీ నవీనాబ్జగంధి
సురసాలమంటెం గుంజర రాజనిభయాన
యటుబోకుమీ సురంభాయతోరు

గీ. యుగళవని నగెఁ గలకంఠి మగువయుకతె
రాజవదన త్రిలోకాభిరామ హేమ
నాశికాంకుశ రేఖావిలాస పాణి
కాదు పోవచ్చు ననిపల్కె మోదమెసఁగ. 45

మ. వనజాతేక్షణ చూచితే పికము నీభాషామృతవ్యాప్తి పెం
పెనయంబూని మితోక్తియై నెగడి గేహేచ్ఛల్ దిగంద్రోచి స
ద్వన సంచారమునొంది ఘోరమునియై వర్తింపనెట్లబ్బెడిన్
ఘనవాక్యగ్రహణార్థ కల్పన వివేకంబుల్ ఫలాశాలికిన్. 46

గీ. మహిత గోమేధికపుఁగాంతి మధురసంబ
టంచుఁ జనిత్రాలు నళిఁగంటె మించుబోఁడి
రహివసంతుని చీనాంబరంపుఁ దొగరు
తళుకుఁ బెట్టియ లోహంపు దాళమనఁగ. 47

గీ. ఆగమాంతప్రవర్తియై యాత్మ దివ్య
చక్షు లరయుచు నంతర శాఖవేలు
రాజ శుకయోగిఁ జూచితే రాజవదన
ఫలవిఫలకారికబ్బునే భాగ్యగరిమ. 48

క. తుమ్మెద చెలిగాఁ గొండొక
తుమ్మెద చెలిఁ గూడెఁ జూడఁ దొయ్యలిగన ని
క్కమ్ముగఁ దియ్యనయగు బల్
గొమ్మల వర్తింప మారు గుణములుగావే. 49

చ. సరసఫలోప భంగనిజచంచు గళద్రసమన్న కమ్మయు
త్తరువొగిఁ దాల్చియున్ వనధి దాఁటి శుకార్యుఁడు దెచ్చి యిచ్చినన్
మరుదవనీశ్వరుండు గొని మారుసువర్ణసుమంబు లిచ్చెనో
కరమనురక్తి నన్నగతిఁ గాంతకనుంగొను పూలు రాలెడిన్. 50

ఉ. దారుపు లేర్చి మానవు లుదగ్రతఁబేర్చి హసంతులందు నం
గారములన్ దహించి హిమకాలముఁ బుచ్చి తదీయ శేషముం
బాఱఁగ వైవఁ జైత్రమునఁ బ్రాణసమీరములంటిమ్రాకులం
దారెననంగఁ దుమ్మెదలు దాఁటుచుఁగేరెడుఁజూచితే సఖీ. 51

సీ. తిలకంబుఁ గనియె మంజులవాణి యొక్కర్తు
కనకంబు నెదిరించెఁ గలికి యోర్తు
కేసరంబుమధించెఁ గీరవాణి యొకర్తు
పొన్నగున్ననునవ్వెఁ బొలఁతి యోర్తు
సురసాలమడఁచె బంభరవేణి యొక్కర్తు
కర్ణికారముఁ బల్కెఁగాంత యోర్తు
కంకేళిఁదన్నె చొక్కపుమిటారి యొకర్తు
సురపొన్న నంటె సుందరియొకర్తు

గీ. క్రోవి ననలంబుఁ జిలికించెఁ గొమ్మయోర్తు;
అలఘు ప్రేంఖణమునఁ బాడె నబల యోర్తు;
ఇంద్ర భూజముకడ నూర్చె నింతియోర్తు;
ఇట్లు దోహదములఁజేసి రిందుముఖులు. 52

క. వనితా లలామలీగతి
వనితామణికపుడు చారువన విభవము నొ
య్యనఁదెల్పి పుష్పహరణం
బున కుద్యోగించి చిత్తముల ముద మొదవన్. 53

సీ. అంబుజాంబకుని ముత్యపుటిండులని మల్లె
తోరంపు టీరముల్ దూఱితూఱి
పచ్చవిల్తుని పచ్చ రచ్చపట్లనిగుజ్జు
మావిజొంపంబుల మసలిమసలి
కమలాతనూజు చెంగావిడేరాలని
కింశుకంబులపొంతఁ గేరికేరి
శుకహయోత్తంసు నేనికగున్న లనఁబొన్న
పొదరిండ్లలోపలఁ బొంచిపొంచి

గీ. కంతుశుద్ధాంత భాండ నికాయములని
కాంచననికుంజ వాటికల్ గాంచికాంచి
సరసమంజులమధుర వాక్చతురలగుచుఁ
జెలులు పుష్పాపచయ కేళి సలిపిరపుడు. 54

గీ. గుజ్జులేమావి నేరేడుఁ గూడియున్న
భాసురంబైన నవజాంబు వంబుఁజూచి
కోకిల శిరంబుఁగనుఁగొని కువలయాక్షి
ద్రుంపఁబోనది కేలివురంచుఁగొలికె. 55

సీ. చెలువంపు లే మావి చివురుటాకులు మేయు
కలకంఠ కులకంఠ కలకలంబు
సురుచిర మల్లికాసుమ మరందంబాను
భాస్వ దిందిందిరనిస్వనంబుఁ
బరిపక్వమగు బింబఫలరసావళిఁగ్రోలు
కలికిరాచిలుకల కిలకిలంబుఁ
గడిదేరి పెనుపాపకవణంబుఁ గడుమెక్కు
ఘననీలకంఠ కేకారవంబుఁ

గీ. జందనాచల సంచాత మందపవన
గళిత కర్పూర కదళికా దళపరాగ
సౌరభాక్రాంతమగు భవచ్చారు కేళి
వనము నందెంత చిత్రమో కనులతాంగి 56

గీ. ఘనరసాల కింశుకములు గలసియున్న
చారు పాలాశముకుళంబు మాఱుగాఁగ
రా చిలుక ముక్కుపైఁ గేలు రమణిబఱప
నది కరాంగుళి మణి ఫలంబనుచుఁగొలికె. 57

ఉ. కాంచనగంధి యొర్తు సహకార మహీరుహపల్లవంబు పే
ద్రెంచి పరీక్షఁజేసి జగతింబడపైచె మృదుత్వవైభవో
దంచిత మౌనిజోజ్జ్వల కరాభతనొందు నటంచులీల జో
డించియు సాటిఁబోలమిని డెందమునన్ నిరసించెనోయనన్. 58

మ. అతివల్ కాననపాళి దోహద మతి వ్యాస క్తిమైఁ జేయఁగా
నతసీపాదపజాతకోరక నికాయంబొప్పెడిం బ్రోడచం
చితహస్తాంచిత వల్లకీలతల ప్రాచీనోక్తి వైచిత్ర్య ప
ద్ధతిఁ బల్కించు వరాళికిన్ దిగుసముద్యద్భృంగ జాలంబనన్. 59

మ. జలజాతాక్షి నిరీక్షసేయుమదిగో చంచత్తమాల ద్రుమో
జ్జ్వలకుంజస్థలిఁబొల్చు పాటలగుళుచ్ఛంబుల్ భవచ్చారు వృ
త్తలసత్పీన పయోధరోన్నతి నిజాత్మంగాంచియుం దత్ప్రభా
వళికిందూలి రథాంగముల్ జని తమిన్ వర్తించెనో నాఁగడున్. 60

ఉ. ఈకరణిన్ విలోలగతి నింపలరందలి రాకు బొండ్లు నా
నాకుసుమాళిసంయుతవనస్థలిఁ గేళియొనర్చి మంజుల
శ్రీకర వాక్యమత్కృతులు జెన్నలరారఁగఁ జూచు వేడ్కమై
నాకమలాప్తుఁడుత్కలిక నంబరమధ్యమునందునిల్చినన్. 61

గీ. అబలలీరీతిఁ బుష్పాపహరణ కేళిఁ
దేలి మధ్యందినాతపదీప్తి నలసి
సొలసి వడదాఁకి చందనాచలసమీర
మిళిత శీతల జలకేళి సలుప నలరి. 62

## మోహన చెలికత్తెలతో జలకేళిసల్పుట

సీ. భాసురసంపుల్ల పంకేరుహానన
రమణీయరాజమరాళగమన
మదరథాంగపతంగ మహితవక్షో జాత
వరమధుమాధుర్య వాక్సమేత
నిరుపమానవిశేష నీలోత్పలామోద
కోమలాయత బాల కూర్మపాద
ఘనతరాభంగభంగ త్రయీవళి భాస
కమనీయ సతనాభికావిలాస

గీ. భద్ర హల్లక పాణి శైవాలవేణి
భసలలోచన బిసభుజావల్లియగుచు
బాలగతినొప్పు నొక సరసీలలామ
నెదుటఁబొడగాంచిరందు రాకేందుముఖులు. 63

ఆ. సరసింనాడఁగోరి శంపాలతాంగులు
సురభి కుసుమ గంధ పరికరములు
చారుమృదుల పర్ణ సంపుటంబులఁజుట్టి
భద్రగతుల మీఱి బంతిఁగట్టి 64

సీ. మల్లెపూపొదరిండ్ల మాటునన్ జనెనొక్క
కలకంఠి తనువల్లి కందకుండఁ
జిగురాకుఁ గొమ్మచాటుగఁజేసె నొకలేమ
చెక్కుటద్దము లెండఁ జిటిలకుండ
ననదేసెవాఁక పజ్జనుదారె నొకబాల
చరణాబ్జములు వెట్టఁ బొరయకుండఁ
జారుగంధ ద్రుమచ్ఛాయలఁ జనెనొక్క
మగువ తృష్ణావ్యధ నొగలకుండ

గీ. విమల శశికాంత సోపాన వీధినలరు
సారకర్పూర సహకార సరళనారి
కేళపున్నాగ పూగ వనాళిసహిత
సరసి నంభోవిహారంబు సలుపఁగోరి. 65

సీ. పాకాంతకస్వర్గ పట్టణంబును బోలె
ఘనతరామృత రసోత్కలిత మగుచు
ధననాయకుని నిజాంతఃపురంబును బోలె
వరపద్మశంఖ సంభరితమగుచు
రమణీయతర పుష్కరస్థలంబునుబోలె
రాజహంసప్రభా రమ్యమగుచు
భారతీమృదుపాణి పల్లవంబునుబోలె
పటుతరకచ్ఛపీ భాసమగుచు

గీ. గగన కేశుని కైలాస నగముఁబోలె
భద్ర భృంగీవినాయక ప్రకటమగున
టంచు మదినెంచి చెంచురామించు బోండ్లు
సారకాసారతీరంబుఁ జేరిరంత. 66

ఉ. చారుసరోవిహారములుసల్పి రతీశ్వరుఁ బూజసేయఁగ
న్నారఁగఁగందు మింకనియనర్ఘమణి స్థగితైకభూష లి
చ్చారతినూడ్చి చెంగలువచాయ నిగారపు జిల్కుపాపడల్
వారకగట్టి శృంగములు వట్టి సరస్తటిముట్టి దిట్టతన్. 67

ఉ. అంబుజగంధు లిందుమణిహాటక హృద్యములైనమెట్ల నె
య్యంబుగ నట్లడిగ్గ విమలాంబువులందుఁ బయోధరంబు లం
దంబుగఁదోఁప మేల్పసిఁడి తామర మొగ్గలటంచుఁ గోయఁబో
వం బరిహాస కేళినగెఁ బ్రౌఢసతీమణియోర్తు చెంగటన్. 68

చ. చెలియలు బంతిగట్టుకొని చిమ్మనగ్రోవులు కేలఁబూని యు
జ్జ్వలపట జంఘజానుయుగసక్తి నితంబవలగ్ననాభికా
కలితపయోధరాంస భుజకంధరదఘ్నముగాఁగఁగేళి ని
ర్మలసరసీజలంబుల సమంచిత వైఖరి డిగ్గిలోలతన్. 69

క. లలితంబగు దోయిళ్ళను
జలములపై కెగురఁజిమ్ముజాడ నుతింపం
గలశాబ్ధిఁ జంద్రుపొడుపున
విలసిత కల్లోలసమితి విన్నంటుగతిన్. 70

క. అన్నుల కుచగిరి నిహతుల
భిన్నాభిన్నోర్మియగుచు భీకరవృత్తిం
గన్నిట్టఁ జేసెఁ గొలనఁ
జెన్నగు రక్తాంబుజములు శీఘ్రతవిరిసెన్. 71

ఉ. కప్పురగంధులొక్కమొగిఁ గాంచన పంకజరాగనాళముల్
దప్పకబూని యొండొరులఁదార్కొని నిద్దపు మోము దమ్ములం
దప్పఁలుగుప్పుచున్ మధువు లానెడు తేఁటుల రొప్పుచున్ సిరుల్
జిప్పిలు చారుపద్మములుచే నెడలింపుచు నోలలాడుచున్. 72

సీ. వనజాయతాక్షి బంభరకులాలికకుల్కి
కాంచన సుమనాసకడఁ జెలంగెఁ
గిసలాంఘ్రి మత్తకోకిలకంఠికిఁ దొలంగి
శ్రీరామతనువల్లి చెంతఁజేరెఁ

బరిపక్వబింబికాధరి శుకోక్తికినోడి
పాంకవగంధి పజ్జనువసించె
ఖగసన్నిభాషి చక్రపయోధరికిఁదూలి
చంద్రికానిభహాస సరసనిలిచెఁ

గీ. గలితకర్పూర కస్తూరికాసుగంధ
కుంకుమాగురు హారిద్రపంకలిప్త
చారుతర దేహసారభాంచద్విలోల
కేళికాసార జలకేళిఁ దేలునపుడు. 73

క. క్రొన్నన విల్తునియేనిక
గున్నలవలె జలములందు గుభులుగుభులటం
చన్నెలఁత లోలలాడిరి
విన్నేట నిలింపసతుల విధముందోఁపన్ 74

శా. ఆలీలావతు లోలలాడిరి మనోహ్లాదంబుగా నీరముల్
గేలంజిమ్మి తటాలునన్ మునిఁగి శుక్తివ్రాతముల్ డుల్చి ము
త్యాలింపారఁగ కంకణావళుల నొయ్యంగూర్చి శృంగంబులన్
వాలాయంబుగఁదార్చి యొండొరులపై పైనిండఁజిల్కించుచున్. 75

సీ. శశిముఖీ కుచకుంభ సారకుంకుమగంధ
మిళదంబుసిక్తయై మెరసెనొకతె
బాలికాకరముక్త పద్మ కైరవరజః
పటలప్రయుక్తయై పరగెనొకతె
లలనాజనార్పితోజ్జ్వలనల స్థితమనో
హరగాత్రవల్లియై యలరెనొకతె
కాంచనసుమనాసికా సమాహితనీల
కుముదప్రకాశయై యమరెనొకతె

గీ. కాంతలెల్లరు సంభ్రమాక్రాంతలై స
రోంతరాళ మరాళ మదాళిజాల
బాలసారసవాచా విశాలవిభవ
మలరఁ గనుఁగొంచు దరిఁజేరిరంతనంత. 76

క. పులుగడిగిన ననవిల్తుని
ములుకులవలె జలములాడి ముకు రాస్యలు చెం
గలువ కొలంకును వెడలిరి
జలధిఁ బొడమునప్సరసల చందము దోఁపన్. 77

మ. వరవక్షోరుహ చక్రముల్ నొగల భాస్వద్వేణికా మత్తబం
భరముల్ దూలవళిత్ర యోర్మ్ములురులన్ వక్త్రాబ్జ శోభాపరం
పరలుంగంద సరోవరంబలరె నప్పద్మాక్షు లేతేరఁగా
సురతాంతస్థితి వారసుందరిగతిం జూపట్టి చిత్రంబుగన్. 78

గీ. రాజబింబాస్య లార్ద్రాంబరములు విడిచి
వలపు చెంగల్వకావిచెల్వాలుధరించి
తేజరిల్లిరి వాసంత దివసవేళఁ
గలయఁబూసిన కింశుకంబుల విధమున. 79

చ. జలరుహగంధి కచ్చెలులు చక్కఁగఁ బెన్నెరులందడార్చి యు
జ్జ్వలసుమగుచ్ఛముల్ దురిమి చారుమణీమయ దివ్యభూషణా
వళులు ఘటించి గంధముజవాదిమృగీమద కర్దమంబుమైఁ
గలయ నలంది ఫాలఫలకంబునఁ దిల్కముఁ దీర్చిరింపుగ॥80

సీ. బహుల పల్లవ ఖాద్య పరభృతవ్రాతంబు
భవ్యనీలగవాక్షి పాళిఁదెలుప
లలితపత్రశ్రేణికలఁ జారుననదేసె
యంత్రధారాధారి యవుసుఁబెనుప
ఫలరసంబాను జిల్కల కల్కి పల్కులు
కలిత విద్యాప్రసంగంబు నెరపఁ
జారు దీర్ఘ విశాల శాఖాకలాపంబు
కల్యాణగేహ వైఖరి నెసంగ

గీ. భసల జాలంబు లగరు ధూపములు గాఁగ
విహగనాదంబు సంగీతవిధము దోఁపఁ
జైత్రుఁడోలగ ముండు నాస్థాన మనఁగఁ
బరఁగు నొక బాలసహకార పాదపంబు. 81

శా. ఆనానవృతి మూలభాగమున రమ్యంబొప్ప గొజ్జంగిలేఁ
బూవున్నీట నెదించి కూర్చు నవకర్పూరపు బల్లిన్నిపైఁ
బూవుంబామమమర్చి యందు సిత సం ఫుల్లాక్షి మధ్యస్థలిన్
శ్రీ పత్త్రాంకజ కమ్మకస్తురి నొగింబిత్రించి చిత్రంబుగన్ 82

చ. తిరముగ నామపీఠి నిరతీరమణన్ మధు మంత్రి ముంగిటన్
పరనమ బ్రగ్గడై నెగడు చంద్రుని జాల్మతి నారు నంబుపై
మెఱసెడు చిల్క వెంగట నమేయ ఖటోత్తములైన శారికా
మరు దలికేళికిహంసపిక మండలి నిల్చిరి మట్టువారఁగన్. 83

క. ఈ కరణి భక్తిఁ గలుగఁగ
నాకమలాస్త్రునకు మంగళాచార విధుల్
ప్రాకటముగాఁగ నొనరిచి
రాకేందు నిభాస్యంపుడు రమ్యోక్తుంతోన్. 84

సీ. ధ్యానంబు త్రిజగ దంతర్యామితనయున
కావాహనము లతాంతాయుధునకు
నమలార్ఘ్యమంబుజాతాక్ష నందనునకుఁ
బాద్యంబు పికబర్హి పరివృతునకు
నభిషేకమంభోరు హాంయాత్మజునకుఁ
బుష్పాంజలులు జగన్మోహనునకుఁ
జందనంబిందిరా సుందరీ సూతికి
ధూపంబు పుండ్రేక్షు చాపునకును

గీ. దీపమలం కమ్మకరువలి తేరు దొరకు
మధుఫల రసోపహారంబు మధుసఖునకు
మహిత కర్పూర వీటి యామదనమూర్తి
కంచు నప్పంచశాఖు లర్పించిరపుడు. 85

గీ. మదన మన్మథ మధుసఖ మనసిజాత
మధువిదారికుమారక మధుకరగుణ
మలయపవమాన రథ మా రమాతనూజ
మకర కేతన యనుచు నమస్కరించి 86

చ. నలినభవుండు సర్వభువనంబులు గెల్వుమటంచువీకు న
మ్ములనయిదెంచి యిచ్చినసముద్ధతిచే జగదేకవిక్రమో
జ్జ్వలుఁడవుగాన మూఁడిఁట ధ్రువంబుగ ముజ్జగముల్ జయించు న
త్యలఘుబలుండవీవు కుసుమాయుధ మాకునుతింపశక్యమే. 87

గీ. ధర్మగుణములు బూని మాధవహితోక్తి
చేఁజెలంగుచు ద్విజరాజ సేవఁగాంచి
ఘనశుకాలాప మాధుర్య కలనఁబొదలు
నట్టిమేటివి నిన్నుఁగొల్తు మంబుజాస్త్ర. 88

ఉ. సింగిణి వింటనీవునలిసింజినిఁగూర్చి సుమాంబకంబులే
యంగమకించుమాత్ర చతురానన శంకర చక్రపాణు లా
త్మంగడు నుర్కి శారద సుమంగమలా రమణిన్ సతంబు నా
లింగితులై నిజాంగముల లీలధరించిరి నేర్పుమీఱఁగన్. 89

ఉ. అంబుచరాంక దివ్యకుసుమాయుధ మాచెలినెంచిమాడు న
వ్యాంబుజగంధి నీలకుముదాక్షి వనప్రియ కంఠకంఠి రో
లంబు సముజ్జ్వ లాలక కళానిధి బింబసమంచితాస్య వి
క్రాంబుగఁబ్రోవుమంచుఁ గలకంఠిముఖాంగనలిట్లు వేడఁగన్. 90

సీ. చిలుక సామ్రాణి తేజీ తేరిపై నెక్కి
పుండ్రేక్షు కోదండమును జెలంగ
మధుకర శింజినీ మహిమ బెన్నారంగఁ
గలువ కెందమ్మి ముల్కులు వెలుంగ
వర వసంతామాత్య వర్గంబులేతేర
బర్హికోకిల శారి భటులుగొలువఁ
గవగూడి రాజహంస వతంసలొప్పార
దండపుష్కర చర ధ్వజముగ్రాల

గీ. సరస ద్విజరాజమంత్ర నిస్వనముఁజెలఁగ
దండు వెడలె సముద్దండ చండరుక్తి
దండిమై పాంథజన వైరిమండలంబు
గండడఁపఁ గంతుభూతలా ఖండలుండు. 91

చం. చిగురుకటారిజోదు బలుసింగిణి వింటిమెఱుంగు వాఁడిలేఁ
దొగవిరిముల్కులంత మెయిఁదూఱఁగనించి పిసాళితమ్మి క్రొం
జిగిబిగి మొగ్గ సోఁగ వలిసిబ్బెపు గుబ్బలు బాఱఁజిమ్మి గే
దఁగి నునురేకు బాకున నెదందగఁ గ్రుచ్చి లతాంగి నొంచినన్. 92

సీ. కడురంతు సేయుచుఁ గదిసి వసంతుండు
విరజాజి పూఁబోఁడి పరువముడిపె
వేఁడివెన్నెలవిగ్గు పెదజల్లి రేతేఁడు
పంకేరుహానన పసహరించెఁ
గిలకిలలాడు రాచిలుకల తండంబు
బింబికాధరి నిగారంబడంచెఁ
గండ్లెల్లఁజేయుచు గండుకోయిలగుంపు
కిసలాంఘ్రినవకంపు మిసిమిఁజెఱచెఁ

గీ. జటుల కలకలరోష నిస్వనములువిలియ
మలయ పవమాన మధుపాయి మదమయూర
కలరవ మరాళ శారికా కులములెలమి
మంజుభాషిణి జంకించి మసలెనపుడు. 93

ఉ. ఈకరణిన్ లతాంతశరుఁడిందు నిభాననగాసిసేయఁ జే
కాకుమజెంది మైమఱచి కంపమునొంది కడంకఁ దూలి యు
ద్రేకము మావి భూమిపయిఁ ద్రెళ్ళెవనస్థలిమత్త భీకరా
నేకప మండలేశ కరనీత భుజంగమవల్లి కైవడిన్. 94

ఉ. అయ్యెడఁ దత్సఖీమణులు హాయనిపాయని వేడ్కఁజెంచురా
తొయ్యలిచెంతఁ జేరి వగతోమనమేగతి బుజ్జగింతు మే
దయ్యము వేడుకొంద, ముచితస్థితులేగతిఁ జేయువారమే
దియ్యలివేణి కేర్పరుప మేమిటలగ్గగు నంచునెంచుచున్. 95

సీ. గమన కుంజరభయశ్రమ నొందునాభికా
వనజాతమునఁ జంద్రమునుపరాదు
వక్షోజచక్ర సాధ్వసి నీలరోమాహి
యందు సుగంధంబులంద రాదు

విరహభారానల పరితప్తకుచకుంభ
　　　　ములఁ బటీరంబునుఁ జిలుకరాదు
నాసికాకనక ఖిన్నవిలోల సారంగ
　　　　ములపైని గేసరుల్ మొనపరాదు

గీ. కలికికనమాన బాణనిర్ఘాత జాత
గాఢనిశ్వాస పవనశుష్క ప్రతీక
గురుతరాంచిత భండీర కుసుమపటలి
నంతనగ్ని శిఖాప్రజంబులమరాదు. 96

మ. అళిసంఘంబునకున్ సదాకనక సామ్యత్వంబుఁ జూడంగ లే
దలచెందమ్ములకుం ద మోవిభవ భవ్యంబెన్నఁగారాదు వి
ద్యాలకున్ సాంకనమోద మిత్రతయునంగాఁ జోలదిమ్మదివిన్
బలిభిత్పూతునకున్ వృషధ్వజ హితోపాయంబులేదెంతయున్. 97

సీ. మమబాష్పనందుఁ జేర్చిన కెందలిరుగుంపు
　　　　చెలువంపు మైకాఁక మలియఁబాతెఁ
గమనీయ మల్లికా సుమతాళవృంతంబు
　　　　గాఢనిశ్వాసాగ్నిఁ గందఁబాతెఁ
బాలిండ్లఁజేర్చిన పద్మపత్రశ్రేణి
　　　　శ్రమవారి కణములఁ గములఁబాతెఁ
గంతపీఠి ఘటించు కర్పూరఁబేరులు
　　　　పెడవిల్తు మెవ్వెట్ట సడలఁబాతె

గీ. సంతకంతకు దశలగ్గమై చెలంత
కన్నుదోయి కహర్నిశల్ కంధిశయను
దివ్యమంగళరూపంబె భవ్యలీలఁ
గానవయ్యె సమస్తది గ్వలయమునను. 98

క. లలనామణులప్పుడు చం
చల నేత్రికి శీతలోపచారము లెలమిన్
పలుసఁ దొడంగిరి ఘనశై
వలకిసలయ బిసపటీర ఘనజంబులచేన్. 99

సీ. వేఁడివెన్నెల కాఁక వాడనితమ్ములుఁ
గరికరంబానని యరటిపారలుఁ
గోకిలల్ ముట్టని గుజ్జుమావిచిగుళ్ళు
గొనబురాయంచలందని బిసములుఁ
దుమ్మెదల్ వ్రాలని కమ్మపూగుత్తులు
నెండఁగన్నెఱుఁగనియట్టి దొగలుఁ
బన్నిటమెదిపిన పచ్చగంబూరంబు
జలువలు పెదజల్లు మలయజంబు

గీ. లలఘుపదముల నూరుల నలకరముల
బాహుల సురోభవంబుల వాలుఁగనులఁ
గర్ణపుటములఁ దనువల్లిఁ గలయనింపి
చెలులు శిశిరోపచారంబుఁ జేసిరెలమి. 100

చ. జలరుహ గంధులీకరణిఁజల్పి వధూమణికిర్ ఖగేశ్వరా
చలవిభుఁగూర్పుమంచు సుమసాయకుఁగ్రమ్మఱి వేడిరర్ సుధో
జ్జ్వలవరదివ్యనామ శుభవర్ణములింపుగఁ గర్ణపాళి ని
మ్ములఁదగసోఁకఁ జేతనముఁబొంది కనుంగవ విచ్చి చూచిరర్. 101

క. వ్రీడావతిఁ దోడ్కొని య
క్క్రీడావనపాళి వెడలి కిసలయపాణుల్
వేడుక లలరఁగఁదెచ్చిరి
లీలామణి గేహమున కలేఖ్యప్రౌఢిన్. 102

మ. ధరధారిన్ వరియింపఁగోరు సతికందర్పుండు బాణాగ్ని దే
హరుచుల్ గందఁగఁజేయ దక్షిణవిశాలాక్షంబు దానోట యా
పరసీబాంధవుఁడప్పుడొప్పె దివిచంచద్రక్త భానుండునై
యరిగెల్వంజనె నో యనం జరమ శైలాగ్రప్రదేశంబునన్. 103

గీ. మిహిరమండలమపరాద్రిమీఁద వెలిఁగె
బంధు జీవగుళుచ్ఛంబు పగిదిఁ దసరి
సమయగాయక కక్షదేశమున నమరు
కమలరాగంపు కిన్నర కాయఁబోలె. 104

ఆ. గగన సింధురంబు గడcగి పూర్వాగ్రావ
సరసిలోని రక్త జలరుహంబు
హస్తమునc బెకల్చి యపరాబ్ధిలోc బాఱ
వైచె ననcగc గ్రుంకె భాస్కరుండు. 105

సీ. వనమహీ స్థల నటద్ఘనమృగాళి పిపాస
నద్రి ఝరీ శంకనంటc దివురు
విటచేటికల్ పురీవిపణిశోణాంశుక
జాలవిక్రయ శంకc జనcదలంచుc
వరతమాలనికుంజ వాటిప్రసుప్తైక
సైరిభాలిదవాగ్ని శంకcబఱచు
మద పికవ్రాతంబు మాకంద భూజాగ్ర
జాత పల్లవ భోజ్య శంక డాయుc

గీ. జరమదిగ్వారకామిని సమయవిటుని
మీcద పెదcజల్లునట్టి కాశ్మీర చూర్ణ
శంక జనులెన్నcగా నస్త శైల శిఖర
మందు వెలుcగొందె సాంద్రరక్తాతపములు. 106

క. సోముcడు రాజై రాcగాc
దామరలు భయంబునొంది తడబడునని యా
ధామ నిధిరాకc దెల్పెడి
భామినులో నాcగవెనుక బాతెన్ నీడల్. 107

సీ. కమలబాంధవ సమాగత వేళ వారుణిc
బట్టు నీరాజన ప్రభలనంగc
బాంధ వధూజయ ప్రద్యుమ్నకృతరక్త
పటనికేతన విభాపటలమనcగ
నపరాద్రి శిఖర శుష్కారణ్య శాఖా వి
ఘర్షణోద్ధత దావకాంతు లనcగ
శశధరాగమన వాంఛాల సచ్ఛర్వరీ
కుచలిప్తకుంకుమ రుచియనంగc

గీ. గంధివల్లభ శుద్ధాంత కనకసౌధ
సంఘటిత పద్మరాగ విస్తారభద్ర
కుంభ సంఘాతకలితరుక్కోటి యనఁగ
మెండుకొని సాంధ్యరాగంబు మెఱసెనంత. 108

గీ. అ స్తగిరియను మదకుంజ రాననమున
సమయఘోర మృగేంద్రంబు సారసాప్త
కరనఖంబులఁ జీనుపఁ దశతజరక్త
దీప్తిఁ బొల్పారె ననసంధ్య తేజరిల్లె. 109

మ. రజనీనాథుఁడు రాసరోజములకుం బ్రాపించు ఖేదంబటం
చు జగద్బంధున కయ్యుదంత మెలమిన్ సూచించు చందంబునన్
నిజకాంతామణిఁబాసి చక్రముమదిం జింతించుచున్ సర్వస
ద్విజ సంఘంబుగనంగఁ గేకలిడుచున్ విన్నంటి వేగస్థలిన్. 110

సీ. పరిశోకతప్తయై పాఱుపతులఁగాంచి
శోధించి తనవిభుఁ జూడఁదివురుఁ
దివిరికానక నాల్గుదిక్కు లన్వేషించి
పరికించి యెల్గెత్తి పల్కు పల్కు
లాలకింపఁగఁ జెల్వుఁ డబ్జనంపుటమందు
నిలువకుండుట కశ్రుజలమునించు
నించు విల్వంచి చవ్వంచ ముల్కులదంట
రువ్వనమ్ముల కుండ రోయనంత

గీ. నంతకంతకుఁ జిందర లాడుసమయ
మందు జలమందు నిజబింబ మలరఁగాంచి
ధవుఁడనుచుఁ గ్రుంకి తెక్కలు దడియబ్రమసి
సొలసి వెతఁగుందు గడు నరస్థలి రథాంగి. 111

గీ. పతినిగానక వెతఁగుంది పద్మినీవ
ధూటి విరహానలంబుమై నాటిరాజి
మొనసి మిన్నంటసాగు క్రొంబొగలనంగ
వెడలె నళులంతఁ దద్గర్భ వివరమునను. 112

గీ. ప్రాక్ప్రసు రగేహవాటికి రాత్రికాంత
చనుతఱిం గాలమనుతండ్రి సారెతోడఁ
బ్రతిపుర గృహార్పణమ్ముగా రత్నరాజిఁ
బంపెనో నాఁగ దీపికాపటలమలరె. 113

మ. సరసీకాంతకు దూరదర్శనమునా ఛాయంగనోత్తంసకుం
బరివాదం బహరబ్జగంధికిఁ దనుప్రచ్ఛన్నభావంబునా
సరియే వీరని రవ్యపాయమునఁ బ్రాంచద్రక్తరుక్కాంత శం
బరజిద్వేదన నవ్యదీపకళికన్వర్తించె వీక్షించినన్. 114

సీ. సకలచరాచర క్షయకృత్కృతాంత కో
ద్దండదండచ్ఛాయ గండుమిగిలి
చండోగ్రమహిష రక్షఃప్రాణకబళ నో
ద్ధతిఁగాళి తను తళత్తళలఁదెగడి
సాంధ్య వేళానట చ్ఛశిధరాలికనేత్ర
భవధనంజయధూమపటలిమీఱి
వటపత్రశయన శుంభద్యోగనిద్రాన
మయవిజృంభిత జగన్మాయమించి

గీ. పాంథకాంతాకదంబ గర్వాంధహరణ
సంప్రయత్నమనోభవచాపముక్త
నీల కైరవబాణ రుక్పాళినెగడి
కటికచీఁకటి రోదసిఁగలయఁ బ్రాకె. 115

క. సమయోదంచిత మృగయుఁడు
కమలాహితపక్షిఁబట్టి ఖతలమునవెసం
దమస మనుజాలమిడి బి
య్యముఁ జల్లెననంగఁ దారలమరెందోడ్తోన్. 116

సీ. నెలరాక కలరు రేనెలఁత విన్వాన్పునా
వెదచల్లు మల్లెక్రొవ్విరు లనంగఁ
గేళికాసరసి నోలాడు శచీంద్రులు
జిమ్ము గ్రోవులనీటి చిదపలనఁగఁ

జదలేఁటఁ గ్రీడించు చౌదంతికెంగేల
నెగజిమ్ము వెలిదమ్మి మొగడలనఁగ
సమయబేహారి కంజభవాండగృహమునఁ
గలయనంపిన రసగుళికలనఁగ

గీ. మెండు కొనియంతఁ దండోపతండమగుచు
నిండె డిండీరకర్పూర పుండరీక
శారదాభ్రపటీర రుక్పటల మీఱి
నవ్యతారానికాయంబు నభమునందు. 117

మ. సురవర్త్మాటవిఁ జంద్రదీప్తి మధువుల్ జూపట్టఁగా నత్తఱిన్
హరిదుద్యత్కుజముల్ జిగిర్చి భసుమవ్యాకీర్ణమైనంద మో
భరభృంగాళిచెలంగఁ బ్రాక్కనక శుంభద్గంధమున్లోనదా
ట్టరహింబొల్పెసఁగెం బయోనిధులు దాఁటంబోవు
భీతాత్మతన్. 118

క. నెరిని సమయాభిసారిక
హరిదిగ్గృహవీధియందు నలరుచుపేడ్కం
గరయుగమునఁ గర్పూరము
వరునిపయిం జల్లెనన ధవళిమ దనర్చెన్. 119

## చంద్రోదయ వర్ణనము

గీ. మదనుఁడనురాజు పాంథుల మదమణంపఁ
గదలునవ్వేళ హరినీల కంఠమాల
వెండిపళ్ళెమునందిడి వెలయనిర్ప
ముంచెఁ బ్రాగ్దిశననఁ జంద్రుఁ డుదధిఁ దోఁచె. 120

సీ. బహుతమోమాతంగ పటుకుంభ నిర్భిన్న
సమయకేసరి గరాగ్రములనంగఁ
బద్మినీ సంచయప్రాణప్రతతిఁ ద్రుంచు
కందర్పు మొగలాకు కత్తులనఁగ

జగములు పాలింపఁ జను వృషధ్వజుని ముం
దట నెత్తు వెండిబెత్తములనంగ
నభ్రగంగాతరంగావ గాహవిలాస
ప్రాగ్దంతి దంతరుక్పటల మనఁగ

గీ. గగన యోషామ హోదయగ్రావకంఠ
భాగప్రాలంబమాన శుంభత్సితైక
మహిత ముక్తాకదంబ దామములనంగఁ
జెన్నుమీఱంగఁ గిరణముల్ కొన్ని ప్రాఁకె. 121

శా. వేళాశాబరి సాంధ్యరంగమునఁ బ్రావీణ్యత్వతన్ శస్త్రియై
కాళీభర్తగళాభసంతమస మూర్ధశ్రేణి నిర్జింపఁ గెం
గేలందీసిన వింటి నారియనఁ బ్రాఁకెం దూర్పునందెల్పు త
ల్లాలిత్యాశుగపఙ్క్తినిల్పెననఁ దెల్లంబయ్యెడున్ దీధితుల్. 122

శా. క్షీరాంభోది విభుండు వాసవహరిస్త్రీయందు సత్పుత్రకుం
గోరంబ్రాజ్ఞగమౌని కాలహుత భుక్కుండంబునందున్ ద్విజ
శ్రీరామస్థిరమంత్రముల్ పెలయఁగాఁ జిత్రాంశురుక్ప్రాయసం
బారూఢస్థితి పేల్వదోఁచెదివి నుద్యద్దీప్తి రాజాకృతిన్. 123

మ. సరసీజావళి గంధసింధురము శశ్వత్పూర్వదిక్కామినీ
వరసంలబ్ధ తపఃఫలంబు కులటీవర్గాత్మ శల్యంబు త
స్కరమత్తేభ శితాంకుశంబు మిహికక్ష్మా భృత్సుతాభర్తృ భా
స్వరచూడాభరణంబు చంద్రుఁడలరెం జారుప్రభాసంపదన్. 124

చ. సమయమృదంగ ధారి కనుసంజ్ఞనుబిల్వఁ దమఃప్రభాసము
ద్యమమను పెందెఆన్ పెడలు యామవతీవ్రజ వేషిణీకరా
గ్రమహిత హీరకుంభమనఁ బ్రాగ్ధరణీధర శృంగపాళికం
గమలవిరోధిమండలము గానఁగనయ్యె మనోహరంబుగన్. 125

శా. కైలాసామృత కంధిమధ్యమున దక్షబ్రహ్మ సత్పుత్రికా
లోలుండౌ భవచంద్రుఁడొప్పెసఁగె నాలోకింపఁ గాళీకళం
కాలంకారముతో ఫణీఫణమణివ్యాకీర్ణ తారాళితో
లాలిత్యాంబర చాంద్రితోఁ బృథుజటాశాఖాకళా పాళితోన్. 126

సీ. కవబాసి చక్రవాకములు భీతిఁ జరించె
నీరజాళి తపంబు నెఱిహరించెఁ
బాంథావళికి విలాపంబెదఁ బ్రాపించె
మ్రుచ్చులకును భయంబెచ్చరించెఁ
బ్రియుగాంచి కైరవశ్రేణి సంతోషించెఁ
జాంద్రిజకోరముల్ చప్పరించె
మరుఁడించు విల్వంచి విరిముల్కు లెక్కించె
వివిధదిక్తతిఁ గాంతివిస్తరించె

గీ. సంతమసమద్రి గుహలలో సంచరించె
భువిఁదుషారంబు సాంద్రవిస్ఫూర్తిఁ గాంచె
నఖిల జనముల కానంద మంకురించె
ఖ స్థలిని శీత భానుని కళలు మించె. 127

మ. ఉదయోర్వీధర గోష్ఠమందుఁగువ బంధూద్యద్గవిన్ నెర్ల నే
పృథుపాశంబులఁ జిక్కఁగట్టి సమయాభీరుండు దుగ్ధంబులం
బిదుకంగ్రిందఁ జకోరతుండమను లోవింబొంగు తద్భిందు సం
పదలోనాఁ దనరారిజారె హిమముంబాండు ప్రభాసాంద్రమై. 128

మ. ఉరు సంధ్యాసమయంబనామధువు రావ్యోమద్రుప్రాచీదిశాం
తరశాఖంజనియించు సత్ఫలమనాఁ దారాప్రియుండొప్పె ది
వ్య రుచిప్రొద్ధితమై చకోర శుకమాస్వాదించు తత్తుండ శీ
కరమోనావిలసిల్లి జారెహిమసంఘాతంబు పాండుద్యుతిన్. 129

సీ. ఏణాంక శర్వరీ పాణిగ్రహణ వేళఁ
దనరు ముత్యాల తళ్కనంగ
నజకళాదుండు బ్రహ్మాండ భాండము రంగు
నెరప నించిన వెండి నీరనంగ
సమయశిల్పకుఁడు పుష్కరసౌధమున నించు
తెలిపాల సున్నంపు దేఁటయనఁగ
జగములంచితకళాసంపత్తి నలరింప
వచ్చు వాణీతనుప్రభయనంగ

గీ. నఖిల దిగ్రోదసీ గహ్వరాంత రాళ
పూర్ణమాన చరాచరంబులు నఖండ
పాండి మచ్ఛాయ నలరు నుద్దండవృత్తి
నిండె వెన్నెల కన్నుల పండువగుచు. 130

వ. ఇవ్విధంబున నఖండ పాండుర ప్రభాపటల విలాసబంధు రంబై సకల జగజ్జనానందకందళంబై బ్రహ్మాండ కటాహంబు నిండి మెండుకొని నిండు జాబిల్లి రాకకుప్పొంగు నప్పాలవెల్లి వడువున వెల్లివిరిసిన వెన్నెలబయళ్ళఁ జెంమరామించు బోండ్లు మిసమిసలీను కిసిమిసి పందిళ్ళపై నల్లుకొను బల్లీవెల సందులంబొడము పాడవెన్నెలలు మల్లెపూలని కొనంబోయి సిగ్గుగదిరిన డెందంబులుగందళింప వెండియు నవీనకదళీదళ పుటంబులు మృదులధవళాంశుకంబులని తాల్పంబోయి వా యెత్తనేరక తత్తరపాటునొంద మఱియును సాంద్ర చంద్రికా నికాయ విసరంబువలన సరసంబులై కరంగు కురంగాంక శిలావాలంబులం బొంగు నచ్చంపు దేఁటజలంబు లమృతాసవంబులని గుటగుటం గ్రోలంబోయి, కటకటంబడి చిన్నంబోయిన మోముదమ్ము లుమ్మలింప పేఱొక్కసారి గుజ్జమావి జొంపంబులతోఁ బెనంగి సజ్జకంబైన గొజ్జంగి పూఁబొదల నల్లిబిల్లిగా నల్లుకొని పల్లవించిన యేలకీ లతికలన్ జలజలం జాలుకొని ఘనంబై దిగజారు తెలిమంచు తుంపరల పరంపరలం దిలకించి మంచిమంచి ముత్తియంబులని కేలసెత్తంబోయి రిత్తయైన మెత్తదనంబులు గదురబెదరిపడి నెచ్చెలులంగను మొరంగి కేళి కాంతఃపుర మార్గాంతరంబులం బోయిపోయి నిజాపరాధంబు వార లెఱుంగకుండ రేయెండ తాఁకున నలసి సొలసి క్రమ్మర మందిరా రామంబునకుం జని యచ్చెంచు నాంచారు పంచాయుధ భల్ల భగ్న హృదయయ్యై మాలతీ లతాకుడుంగంబుల చెంగటి చెంగల్వ కొలంకుల తీరంబుల నిలిచి నిలిచి, మాధవీ మండపంబుల చేరువం దారి తారి, మల్లికా ప్రసూన గుచ్ఛ ప్రకీర్ణంబులైన చలువ పూఁ జప్ప రంబులంజేఁ చేరి. కప్పురపు టనంటులనంటి ప్రాఁకినబండి గురివెంద పందిళ్ళఁదిరిగితిరిగి గొజ్జంగి పూఁదేనెవాటికలు దాఁటిదాఁటి, కుంకుమనీటి కేళా కూళి పాళికల తెరువుల గడచికడచి, కుసుమ శరాశీ విషవేదనాదో

దూయ మాన మానసయుగుచుంఁజిఱు చెమ్మటఁ గ్రమ్మిన నెమ్మొగంబు మంచుగ్రమ్మిన పెలిదమ్మి ననుకరింప, గుత్తంపు గబ్బిగుబ్బదోయి నత్తమిల్లు జాళువాజిల్లు పైఠాణిమెఱుంగు రవి కెనిగ్గులుగ్గ దేర, ధగధగాయమాన చారుకంకణాంగద నిక్వణంబులు ఘల్లు ఘల్లు రవ నల్లనల్లన జవ్వాడు లేనడు మల్లనాడ గమనవేగంబున జారు చారు పైఠంగేలంటుచుఁ గొండొక చెదరు చేర్చుక్కఁ గుదురు కొల్పుచుఁ గొంతవదులు క్రొమ్ముడి యిమ్ముకొల్పుచు, భయంబునఁ జక్కెర విల్తుండెక్కడ పెన్నాడునోయని దిగులున నడుగులు తడఁబడ వడవడ పెన్నెలవడఁ దాఁకి వడంకుచున్న యన్నులమిన్నం గనుంగొని నెచ్చెలు లెల్లఁదల్లడిల్లుచు ముద్దులగుమ్మ నతి ప్రయత్నంబునఁ గేళీ చంద్రకాంతమణీ సౌధవిశాల చంద్రశాలా ప్రదేశంబునఁ నొక్క హంసతూలికాతల్పంబునఁ గూర్చుండఁబెట్టి యాసఖీజనంబులు పరివేష్ఠించి యుండనక్కల కంఠీతిలకంబు నిండు చందురునింగాంచి యుపాలంభ నర్మ గర్భంబుగా నిట్లనియె. 131

## మోహన చంద్రుని దూరుట

అలచింతామణి కామధేను హరి వాహ స్వర్గవేదండ రా
డ్తులసీకౌస్తుభ కల్పవృక్ష కమలాస్తోమంబు తోడన్ సుధా
జలధింబుట్టి హరావతంస మణిపై సౌమ్యస్వరూపుండవై
జలజాతాయత చారులోచనల నేఁచన్ ధర్మమా చంద్రమా! 132

గీ. సకలజీవుల కానంద సరణిఁదెలుపు
మంచునిన్ బంచెఁగాని విరించి తొల్లి
విరహి జనమారణోద్యోగ విధమొనర్ప
నెలిమి నిన్ రాజుఁగాఁజేసెనే శశాంక! 133

సీ. తెఱగంటి దొరవింట వరుస దప్పకభుక్తిఁ
గొనునాఁడు మొదలంటఁ గ్రాలిరేని
సతినెపంబున బృహస్పతి హుంకరించు నాఁ
డుశనుండు కృపఁగావకుండెనేని

సభవుఁడంగజుని జిక్కుఁడఁచు నాఁడాతని
చెలికాఁడవని నామ ముడిపెనేని
నడుమార్గమంటి వింధ్యుండడ్డమగు నాఁడు
జేరికుంభజుఁడాజ్ఞ సేయఁడేని

గీ. పొంచి రాహుగ్రహం బారగించునాఁడ
రోచకముగాక తియ్యని తోఁచెనేని
గండడఁగిపోవె రోహిణీ కంఠసూత్ర
గరిమపెంపున బ్రతికితి గా శశాంక! 134

గీ. కంధరస్థిత విషవహ్ని కారణమున
శీతభానుండవని తాల్చి భూతభర్త
రహిఁబరీక్షించి రాత్రిం చరస్వభావ
మెంచివినుఁబుత్త్రు చేత దండించెనెంచి 135

గీ. విషమశరుతోడ సఖ్యంబు విషము తోడ
విషనిధి జనించుటయు మహావిషమనేత్రు
పైఁబదంబాను కతనఁ బర్వములయందు
విషధరుండారగించు నిన్‌విషజవైరి! 136

ఆ. విషము మేనసోఁక వెరవరు నీరశ్మి
మెఱవ వెరచినట్లు విరహి జనులు
గానఁ బుడమిలోనఁ గమలారి దానికీ
వెక్కువనెడిమాట నిక్కువంబు. 137

క. గురుశాపంబునఁ బోలియవు
హరనందన చండపాదహతి నమయవహీ
శ్వర విషమునఁ గసుగందవు
విరహిజనుల పూర్వజన్మ విధమెట్టిదయో? 138

గీ. కాయహీనునితోఁ జెల్మి సేయుకతన
నత్కళాహీనతయు నీకు సంభవించె
నరసుజన దుష్టజన సహవాసయుక్తి
నలరుహారికి. దత్ఫలంబబ్బు గాదె! 139

సీ. అగ్రజాతుఁడు కఠోరాభీల విషమూర్తి
తండ్రి బాడబమహోదహన కుక్షి
తల్లి కౌటిల్యవర్తన నభస్సంచారి
జ్యేష్ఠామహాదేవి జ్యేష్ఠురాలు
ఆశ్రయ ప్రభువజ హంత పాతకవర్తి
భావింపఁ గలిఁబెద బావగారు
మహిని గూఁతులనిచ్చు మామశివద్వేషి
కోరికన్న సుతుండు కుండుఁ దరయఁ

గీ. గామినీ భూతమల్లుండు కముఁగొనంగ
నవశకున శేఖరుఁడవు దోషాకరుఁడవు
యామినీచరుఁడవు కళాదాహ్వయుఁడవు
గాన శశి! నీకు సుగుణ మింతైనఁగలదె? 140

గీ. పాంథజనులకుఁ దొల్లి యాపద్మభవుఁడు
ఫాలతలముల లిఖియించు ఫలమదెన్ని
విధములఁ దలంపఁ గుడువక విడువదవని
నిన్ను దూషింపఁ బనియేమి నీరజారి. 141

క. అనియిట్లనేక భంగుల
వనజారిం దూరిదూరి వనితామణిక్రొ
న్న నవింటివాని సోల్లుం
ఠనములు మైకొలుపఁ బొప్పడన్ వడిఁబల్కెన్. 142

కన్నులవింటిసామి గురుకామినిఁబొందిన సోముఁగూడి నీ
వన్నులనేఁచపాగితకటా యిదిపౌరుషమే జగంబులో
నెన్నుదురెట్లు శూరవరులెట్టి నికృష్టపువేళఁ బుట్టితో
యెన్ననకున్ విదర్భ పృథ్వీవరనందనయైన లక్ష్మికిన్. 143

సీ. జనకుఁడెన్నఁగఁ బుణ్యజనవినాశకరుండు
జనయిత్రిఁజూడ జంచలగుణాఢ్య
మాతామహుఁడు దరిమాలి నప్పుల గంప
సెతిమాతులుఁడు యామినీచరుండు

సంగడీఁడుకుజాతి సంప్రవర్తనశాలి
కమనీయ కాయంబు గగనసుమము
మహనీయ నామంబు మారాభిధానంబు
ఘనమైనటెక్కెంబు వనచరంబు

గీ. మూలఁబడియుండు తేరు బల్గాలిపీడ
కార్ముకంబెంచ నిలువెల్ల ఁగండ్లపోరు
గుణముఁ గనమధ్యపాయి పెన్గోలకందు
నంగభవ నీకు సుగుణమింతైనఁ గలదె ! 144

సీ. తపముఁజేసెడి వృషధ్వజమూర్తి కెఱుక నీ
ములుకులువేఁడౌట పువ్వులౌట
మదిఁజాలగడునొచ్చు మాతలకెఱుక నీ
నడవడి భ్రష్టౌట నాయమౌట
వరుఁబాసి తిరుగు యౌవన కాంతకెఱుక నీ
చర్యతాపంబౌట సహ్యమౌట
పతిహితవ్రతచిత్త రతి కెఱుకీవనం
గుండవౌటయు సదంగుండవౌట

గీ. యంబకం బాసనంబౌట యజుని కెఱుక
నీవు దుశ్చరితుఁడవౌట నీతియుతుఁడ
వౌట, యీమర్మ మెఱుఁగక యువనియందు
నఖిల జనములు నిను దుష్టు వనరుమదన! 145

అ. గీ. నీదు విల్లు విఱుగ నీబాణములు గంద
నీబలంబులెల్ల నింగిఁ బరవఁ
జేసెఁ గాక బ్రహ్మ చిత్తజ, యువి తిన్న
నైనఁ బాంధ నికరమవని మనునె ? 146

క. ఆజన్మార్జిత పాంథ
స్త్రీ జిద్దురితౌఘ మిపుడు చేతోభవ నీ
తేజోహీనతఁ జేసెం
గాఁజాలదె యింకనైనఁ గనికరుఁడవుగా. 147

సీ. పరుల కగోచర ప్రౌఢిమఁ దెగి మహా
    పథ మంటి పమ్ము బల్ రథముఁ గొంచు
శత్రు సంతతికిలోచవ దుష్ప్రహోద్వృత్తి
    దంబైన మకరధ్వజంబుఁ గొంచుఁ
బగతుల డెందంబుఁ బగిలించు పదుమార్గ
    వాఁడులు గల గొప్పవాలుఁ గొంచు
ఘనవైరులకు భయంకర హుంకృతుల్ సేయు
    ద్విజరాజ షట్పదవ్రజముఁ గొంచుఁ

గీ. జెలఁగి యాపహపాంబకు సెలవుఁగాంచి
పొంచి పంచాంబకములు ధరించి హుంక
రించి త్ర్యంబకుపైఁ బరతెంచి మించి
గెలువ కెప్పటి కరిగితే కీరవాహ ! 148

గీ. స్వాంతజుఁడవీవు తగఁబయోజన్ముఁడతఁడు
గావునఁ గృపీట జన్మతోఁ గలిపిపొందు
గలుగుటెట్లగు రూపరుగ్గణ సువర్ణ
జాతిగతురాను లెంచంగ శంబరారి! 149

గీ. నిన్ను బుట్టించు వేళ వాణీవిలాసి
పుడమిఁ బాంథుల గెలుమంచుఁ బోవఁగఫాల
తటమున లిఖించి మదన పీధాటిఁదెలిపి
కాయహీనుండ వగుమని కడమవ్రాసె. 150

గీ. ఇందు విల్కాని నిటుపలాయించి కోప
గించి కలివోక్తులలర నిందించి పిదప
డెంద మందంద సమ్మదంబంద నిందు
వదన మదనునిఁ బొగడె సంభ్రమముగదుర 151

## మోహన మన్మథుని దూరి పొగడుట

సీ. గిరికన్యగనయు శంకరమూర్తి పైఁ బూవుఁ
    గెరువలిడి తపోగరిమఁజెఱచి

తనయ రాణిగఁజేసి కొను తమ్మిఁ పూఁజూలి
బలుపెద్ద తనమెల్ల వెలితి పఱచి
మునిపత్నిఁడాయు శుక్రుని పెంపుమాయించి
కాయమెల్లను గనుల్గానొనర్చి
గురుభామనంటు చందురుని నెమ్మదిఁజాలఁ
దూలించి యపకీర్తి పాలుసేసి

గీ. శక్తినందన గాధేయ సంయమీంద్ర
పతులనైష్ఠిక యోగ్యవైభవములుడిపి
తా, బలీ! నిన్నుగీర్తింప నలవియగునె
విజితమనుజాహి గీర్వాణ విషమబాణ! 152

క. సురుచిర సుగంధ బంధుర
సరసిజనవ మల్లికా ప్రసవ పరిమళ సం
భరితములై యట మరుదం
కురములు బరతెంచెఁగుసుమ కోమలిమీఁదన్ 153

క. ఆమారుత మొలసిన య
బ్భామామణి యులికి కినుకఁబలికెం బవనా!
కామినుల నేఁచు దోషము
పామైకబళింప మూలఁబడి పాలియవుగా! 154

క. హరుని పయికేగునాఁడ
మ్మరునికి సాహాయ్యవృత్తి మైఁజని తద్భీ
కరదృష్టి నతనుఁడీల్గినఁ
బరువడి బలుమూలడాగఁబడితి కృతఘ్నా! 155

సీ. తరమెన్ని చూడ శ్రీధరసూనుఁడాతండు
క్షితిలోన శ్రీధరాహితుఁడవీవు
భావింప శంబర భంజనుండాతండు
పటుతరారూఢ శంబరుఁడవీవు
పరికింపఁ బావకాంబక విరోధియతండు
వివరింపఁ బావకప్రియుఁడవీవు

కంపితాశేష జగత్ప్రాణుఁ డా తండు
నరయ జగత్ప్రాణ మౌదువీవు

గీ. సఖుల గర్వోద్యమ లయసంచారి యతఁడు
శమన దిగ్భాగమలయసంచారివీవు
గాన, కందర్పుతోఁ బోందు మానుమిందుఁ
జందనగ్రావ నివసనా మందపవన! 156

గీ. అవన పావననాను విఖ్యాతిడింది
పతితుఁడనుమాట నీకు నేర్పడియెఁజూడ
గాఢ మదన జ్వరంబునఁ గ్రాఁగు విరహ
కామినుల మీఁద వీచిన కతనపవన! 157

క. విరహీవధ పాతకమున
మరుదేహము దూలెనతని మామకుమేనన్
గురుకార్శ్యత బహుళంబై
దురటిలి నిసుఁ బాపఁతేఁడు దొలి గబళించెన్. 158

సీ. వరకుందరదయంచు వెరపింపకుమనోజ
నీలకంతకచ యీ విరుప మాంగి
బింబాధరియటంచు బెదరింపకు శుకంబ
పాంకవామోద యీ చారుచరణ
విరిబోఁడియంచుఁ జిందరసేయకు మిళింద
కాంచననాస యీ కంబుకంఠి
పద్మపాణియటంచు భయపెట్టకు శశాంక
హరిరోమ వల్లి యీ గురునితంబ

గీ. మోహ నాఖ్యావచోనేత్రముఖనభిత్వ
మలరు కతమున నెయ్యురాలౌను మీక
టంచు మదమని వాని హయంబు గుణము
మాను నిటుబల్కి రక్కల్కి మగువలెల్ల. 159

క. పలుగాకులు బెంచిన కో
కిలములు మధుపాన వాంఛఁగెరలెడి కుటిలా

చులు ఫలభంగముఁ జేసెడి
చిలుకలు చెలిమీఁదఁ గరుణ జేయుచెతలపఁన్. 160

మ. లలనా రత్నము మన్మథానల కరాళ జ్వాలికాతప్త దే
హలతా కంపితయై ముఖాంబుజమనంతా లోకముంజేయుచుః
విలపించెన్ ఫణికన్యకామణి లసద్వీణాలతామానసే
శలతాక్రోడి నఖాళిమేళ కలనాచంచద్వరాళీధ్వనిన్. 161

ఉ. కప్పురగంధి నెచ్చెలులు గన్గొని కౌఁగిటఁ జేర్చి బాష్పముల్
జిప్పిలుకన్నుదోయి నయి చీరచెఱంగునవొత్తి మ్రొక్కి బ
ల్లప్పనముల్ గడించు గరుడాచలవాసి నిమన్నరించునో
యొప్పులకుప్పయంచు ననమారగఁ మారడఁ బల్కి రంతటః 162

సీ. మార్తాండుతోఁ బోర మందేహులడరి ముం
దఱువెత్తు సింహ కేతనమనంగ
శర్వరీకరిఁ దోలు సమయ మానంత హ
స్తష్టమౌ వజ్రాంకుశంబనంగ
పటుతమోభ్రమ నుల్కి పద్మినికినుఁడు భ
వ్యముగ నంపిన మించుటద్దమనఁగ
రాత్రికల్పంబేగ రవిచతుర్ముఖుఁ డుండ
హరినమార్పిత పొందు రాజ్ఞమనఁగ

గీ. అంగ సంభవునికు శరాసనమున
ముక్తమై చారుమల్లికా ముకుళశరము
వడి వియోగులఁ గలఁచి గీర్వాణపథముఁ
జేరునన వేఁగుఁజుక్క పేంచేసె నపుడు. 163

చ. జగతి సమస్తభూత జనసంతతి కాత్మక వాక్ప్రపూర్ణమా
నిగమ సహోసమంబుకడు నిక్కముఁ కాలముదెల్పు నేర్పు మా
కగపడునన్నరీతి నిగమాద్రినవో సవనంబులం ద్రిభం
గిగఁ దొలికోళ్లుగూసె వడిఁగేరును నాలవ యామమందునః. 164

గీ. సమయమును మౌని మేరువ సానుభూమి
కేఁగుచో జపమాలిక బాగుమీఱఁ

బూస లోక్కొక్కటియుఁ ద్రోచు పోల్కిఁదనరె
రవిబుధుల్ దక్కఁ దక్కుతద్గ్రహచయంబు 165

గీ. చరమ శైలాగ్ర హరిణ విషాణములను
దమస మను గాఢ రజ్జు వందమరఁ జేర్చి
సమయ మృగయుండు ఖవనదేశంబు జోపఁ
జిక్క రా జింక జనియురిఁ జొచ్చెనపుడు. 166

మ. ధరణిం బూర్వదిగంగ నామణికి మార్తాండుండ నాసూనుఁడం
బరగేహంబున సంభవించు నపు డబ్బారార్తి చేఁబుట్టు దు
ర్భరపున్ హుంకృతులో యనంగ బలికెం బక్షుల్ తదీయాన నం
బరయన్ పెల్వెల బాఱెనో యన సురేంద్రా శాస్థలంబొప్పెడిన్. 167

## సూర్యోదయ వర్ణనము

సీ. కైసేయు తఱిని బ్రాక్కాం జాక్షి కెదుటఁ జె
న్నలర నిల్పిన కెంపు టద్దమనఁగఁ
జైత్రయాత్రకు నేఁగు జంభశాసను మ్రోలఁ
బట్టు క్రొంబట్టు తుల్యాయనంగ
వనజాసనుఁడు మెచ్చి వైజయంతునకాడు
కొనఁబంపు పగడంపు గుత్తి యనఁగఁ
గేలిమై మిన్నేట నోలాడు పౌలోమి
కబరిఁ దాల్చిన రక్తకమల మనఁగ

గీ. ఖతల గత ఋక్షసముదయ క్షితిహలంబు;
అంధకారపయోడ జంఝూ నిలంబు
వరచకోరక మండల వ్యాకులంబు
నిండు రుచిఁ బొల్చె మార్తాండ మండలంబు. 168

సీ. శశికాంత ములచాలు జాలువారుట మానె
రవ్వుపలములు వేంద్రము వహించెఁ
గడువేడ్కఁబద్మినీ కాంత పక్కున నవ్వెఁ
గుముదినీసతిలోనఁ గుందికందెఁ

గోకదంపతులుర్వి కొంకుదీరి చరించె
వెన్నెల పులుగులు వింటనంటె
నెలనెలంతలకాంతి చలనమై కనుపట్టె
మధుపాళులున్మత్త విధినటించెఁ

గీ. బహుళ మందేహదైత్య దర్పంబడంగెఁ
గలితమగు సాంద్రచంద్రికాకళ దొలంగె
బాలభాస్కర కిరణవైభవ మెసంగెఁ
జారుతరమైన ప్రత్యూష సమయమునను. 169

క. అత్తఱి దినముఖ కృత్యము
లత్తరుణుల తోడఁ గూడియమ్మోహనలో
నుత్తల పడుమనొనర్చి ని
రుత్తరయై కుసుమ శయ్యనున్నట్టి యెడన్. 170

చ. కనకలతాముఖాంగనలు కామిని యున్న తెఱంగు కీరనా
ధుని ఘన రాయబారమును దోయజనేత్రుఁడనుగ్రహించి చం
దనవనమందునిల్చుటయుఁ దత్క్రమమంత సవిస్తరంబుగా
వినివినఁ దల్లిదండ్రు లతివిస్మితులైరి మనంబులోపలన్. 171

క. ధరణి సురతనయ జీవో
ద్ధరణ రణకళానిరాళ తాత్పర్యవశం
కర శంకర కరణీచమూ
వర దుఃఖనితాంత గహన పావకమూర్తీ! 172

ఉ. ఖండిత దానవేంద్ర శశిఖండకిరీట శరాసనోగ్ర వే
దండ మృగేంద్ర వాహనపతంగ కులేంద్ర మహాస్త్రనిర్జితా
ఖండలసత్కపీంద్రనత గాధిసుతాఖిలసంయమీంద్ర మా
ర్తాండ కులాబ్ధిచంద్ర జగదంచితకీర్తి విశాలచంద్రికా! 173

ఉత్సా. పరమ హంసచిత్తపద్మ పద్మినీమనోహరా
పురహరాది భక్త జనకుముద్వతీనిశాకరా

శరధినాథ ఘోర దర్ప సానుమత్పురందరా
ఖరవిరాధముఖ నిశాట గాఢగర్వసంహరా! 174

గద్యము

ఇది శ్రీరామచంద్ర సాంద్ర కరుణాకటాక్ష వీక్షాప్రసాదపరిపాక లబ్ధప్రసిద్ధ కవితా విలాస కళాధురీణ శ్రీమదాపస్తంబసూత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర వద్దిపర్తి వేంకటామాత్య పుత్ర సకలసుజనవిధేయ కోసంరాజ నామధేయ ప్రణీతంబైన వేంకటేశ్వరోపాఖ్యానంబను శృంగార ప్రబంధంబునందుఁ దృతియాశ్వాసము సంపూర్ణము.



# శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము

## చతుర్థాశ్వాసము

క. శ్రీ మదయోధ్యా పట్టణ
సీమాంతర్దివ్యరత్న సింహాసన సం
స్థేమాభిరామ ఘన ధా
త్రీ మండల భృల్లరామ శ్రీరఘురామా! 1

వ. దేవా! యవధరింపుము 2

క. మన్ననఁ గూతురి చందం
బన్నెలఁతలచే నెఱింగి యప్పుడె నవలా
మిన్నంగనఁ జెంచులవే
గన్నుల దొరచనియెఁ గన్యకా గృహమునకున్ 3

ఉ. వచ్చిన తండ్రిఁ గాంచి నవవారిజపత్ర విశాలనేత్రి పెం
పచ్చుపడం దదీయ చరణాబ్జముల న్నొసలంట మ్రొక్కినం
గ్రుచ్చి కవుంగిలించుకొని కూరిమి ముద్దిడి చెక్కుఁగొట్టి లో
ముచ్చట లూరఁగా శిరము మూర్కొని వేడుక గారవించియున్. 4

క. కాంచన గంధింగాంచి స
మంచిత సంభ్రమ విలోలమగుచూడ్కుల లా
లించి కృపారస మొలుక వ
చించి కవుఁగలించి శబర శేఖరుఁడనియెన్. 5

శా. తల్లీ నీగుణశీల వృత్త విలస త్సౌందర్య రేఖాలి పెం
పెల్లన్ మామకు మామయిచ్చ విని మోహించెన్ భవచ్చిత్త మా
పుల్లాంభోరుహనేత్రుఁజెంది విరహాంభోరాశి మున్గెంజు మీ
తెల్లంబంచు సఖీమణుల్ తెలిపి రింతీ సంతసంబందితిఁ. 6

క. నవలా నవ లాలిత గౌ
రవ లక్షణ భాగ్య సుగుణ రమణీయ విలా
సవిభవములఁ దగు నీకున్
ధవునిగ మాధవుని నా విధాత సృజించెఁ. 7

క. దుహితా విధికృపచే నా
దు హితంబొడగూడె నేఁడు తొలిబాముున మ
న్మహిత కృత సుకృత ఫలసం
గ్రహమున హరి యల్లుఁడౌటగా నమకొనియెఁ. 8

వ. అని యిట్లనేక విధంబులం గుమారీతిలకంబుం గొనియాడి కీర
వల్లభు నుల్లంబు రంజిల్లంబలికి శిఖినాథుండు నిజబంధువర్గంబు
నకు నే తద్వృత్తాంతం బెఱింగించి తమ కులాచార క్రమంబునఁ
గన్నియను ప్రక్చందన లేపనానర్ఘ్య భూషణావిశేషంబుల నలంకృ
తంజేసి క్రొత్త ముత్తియంపు కుచ్చులజాలరుల డాలుగీలుకొను మగ
రాల మెఱుంగుటంచలపల్లకి నిడుకొని శబర వీరభట సహస్రంబు
లఖిల శస్త్రాస్త్రపాణులై యుభయపార్శ్వంబులం బరివేష్టింపఁ గొంద
ఱలి నీలవేణులు వింజామరలు వీవఁ గొంద ఱిందీవరాక్షు లగురు
ధూపంబులిడఁ గొందఱరవిందగంధులు తమ్మలంపు మడుపు
లందీయ భేరీమృదంగాది పంచ మహావాద్యంబులులియ నొక్క
శుభముహూర్తంబునం గదలి సకల సామంత భృత్యామాత్యపరివృ
తుండై శీఘ్రగమనంబున విశాలరమణీ యంబగు చందనవనంబున
కరిగి. 9

సీ. నిండుక్రొన్నెల కన్ను, బండిదన్నిన చెన్ను
గులుకువానిఁ గృపాంబులొలుకువాని
వాలిసేసినయమ్ము, పాలదేరినసొమ్ము

గ్రాలువాని వృషాలి దోలువాని
నరునిఁగాచినబత్తి కరిని మన్నినసత్తిఁ
దనరువానిఁ గుచేలు సెనరు వాని
వనముఁ గాల్చినచిచ్చు వనధిఁజొచ్చిన ముచ్చుఁ
గలఁచువాని పయోధి నిలుచువాని

గీ. వల్లవీ చిత్తవీధి రంజిల్లు వాని
దరిసి మత్తిల్లు మల్లుల విఱుచువాని
నాగమాంతాధ్వడోలిక నూఁగువాని
వేద శేషాద్రి నిలయుఁడై వెలయువాని. 10

క. పాడగాంచి భిల్లవల్లభుఁ
డొడలెల్లఁ జెమర్పఁ దనదు నువిదయుఁ దానున్
వడి సాగిలిబడి వేడుక
వలఁగొని మున్మాఱు మ్రొక్కి వారనిభక్తిన్. 11

ఉ. ధన్యత నొందెవంశము ముదంబునుజెందె మనంబు జాతిలో
మాన్యుఁడనైతి గేహము రమాసతికిన్ నెలవయ్యె నిప్పుడీ
కన్యక నీకునిచ్చితి జగత్త్రయనాథ వికుంఠనాథ న
న్నన్యునిగాఁదలంపక మదాత్మజంబ్రీతిఁ బరిగ్రహింపవే! 12

వ. అని పలికి. 13

ఉ. మన్ననఁ దల్లిదండ్రులు కుమారిఁగవుంగిటఁజేర్చి బాష్పముల్
కన్నులఁజిప్పిలన్ వినయగౌరవ వాక్యాలుపన్యసించి యీ
వెన్నుఁడు నీకు నాథుఁడరవిందనికేతన మూర్తివౌదు వం
చున్ననబోఁడి నద్దనుజసూదను సన్నిధి నప్పగించినన్ 14

క. అంతట వేంకట విభుఁడ
క్కాంతా రమణీయ రూపగౌరవమెలమిన్
మంతనమున శుకవల్లభుఁ
డెంతయుమును దెల్పెనంతనేర్పడఁ జూచెన్. 15

గీ. గమన మదకుంజ రారోహకలనఁ బొదవి
యూరురంభాద్వయము దాఁటి ాుకాంచి
ఘంటికా భేరికా ధ్వనుల్ గ్రాలజఘన
వేదివసియించె నా రమావిభుని చూడ్కి. 16

గీ. జఘన మనుచక్ర మంటియు సరభసమున
మధ్యమనుకేసరి నిరూఢ మహిమఁదనరి
రోమ రాజియన్ దారి ను రోజ దుర్గ
మునకు లంఘించె వేంకటావనిపు చూడ్కి. 17

క. నెఱిఁజుబుక భాగమునుగిరి
దరిసి గమింపంగ రామిఁ దడబడి తరుణీ
సురుచిర కంఠస్థితమగు
గురుముక్తా సరము లంటుకొను హరిచూపుల్. 18

ఉ. ఆనగవాసి చూపు వనితానన సీమకుఁ బ్రీతిఁజేరఁగాఁ
బూనిరదచ్ఛదామృత సముద్రమునందు విహారవీచులం
బైనెగయుంగరామి సుడిబడ్డవిధంబున వక్త్రమందు బి
ట్టాని తటాలునన్ నెగసి యంతట దంతపటంబునంటెడున్. 19

మ. ప్రసరించెంగడు వేంకటేశ్వరు ముఖాబ్జంబందు మోదంబునం
బ్రసవాంగిస్ఫుట దివ్యనేత్రయుగ సారంగంబులందద్వధూ
ట్యసమానాంబక నీల కైరవములన్ వ్యాపించె లక్ష్మీ విధే
యసమంచ త్సరసీజనాభుని విలోకాబ్జారి రుక్చంద్రికల్. 20

గీ. భాసురాన్యోన్య హేలావిలాస విభ్ర
మంబు లాత్మలఁ దళుకొత్త మరలి మరలి
చూచి చూచియుఁదలయూచి యూచిప్రేమఁ
దనరి తనరి మనోజకాండ ప్రహతిని. 21

గీ. ఇట్టు లేకాగ్ర చిత్తుఁడై యిందువదన
రూప సౌష్ఠవ రేఖా నిరూఢ చిత్త
హర్ష సంధాయియై చూచి యచలవాసి
యువిదతోఁగూడి పురికేఁగ నుత్సహించె. 22

క. అంతట శబరీ కాంతుఁడు
కాంతాతిలకంబు దాను కడు వేడుకతోఁ
గంతు జనకుని పదంబుల
కెంతయు వలఁగొనుచు మ్రొక్కి యిచ్చెంజనియెన్. 23

వ. అనంతరంబ య్యనంత శయనుం డనంత కళ్యాణగుణ సమన్విత యగు నచ్చెంచు మించుఁబోఁడితోడంగూడి కనకరత్నమయంబైన దివ్యరథంబు నందారూఢుండై నిజదాసీ దాసానువర్గంబు లేతేర నిజపట్టణంబున కేతెంచి రాజమార్గంబున వేంచేయు సమయంబున. 24

ఉ. శేషనగేంద్ర మందిరుఁ డశేషజనంబు లెఱుంగ భిల్ల రా
డ్యోషను గూడి వచ్చెడి మహోత్సవమున్ విని వేడ్కతోఁ బురీ
యోషి దనేకముల్ మణిమయోజ్జ్వల సౌధము లెక్కిచూచి సం
తోషముతో సుమాక్షతలుతోయజ రాగములోలిఁజల్లుచున్. 25

సీ. ఘనరోమ నీలాహిఁ గనుచక్రవాకికిఁ
దరుణి నెమ్మొము సుధాకరుండు
కుచదాడిమ ఫలంబుఁ గోరు కీరమునకు
సతితావి గందంపు సాంకవంబు
కటకగారుడ రత్న పటుత్వణాదకురంగి
కతివ మధ్యంబు సింహంపు కొదమ
కటిథరంబనివేగ గవయు మేఘమునకుఁ
బద్మాక్షి నిట్టూర్పు వాతపోత

గీ. మనుచుఁ జూపరులగ్గింప నాక్షణంబ
మెల్లమెల్లన పదములు మెట్టికొనుచు
మోహనాచలవాసుల ముదముతోడఁ
జూడ నేతెంచె నొకవార సుందరాంగి. 26

మ. అలినీలాలకయోర్తు బాలనరసింహస్వామిఁ జూడంగ జా
బిలి రామేడకువచ్చి నిల్చె విలసద్వైరీనినాదైక చం
చల భావాత్మ సరోజయై కుడుపు పేచాలించి మైఁబట్టు దు
వ్వలువొప్పన్ గదియించి యొంటికనుగ్రేవంగాటు కర్పించుమున్, 27

మ. ధరభేరీధ్వను లుల్లసిల్లఁగఁదదుద్యధ్వాన లీనాత్మయై
పరిధానంబు కుచాద్రులందు న విలంబంబై పిసాళింపఁజం
దిర కాంతన్తగి తోరు సౌధమున వర్తించెన్ భుజంగాచలే
శ్వర కాంతామణిఁజూచువేడ్క నొకచంచచ్చంచరీ కాక్షితోన్. 28

గీ. స్వామి వేంచేసెనను వార్త శ్రవణములకుఁ
బండువైదోఁచ భూషణపటలివిడిచి
యొక్క చెవికమ్మ గదియించి యువిదయొకతె
ద్వారమున వచ్చినిల్చెను బాఱుతెంచి 29

సీ. వెలలేని గరుడపచ్చల తాళి సమమైన
గబ్బిగుబ్బల మీఁద గంతులిడఁగ
నాణిముత్తెపు రుచుల్ రాణించుపొజుల
కమ్మలు గండ భాగములు గప్పఁ
గాంచనకాంచికా కలితఘంటారావ
ములు నితం బాద్రులఁగులుకరింపఁ
గరహీరకీలిత కటక ప్రభాజాల
మంగ కాంతులమీఁద హావుసునెరప

గీ. వెనక ముందఱఁజూడక వెలదిఁయొకతె
రత్నకుట్టిమ వీధుల రాజసమునఁ
బరువు పెట్టుచు వేంకటేశ్వరుని కాంతఁ
జూడ నేతెంచె సతులెల్లఁ జోద్యమంద. 30

క. భూసుర సువాసినులు దగ
భాసుర నీరాజనములు బట్టిన, హాసో
ల్లా స ముఖాబ్జుండగుచుఁ గు
శే శయనాభుండు గొనఁగఁజెలికొనెఁ బిదపన్. 31

ఉ. మింట ధిమిద్ధిమి ధ్వనుల మేయముగా సమకొల్పి వేల్పు వా
ల్గంటులు నాట్యమాడఁ గఱకంఠ సతీ రతిభారతీ శచుల్
దంటగఁ బూలబంతులు ముదంబునఁగైకొని వేటులాడ నిం
టింటన్నివాళులీయఁగ ఫణీంద్రమహీధ్రనివాసి ముందటన్ 32

ఉ. కొంచక నాట్యమాడుచును కోయని భక్తులువింటఁ బూలుదొ
ర్లించఁగ ఖష్టలంబున సరీగమపాయని నారదుఁడు వా
యించఁగ భూసురుల్ గదిసి యెల్లెడలన్ మునికోటితోడ దీ
వించఁగఁ జెంచితంగలిసి వేంకటభర్త గమించెఁ బ్రీతితోన్. 33

ఉ. కంతుగురుండు దాసమతికాండములుల్లసిలంగ వారసి
మంతినులాటలాడఁగ సమస్త మహీసురవైష్ణవోత్తముల్
చెంతల వేదపాఠములు జేయుచు రాగసువర్ణరత్న శు
ద్ధాంతనిశాంత వాటికి మహావిభవంబున నేగ నయ్యెడన్. 34

ఉ. నారదుఁడేగుదెంచి హరినామసహస్రము లుగ్గడించి కై
వారముఁజేసి తచ్చరణపంకజముల్ నొసలంట మ్రొక్కి యం
భోరుహనాభ నన్గరుణఁబ్రోవుమటంచుఁ బ్రదక్షిణించి సం
పూరిత మానసుండగుచుఁ బుష్కరమార్గమునంటి పోవుచున్. 35

**నారదుండు లక్ష్మీదేవికిఁ జెంచుకన్యక పరిణయంబుఁ దెల్పుట**

క. వేదాద్రిఁ గనుంగొని స
మ్మోదంబున దేవభవనమున కేఁగియు ల
క్ష్మీదేవిఁ గాంచి వినుచెలి
నీ దయితుని గుణములెల్ల నిజమెఱిఁగింతున్. 36

క. వేఁట నెపంబునఁ గడు జం
ఝూటముతో నేగి చందనాచల కటకో
గ్రాటవిని భిల్లరాజ వ
ధూటినిఁ గొనివచ్చెనేఁడు తోయజవదనా! 37

క. నలుసంత నీ పెఱుంగవు
కులకాంతలరంతు సేయు కుటిలులు గలరే
యిలనల్లనయ్య దక్కఁగఁ
బొలఁతీ! యని తెలిపి కలహభోజనుఁడరిగెన్ 38

క. నారదు మాటలు విని య
న్నారీతిలకంబు లోచనంబుల నశ్రుల్
జార మహా కోపము లో
నూరంగ నొడలెల్లఁ జెమట లొదవఁగ నంతన్ 39

క. తత్తర పాటునఁ బడి చెలి
కత్తెల శుకకేకి శారికా తతితో వా
యెత్తక పడకింటికి తలు
పత్తఱిఁ గీలొత్తి శయ్య నలమట నున్నన్. 40

వేదగిరిన్ నృసింహుఁ డన విష్ణు రథాద్రిని వేంకటేశుఁడన్
శ్రీదయితుండు మున్వెలసి శిష్టజనావన దుష్ట శిక్షలన్
మేదినిఁ జేయుచున్ వెలుఁగు నీరజలోచనుఁ డబ్జగేహ ని
ర్మోదమెఱింగి తన్నగరి ముంగిటకేఁగి కవాట మంటుచున్. 41

క. బాలా యే తెంచితి నీ
వేలా యెదు రేగు దేరవేలా తలుపి
ట్లేలా బంధించితి విం
కేలా కీలెడలఁ దీయవేలా మేలా? 42

క. చాలఁగఁ బ్రొద్దాయెను జా
గేలా బలుచింతనొందనేలా కోపం
బేలా నీవాఁడను న
న్నేలా యెంచెదవు పల్కవేలా గోలా! 43

క. నీలాలవేణి నాపలు
కేలా వినిపించుకొనవదేలా చలమిం
కేలా కానుకఁగైకొన
వేలా నీకౌఁగిలీయ వేలా బాలా! 44

క. అని మనమలరఁగఁదగఁబ
ల్కిన పలుకుల కులికి కలికి కినుకెద గదురన్
వినివినని యట్లనాదర
మును దోఁచెడిరీతిఁ బల్కె మురరిపు తోడన్. 45

క. రారాని దారి వచ్చితి
వేరా వెరపింప రానిదేరా వలపిం
పేరమణి చూఱగొనె నీ
వారమణింగూడఁ బోవరా యిది మేరా? 46

క. ఏరా నన్నిట్లెంచెద
వేరా పెడదారివచ్చె దేరా యిటు రా
కూరిమిఁగలవా రచ్చట
లేరా పోరాట మాడలేరా పోరా! 47

క. మూరాడకు మీ నాతోఁ
బోరాడకు నిన్ను నమ్మఁబోల దిచటనన్
దూరాడకు మోమోడక
తూరాడకు మిచ్చకమునఁ దూగాడకుమీ! 48

క. అని యిట్లనేక వరుసల
వనధీశకుమారి శౌరి వాక్పారుష్యం
బునఁ బెనఁగ, విని సఖీమణు
లను నయ వాక్యములు బల్కి రంబుధి సుతతోఁ 49

క. కాంతా కాంతుని తోడుత
రంతేటికిఁ జాలుఁజాలు రావమ్మ యటం
చింతులు బోధించిన తలు
పంత గిరుక్కున వదల్చ నవ్విభుఁడంతన్ 50

ఉ. పంతమిదేటికంచు బలవంతమునన్ సతికొంగువట్టి గి
ల్గింతలు సేయుచున్ మదన కేళిఁగరంచి కవుంగలించిలోఁ
జింతఁ దొలంగునట్లుల వచించెఁ గృపామతి గారవించి శ్రీ
కాంతుఁడనంతశయ్యను సుఖస్థితి నిద్దురఁ జెందు వేడుకన్. 51

ఉ. అంతట మేలుకాంచి పురమంత నలంకరణంబు సేయ సా
మంతుల వైష్ణవోత్తముల మంత్రుల విప్రుల భక్తదాస కా
ర్తాంతిక వీరభృత్య నివహంబులకుందగ నానతీయ వా
రంత మహాప్రసాదమని యాజ్ఞ వహించి తదీయ పద్ధతిన్. 52

ఉ. వేంకట వేదశైల పురవీధుల వాడల రచ్చ పట్ల నే
ణాంక శిలావిఘట్టిత సురాలయవాటుల రత్నతోరణా
లంకరణంబుఁజేసి చదలంబొరలాడఁ బటంబులెత్తియున్
సాంకవగంధసిక్తముగఁ జల్లిరి కల్వడముల్ రయంబునన్. 53

గీ. బాలవేంకట నరసింహ పతివివాహ
మంగళోత్సవమని దేవమందిరాంగ
ణముల భేరిముఖాది వాద్యములొనర్చి
స్వామికృప సంభ్రమ మొనర్పఁ జాఁగిరంత. 54

గీ. రమణులంతట జతగూడి రాజరత్న
ఘటిత సాధోపరిస్థలిఁ గనకపీఠి
యందు సొంపొంద శబరరాకేందువదన
నునిచి జయమంగళంబని మనములలర. 55

గీ. చెలఁగి శ్రీ వైష్ణవాంగనల్ జేరిద్రవిడ
భాషచేఁ బాటఁబాడుచుఁ బ్రౌఢవచన
రచనలొప్పార నివ్వాళి రహినొసంగి
సతి శిరోమధ్యమున శుభాక్షతములునిచి. 56

గీ. చంద్ర సంకాశముఖి కొక్క చందనాంగి
శిరము సంపంగినూనంటి కురులుదువ్వెఁ
బుష్పమంజరి యొక్కర్తు పొలఁతిమేనఁ
గడఁగి రయమునఁ జందన గంధమలఁదె. 57

గీ. కాంతకరములయందుఁ బ్రకాశమొందు
గంధ జలయుక్తమగు పూర్ణకలశయుగముఁ
జూడ నొప్పారెఁ జెంమురా చూలిచన్నుఁ
గవకుఁదానోడి నీళ్లీయఁగడఁగు కరణి. 58

చ. సరసిజ గంధి క త్తఁటినిఁజల్లనిగంధ జలంబు మజ్జనం
బురవడి సల్పె నొక్కరుచిరోత్పలపత్రదళాక్షియొక్క బి
త్తరి తగ ధౌతచేలమురయంబున గాత్రమునన్ ఘటించెఁదాఁ
గురులు నఖాగ్రముల్ జొనిపి కోమలియొక్కతె చిక్కుడల్చినన్. 59

ఆ. నెరుల తడులిగిర్చి నెర్పైనయగరుధూ
పంబు పెట్టె నొక్కపడఁతిభక్తి
నిలువుటద్ద మునిచెనెలఁతుక యొక్కర్తు
తాళవృంతమొక్క తరుణివీచె. 60

క. కమనీయ నూత్ననవర
త్నమయ స్థగితోరు పీఠతట మధ్యమునం
గమలాక్షి నునిచి ప్రేమన్
రమణులు భూషణములునుప రాజిల్లిరొగిన్. 61

క. వనజాయతాక్షి కంఠం
బునముక్తాహార మొక్కపాలఁతి ఘటించెన్
ఘనరత్నకుండలంబులు
మనమలరఁగఁ జెవులనొక్క మానినికూర్చెన్. 62

క. బంగారందెలు పదముల
శృంగారముగాఁగఁ దొడిఁగి చెలియొక్కతె భి
ల్లాంగనకు వేణిపైనిడె
రంగుగముత్యాల నొక్కరమణి విదిల్చెన్. 63

ఉ. పంకరుహాయ తాక్షి నునుఫాలతటంబునఁ జేరుచుక్క ని
శ్శంకమతిఁఘటించెనొక చందనగంధి నితంబపాళి పైఁ
బొంకముగాఁగ నిల్పెమణిపుంజనిబద్ధ సువర్ణకాంచి కే
ణాంకసమాస్య యొర్తు వినయాంచితభక్తి విశేషసంపదః. 64

గీ. లలితబింబోష్ఠి వాలుఁగన్నొలుకులందుఁ
దీర్చెఁ గజ్జల రేఖలు తెఱవయొకతె
యువితనరుఁ బాంథగణముపై నతనుఁడేయు
ఘనవినీలోత్పలాంబక కాంతులనఁగ. 65

క. చంచలనేత్రిపదంబుల
నుంచెః బంగారుపావలొప్పుగ నొకరా
యంచగమనవ్రేళ్ళను బిగి
యుంచెః సతియొర్తు మట్టె లిరుగడలందుః 66

గీ. పంకజాతాక్షి సునుఁ(వేళ్లఁ బొంక మొప్ప
హీరమయముద్రికలు వే ఘటించెనొకతె
కాంత కరదివ్యపాదప స్కంధశిఖర
మందుఁ జెన్నారు పూగుత్తిచందమునను. 67

గీ. తిలకమిడెఁ గమ్మకస్తురి తెఱవయొకతె
శిశిరకిరణాస్య భ్రూమధ్యసీమ నెసఁగ
నది తనరె ఫాలమదన శరాసనస్థ
నీల కువలాంబకము రీతి నెరవుగాను. 68

గీ. పూర్ణచంద్రాస్య కుచములఁ బొలఁతి యోర్తు
మృగమదంబునఁ బత్రికల్ దగ ఘటించెఁ
బద్మదళనేత్రి కేంగేల బాగు మీఱఁ
బడఁతి యొక్కర్తు పోచీలు పదిలపఱచె. 69

క. బంగార మందు మగ రా
లం గూర్చిన కంకణముల లలన కరములం
దుంగలికి యోర్తు కూర్చెఁ గు
రంగ విలోచన మనంబు రంజిల్లంగన్ 70

గీ. కలికి కమనీయ ఫాలభాగంబు నందుఁ
గుంకుమపుఁ జుక్కవడిఁ దీర్చెఁ గొమ్మ యొకతె
వేణిపైఁ జిన్ని నెలపువ్వుఁ వేడ్కలలరఁ
బొందుగను గూర్చెఁ జిగురాకుబోఁడి యొకతె. 71

చ. సకియకు ఫాలభాగమునఁ జారుసువర్ణమయంపు మేలి బా
సిక మొక నీలవేణి తగఁ జేర్చెను నాభికయందుఁ గప్పురం
బొక నలినాయతాస్య యిడె నుజ్జ్వలబాణముఁ జేతికిచ్చె నొ
క్కకనక సూనగంధి కడుఁ గౌతుక మొప్పఁగ శాస్త్రపద్ధతిన్. 72

గీ. ఇట్లు కళ్యాణ శృంగార మెలమిఁజేసి
చెంచురామించుబోఁడి నచ్చంచలాక్షు
లెల్ల రతనంపు గద్దెపై నల్లనునిచి
కలికి పలుకులఁగులుకుచు నిలిచిరంత. 73

సీ. వలిపె పయ్యెదలోని లలితంపుఁ బతకంబు
గబ్బిచన్నులతోడఁ గంతులిడఁగఁ
గమనీయ గండభాగములపై హురుముంజి
ముత్యాలకమ్మలు మురువుఁజూపం
బసగుల్కు హొయలు నెన్నొసలిపై ముంగురుల్
కసిమసంగుచు నిండ ముసుఁగువార
మాటిమాటికిఁగేలి మహితకంకణ ఝణం
ఝణలు వీనులగిల్కు సొరుఁదెలుప

గీ. వాలుఁ గన్నులు సెఱిచూపు వగలు దెలుప
ముద్దుపలుకులు బలుకుచు ముదితయొకతె
కమ్మ సంపఁగినూనెఁ జొక్కముగఁబూని
శ్రీ నృసింహుని శిరమంటెఁ జిత్రముగను. 74

చ. అతివయొకర్తు వేదకుధరాలయు దీర్ఘ శిరోరుహంబులం
చితగతివాఁడి గోళ్లనిచి చిక్కులు వాయఁగఁజేసెఁ జందనం
బతికుతు కేచ్చ నొక్క చెలియంగములందు నలంది నల్చెనా
క్కతలిరుబోఁడి స్వర్ణఘట కాండపరంపర నింపె నింపుగన్. 75

క. మదిరాయతాక్షి యొక్కతె
ముదమొప్పగ ధౌతచేలమునఁ దడియార్చెన్,
ఎదుట నగురు ధూపమ్మిడె
సదయతనొకలేమశంఖ చక్రాంకునకున్ 76

గీ. మించుటద్దముఁ జేపట్టె మెలఁతయొకతె
పూవువీవనచే వీచెఁ బొలఁతియోర్తు
రత్నహారతులిడె నొక్క రాజవదన
వేదగిరివాసి మ్రోల నవ్వేళహోళి. 77

గీ. నెన్నొసట బాసికముఁగట్టె నెలఁత యోర్తు
రత్నకీలిత కోటీరరాజమొక్క
యలినికరవేణి శిరమునందవుసు మీఱ
నుంచె శేషాహిశయనున కొప్పుమీఱ. 78

గీ. మణిమయంబగు ముద్రికల్ మగువయొకతె
యహిపశయను కరాగ్రంబు నందునునిచె
నొక్క చిగురాకు బోఁడియు ముక్కువగను
బసిఁడి పావలుదవిలించెఁ బదములందు. 79

ఉ. హెచ్చినవేడ్కతోడనొక యిందునిభాననరత్నకంకణం
బచ్చు పడంగ పేదకుధరాలయు కేలఘటించెఁ బచ్చడాల్
కచ్చుల పట్టుదువ్వలువకంజదళేక్షణ యొర్తుమేనిపైం
జెచ్చెరఁ జేర్చెనొక్కచెలి చెక్కునఁగాటుక చుక్క నేర్పునన్. 80

గీ. రాజబింబాస్య యొక్కతె తేజమెసఁగ
గర్ణముల ముత్తియంపుఁ గొకట్ల నునిచె
మంజులాధరి యొక్తర్తు మవ్వములగు
పూలదండలు మెడ పైచె లీలఁ బతికి. 81

గీ. పల్లవాధరి యొక్కర్తు పతికిఁ గమ్మ
కప్పురపుఁ దమ్మలం బిచ్చెఁ గలికి యొకతె
హొయలుగుల్కకడాని బా కొరయఁ బార్శ్వ
భాగమునఁ గమ్మపట్టె నొప్పంగఁ గట్టె. 82

గీ. మురవిరోధి వక్షస్థలమున ఘటించెఁ
గౌస్తుభంబుల హవుసుగాఁ గలికి యొర్తు
కోమలతరైక గంధంపుఁ గుసుమ మాల
కంధరంబునఁ దవిలించెఁ గాంత యొకతె. 83

క. చిగురాకు బోఁడి యొక్కతె
నగధరునకు మృగమదంపు నామము దిద్దెన్
సొగసైన ఫాలతటమున
నిగనిగలను దళుకు లెసఁగ నేరుపుమీఱన్. 84

క. ఇవ్విధమున శృంగారం
బవ్వనజాక్షునకుఁ జేయ నంతఁ బెరిమతో
నవ్విభునా నతి వాహన
మవ్వేలఁదులు దెచ్చినిలుప హర్షము తోడన్. 85

## వేంకటేశ్వరుఁడు చెంచుకన్యతో నూరేగుట

ఆ. నిరుపమానమైన గరుడవాహన మెక్కి
శ్రీ నృసింహభర్త చెలియతోడఁ
దివిరి నిశ్చయించెఁ దిరువీధు లేగంగ
నుల్లమందుఁ గోర్కెలుల్లసిల్ల. 86

సీ. మహనీయ మౌక్తిక మాలికాపరివృత
ఛత్రంబు లిరుగడసరవిఁబట్ట
మణిమయస్థాపిత మహితనేత్రమ్ములఁ
బరిచారకులు బరాబరులు సేయ
ఘనసారమిళిత నూతన దీపికా శ్రేణి
తమసంబడంచు నాతపముగాఁగ
నిశితాశిగణ సంజనిత రుక్కదంబంబు
మెలఁగువారికి మిరుమిట్లుదోఁప

గీ. వివిధ వాద్యవితానంబు విస్తరిల్ల
బహుళ మాగధసంస్తుతి పటలమమర
బాలనరసింహ దేవుండు లీలతోడఁ
జెలఁగి తిరువీధులందు వేంచేయునపుడు. 87

ఉ. అంతకు మున్న వైష్ణవకులాగ్రణులెల్లరుఁ బాదచారులై
చెంతల గంధతైలకృత చిత్రవినూతన దీపికాళి య
త్యంతవిభూతితోఁ గరములందు వెలుంగఁగ మెల్లమెల్ల వ
ర్తింతురు బారుకట్టి యువతీవృతులై శిశువృద్ధులాదిగాన్. 88

గీ. వైష్ణవస్త్రీలు గొందఱు వరుసఁగూడి
ముత్తియమ్ముల సేసలు ముదముతోడ
శ్రీ నృసింహుని మేనిపైఁ జెలఁగివెల్లి
జల్లుదురు మాటిమాటికి సంభ్రమమున. 89

క. సురరాజముఖ్య నిర్జర
గురు నూతన రత్న ఖచిత కోటీరమణుల్

నెఱి నీరాజనము లగున్
ధరణీ ధర గోత్ర గుహవదన చంద్రునకున్. 90

సీ. ఒకచోటను మృదంగ నికర ధ్వని చెలంగ
నొకచెంత సంగీత ముల్లసిల్ల
నొకమూల ద్రావిళం బకలంకమతిఁదెల్ప
నొకవంక సేవకానికర మొరయ
నొకవీధి భరతజ్ఞ నికరంబు నటియింప
నొకపాళిఁ గానుకలుక్కుమిగుల
నొకపజ్క్తి హయపజ్క్తి యురుజవంబునెసంగ
నొకతల జోహారులుప్పతిల్ల

గీ. నొక్కవైపునఁ గరిబృంహితోత్కటంబు
నొక్కమెలవున వాహినులొనరఁగొలువ
నొక్కవంకను నిగమమంత్రోదితంబు
నగుచుఁదనరారెఁ దిరువీధి యానమపుడు. 91

ఉ. బిత్తరు లిద్దఱిద్దఱును బెస్తలునై జతగూడి బల్లలం
గుత్తుక పజ్జలందునిడికొంచుఁజనంగను వారిమీఁదమేల్
తత్తధిమి ద్ధిమిధ్వనులు తథ్యముగాఁ బ్రకటింపఁ జేయఁగా
నత్తఱి నాటవారు నుపయంత్రపు బొమ్మలు నాట్యమాడెడిన్. 92

గీ. అమల నవరత్న మాలికాయతసహస్ర
కోటి ఘనచామరంబులు కువలయాక్షు
లెలమిఁగైకొని వీచుచు నిరుగడలను
జేరి కొలువంగ నొప్పునా శ్రీధరుండు. 93

చ. నెఱినిజ గేహవాటి కవనీధ్ర ధరుండరుదేర హస్త భా
స్వర తరకుంభసంభరిత సజ్జలసిక్తముఁ జేసి పాదపం
కరుహము నిచ్చమ్రొక్కఁ గరకాండములన్ ముకుళించికీర్తనల్
హరువుగ భ క్తిసల్పి మణిహారతులిత్తురు వైష్ణవాంగనల్. 94

సీ. వాసుదేవాయ సత్త్వ గుణప్రధానాయ
భర్గ మిత్రాయ తుభ్యంనమోస్తు
సకలలోకేశాయ శాశ్వతైశ్వర్యాయ
భక్తలోలాయ తుభ్యంనమోస్తు
దైత్యాంతకాయ చిదానందరూపాయ
పద్మనాభాయ తుభ్యంనమోస్తు
భుజగేంద్ర శయనాయ గజరాజరక్షాయ
పరమకృపాయ తుభ్యంనమోస్తు

గీ. పక్షిరాడ్గమనాయ తుభ్యంనమోస్తు
పద్మభవవందితాయ తుభ్యంనమోస్త
టంచు నరసింహగోపాలు నాత్మఁగోరి
ధరణిఁ జాఁగిలఁ బడుదురు దాసవరులు. 95

గీ. నెమలికుంచెలు చేఁబట్టి నింగికెగిరి
దాఁటుచుందురు దాసాను దాసవరులు
సిగిణుల విండ్లఁ బూవులు చెలఁగి నిగుఁడ
జేయుచుండెద రవ్వేటి చిఱు చిఱుతజనము. 96

గీ. భామినీమణి యొక్కతె చామరంబుఁ
బడఁతి యొక్కర్తు పదియాఱు పసిఁడిగొడుగుఁ
బూర్ణచంద్రాస్య యోర్తు తాంబూలపేటి
దర్పణంబొక్కచెలి బట్టి తగిలి నడువ. 97

ఆ. ద్రాక్ష కదళి శర్క రేక్షు రసాదులు
గడియకొక్కమారు గరుడగమను
నారగింపఁజేసి యవసరనైవేద్య
ములునొసంగు వైష్ణవులకుఁ బెద్ద. 98

సీ. విమలరత్నప్రభల్ వెలిబర్వుముద్రికా
యుక్తాంగుళలఁ జూపు లొప్పఁగొలిపి

యిందీవరంబున కెచ్చైన నేత్రద్వ
యంబుపైఁ జిత్తాబ్జ మమరఁ జేర్చి
యకలంక మానసంబందుఁ దోడ్తోడుత
శృంగార భావంబుఁ జెలఁగి నిలిపి
యింపైన భావాబ్ధి పెంపుతుంపెస లాడ
మాట మాట రసంబుఁ దేటపఱచి

గీ. సలలితంబైన భరత శాస్త్రంబురీతిఁ
బాత్రపద ఘట్టితోద్భవ బహులరవము
నానన ద్వార సంభవాలాపములుగఁ
గడఁగి నటియించెఁ దిరువీధిఁ గమనవేళ. 99

గీ. నోట నేమాట మెలఁగెడునోతదీయ
మంజుభాషలు పాదపద్మములఁ దెలిపె
నొక్క గణికా కులోత్తమ మురగశయను
గమనమందునఁ దిరువీధిఁ గౌతుకమున. 100

మ. గురువక్షోజయుగంబు గంతులిడఁగాఁ గ్రొమ్మేని డాల్ చీర్పై
నెఱిఁ గన్పట్టఁగఁ గౌనులేవ నొకవేణిభారముం దూఁగఁగాఁ
గరసత్కంకణరావముల్ జెలఁగఁగాంచీ లసద్ఘంటికల్
మొరయంగా నొకవారకామిని జనుల్ మోదించ నర్తించెఁదాఁ. 101

సీ. తాటంక సంయుక్త తరళముక్తారుచు
లద్దంపుఁ జెక్కులందందుఁబర్వఁ
గనకకీలితరత్న కటకఝుణంఝుణల్
కాంచీధ్వనులఁ గూడి కలిసిచెలఁగ
హెచ్చైన సజ్జాతి హీరంపు ముక్కర
చిన్ని మోమునఁ గాంతిచెలువుఁదెలుప
నుదుటైనగుబ్బల కుపరియైఁ దోడ్తోడఁ
గమనీయహారాళి గంతులిడఁగ

గీ. లలిత మంజీర రావంబు గిలువరింపఁ
దెలుపు వాక్కులు ధీంధత్తధీంకృతులన

మధ్య మల్లలనాడ నెమ్మొహొరంగు
చీరపైఁ జిమ్మ నర్తించెఁ జెలియొకర్తు. 102

క. ఒక మదభృంగాలక తకు
తకు ధికు దీంధత్త తకిట తక్కిటక ఝణం
ఝుకు ఝుకు తైతత్తాయని
యకలంక మనంబుతోడ నాడెనపుడొగిః. 103

ఆ. తకట గికట తకిట తకగిట దకిటద్ధి
మిద్ధిమిం ఝళాది మృదులశబ్ద
నటనమాడెనొక్క నారీశిరోమణి
చెలఁగి నృహరి వీధిసేవ యందు. 104

చ. సకలవిదేశవాసులును సంభ్రమమొప్పఁగఁ గానుకల్ కర
ప్రకరములందుఁ బట్టి యిరుపజ్జల నిల్చిన వారిఁగాంచి వీ
రు కురుకళింగ మాళవ కరూశ నివాసులటంచు సారెసా
రెకు హరిసన్నిధిందెలిపి ప్రీతిగ్రహింతురు వైష్ణవోత్తముల్. 105

ఉ. రచ్చలు వీధు లంగడులు రాజపథంబులుదాఁటి వేగమై
వచ్చెడి గారుడధ్వజుని వైష్ణవముఖ్యసమస్తజాతులం
జెచ్చరఁగాంచి భక్తిఁగడుఁ జేతులు మోడ్చి మహానివేదనల్
దెచ్చి నిజాభిధానములు దెల్పి సమర్పణఁ జేతురంతటన్. 106

రగడ. లలితంపు పచ్చరాల బెడంగు ఛత్రములు
తులలేని రత్నకాంతులమించు వేత్రములుఁ
గనకకుడ్యనిబద్ధ ఘనదర్పణంబులును
గనదురునికాయ మార్గస్థజాలంబులును
మురజధ్వనులఁ జొక్కి పొల్పగుమయూరములు
వరగృహద్వారములు వాదించు కీరములు
నలరు దండలనొప్పు హవుసుగుమ్మములును
చెలువైన కీల్బొమ్మ చిత్రవాద్యమ్ములును
రంగు నెలరాల్గుంపు రహిమించు వేదికలు
శృంగారమగు పూగ చిత్రంపువాటికలుఁ

గెంపు రాల్జెక్కిన కీల్కొ వాటమ్ములును
నింపైనపాటచే నెసఁగు జనమ్ములును
నున్నతస్తంభస్థితోరు ధ్వజంబులును
జెన్నైన కపురంపుఁ జిత్రంపు ముగ్గులును
జలువైన నీరు వెదజల్లు జలయంత్రములుఁ
జెలువైన పన్నీరుఁ జిలికించు చిత్రములు
సరిలేని గరుడపచ్చల తోరణమ్ములును
బురజనంబులకు నబ్బుర మయ్యెనిలను. 107

వ. ఇవ్విధంబునం దిరువీధిగమనోత్సవంబొనరించి రాజమందిర ద్వారంబుఁ బ్రవేశించి యనంతవైభవంబున ననంతవైరి వాహనోత్తరణం బాచరించి శ్రీవైష్ణవ పుణ్యాంగనా కరావలంబిత కర్పూర నీరాజన సహస్రంబు లంగీకరించి కరదీపికా సహస్రంబులు వెలుంగ భిల్లకన్యకా తిలకంబు తోడంగూడి మంద మందగమనంబున సమస్థల సంస్థాపిత కదళీకాండంబును, నవీనముక్తాఫల రచితరంగ వల్లీమతల్లికా రుచిరంబును శ్రీ గంధ కర్పూర కస్తూరి కాగరు సమస్త వస్తు సంభరితంబును, కోమల చూతపల్లవ సత్ఫలేక్షు శుభాక్షత కుసుమ విసర శోభన పదార్థ సంభరితంబును నగు తిరుకళ్యాణ మంటపంబున కరుగునంతఁ దత్సమయంబున వజ్రధర వహ్ని వైవస్వతవాసవారి వరుణ వాయు వైశ్రవణ వామదేవ వారిజాసన వసుముఖామర గణంబులును, కలహాశన కణ్వ గాధేయ గర్గ వసిష్ఠ వామదేవ వల్మీక సంభవ శుకశౌనక వ్యాస ప్రముఖ సంయమి నివహంబును, దద్దివ్య గృహాంతరంబున కేతెంచి యమ్ముకుంద చరణారవిందంబులకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి తదీయ దివ్య నామస్తవంబాచరించి యన్నర సింహదేవు నానతి నుచితస్థలంబుల నుండిరంత. 108

క. చేరెను లగ్నం బని యా
వారి జ గర్భాది దేవ వర్గము దెలుపన్
నారదు పనుపున వైష్ణవ
నారీమణు లపుడు ప్రీతి నయమలరారన్. 109

## వేంకటేశ్వర వివాహము

గీ. బాల వేంకట నరసింహ పంకజాక్షు
పాద పద్మంబు లబ్బిల్ల పద్మగంధి
చరణ యుగళంబు పైనుంచి సప్తపదము
లెలమిఁ ద్రొక్కించి రప్డు రాకేందు ముఖులు. 110

గీ. తరుణు లప్పుడు దంపతీ కరములందుఁ
దమలపాకులచేఁ గంకణములు గట్టి
చెలంగి హరిపాణి తలమునఁ జెంచులేమ
కేలుఁ గీలించి రప్పుడు వేడుకలర. 111

ఆ. వేదగిరి నివాసి విధి యుక్త వైష్ణవ
హస్త దత్తమైన యమలమధువుఁ
బారణం బొనర్చె భావి భిల్లాంగనా
ధరసుధారసంబుఁ ద్రావునట్లు. 112

మ. హరిఫాలాక్ష వసిష్ఠ నారదవిధుల్ హర్షింప స్వారాట్సతీ
సరసీ జాత భవాంగనామర వధూశ్మా భృత్సుతారుంధతీ
కరసంస్పర్శయొనర్చి వైష్ణవుఁడొసంగం జక్రి గట్టెన్ శుభో
త్కరతన్ మంగళసూత్రమింపెనయఁ గాంతా కంఠదేశంబునన్. 113

గీ. సుర సురజ్యేష్ఠ సురమౌని పరమయోగి
వరులులగ్నాష్టకముల నత్తఱిఁబఠింపఁ
జేడియులు పెండ్లిపాటలు పాడఁజెంచు
పడఁతి శిరమున హరి తలంబ్రాలునించె. 114

క. వినయఁబునఁగలకంఠీ
కనకాంగులు భిల్ల కన్యకాతిలకముతో
డను గూడి చక్రి మూర్ధం
బున నింపిరి మౌక్తికములు ముదమలరారన్. 115

గీ. కలికి తలంబ్రాలు బోసెడి కాలమందు
గనక హీరంపు బాసికంబున వధూటి
ప్రతిఫలించిన గంగాస్వభావమైన
చంద్రశేఖరుఁడనఁ బొల్చెఁ జక్రధరుఁడు. 116

సీ. ముఖచంద్ర మండలంబున జారుపేళలఁ
దారకంబుల రీతిఁ దనరియుండుఁ
గమనీయ గళశంఖ గళితంబు లైనపు
డాణి ముత్యంబుల హవుసుఁదెలుపుఁ
దనువల్లిదిగజారు తఱిఁజూడఁ బరిపక్వ
కోరకంబులభాతిఁ గొమరుమిగులుఁ
గబరీఘనంబుపైఁ గనుపట్టునెడలను
జలబిందువులమాడ్కిఁ జెలువుఁగాంచు

గీ. జఘన వేదికపైఁ దోఁచు సమయమందు
రంగవల్లీ మతల్లికా రాజిసెసఁగు
సురుచిరస్ఫూర్తిఁ బొలుపారు హరికరాంబు
జాంచిత సితోరుభవ్య నవ్యాక్షతములు. 117

మ. కర సత్కంకణ నిస్వనంబెసఁగఁగాఁ గాంచీలసద్ఘంటికల్
మొరయన్ గుబ్బలు రాయిడింపనొసలన్ ముంగుర్లు నర్తింప హో
రరుచుల్ బయ్యదఁ బిక్కటిల్లి పెలికిన్ రాణింపఁగా వైష్ణవుల్
గఱపన్ లాజలు వహ్నిపేల్చెను శరత్కంజాతపత్రాక్షి తాన్. 118

సీ. కరసరోజంబులఁ గన్పట్టునప్పుడు
కటకశక్రోపల కాంతిఁజెందు
నునుకౌను దీగెపైఁ గొనసాగు నయ్యెడ
ఘనరోమరాజి పైఖరిఁ దనర్చు
గుబ్బచన్నులమీఁదఁ గొమరారు నత్తఱిఁ
గస్తూరి పత్రరేఖలవిదిర్చు
నెఱిమించు కనుదోయిఁ జొఱఁ బాఱునవ్వేళ
బొందైన కాటుక పోల్కిఁదనరు

గీ. శ్రవణముల యందుఁ బ్రసరించు సమయమందు
ఘన తమాల దళచ్ఛాయ గరిమనొప్పు
నిటలమునఁదోఁచు నెడలఁ బెన్నెరులఁబొల్పు
లాజహోమంబు శిఖిధూమ రాజిఁజూడ 119

క. కరమును రక్తిని వైశ్వా
నరునకు నప్పుడు ప్రదక్షిణముఁ జేసిరి య
త్తఱి ధ్రువుఁగాంచిరియంతట
నరుంధతినిఁ గనిరి పేద్ద లలరారంగన్. 120

గీ. దంపతులు నిట్లు వైవాహ సరణిఁదీర్చి
యఖిల జనులకు భోజనావాప్తిఁజేయఁ
గరము వెసఁబ్రీతి వైష్ణవాగ్రణులఁబిలిచి
చెప్పి పుత్తేర వారును శీఘ్రముగను. 121

గీ. మందిరాంగణ భూముల మగువలపుడు
క్రొత్తపన్నీరుఁ జిలికించి కొమరు మిగుల
ముగ్గులిడి పైఁడి పళ్ళెరంబులనుగడిగి
ఘనమహానస శాలలో నునిచి రెలమి. 122

గీ. కొంద ఱలినీల వేణులు పొందుపఱచి
రంచితక్షౌమ కౌశేయ కాదివస్త్ర
ములు వినూత్న చిత్రాస నంబులునురత్న
ఖచిత పాత్రలు నునిచిరి కౌతుకమున. 123

క. నీలాల పళ్లెరంబుల
బాలా మణులపుడు సన్న బాలపుటోరెం
జోలినిడి దుంపకూరలు
జాలిడ నవితనరు బుక్షశశధరులనఁగన్. 124

సీ. కలితాతిరస మోదకవ్రాత గోధూమ
శర్కరా పూప భక్ష్యములతోడ
వరపాయసాన్న సూపప్రోక్త పులిహోర
దధ్యోదన ప్రసాదముల తోడఁ

గమలా రసాల ద్రాక్షారామ ఖర్జూర
సరళ రంభాఫలోత్కరముతోడ
దధిపయఃపూరాద్య మధులవణాజ్యేక్షు
జలతిక్త కటురసావళులతోడ

గీ. సరస రుచిరంపు కమ్మపచ్చళులతోడ
నింపు మిరియంపు కూరల గుంపుతోడ
బాల వేంకటనరసింహ పతి వివాహ
భోజనంబొప్పె జనమనఃపూరితముగ. 125

గీ. పచ్చరతనంపుఁ గనకంపుఁ బళ్ళెరమున
మెచ్చుముచ్చటఁ జెంచుక్రొమ్మించు బోఁడి
తోడఁగూడి భుజించె సంతోషకలన
వేడ్క నరసింహ దేవుఁడవ్వేళయందు. 126

ఉ. పంకజగంధు లత్తఱిని బంగరుపళ్ళెములర్థిఁదెచ్చి యే
ణాంకశిలాకృతస్థలములందిడి వడ్డన సేయబంతిలోఁ
గొంకక వారయాత్రికులు గూడి భుజించి రభీష్టభోజ్యముల్
వేంకటనారసింహ పృథివీధరధారి యనుగ్రహంబునన్. 127

గీ. గాత్రచంచల లురువచోగర్జనములుఁ
దత ఫలవ్రాత కరకాళి ఘృతజలంబు
గంధ పవనంబునగుచు వేంకటనృసింహ
పరిణయపుభోజనము తొలకరియు నయ్యె. 128

గీ. క్రముక కర్పూర కస్తూరికాలవంగ
శుక్తిభవచూర్ణ గంధసంయుక్తమైన
పండుటాకుల పట్టియల్ పడఁతు లప్పు
డందఱికిఁదెచ్చి యిచ్చి రానంద మలర. 129

వ. అయ్యవసరంబునఁ బుండరీకాక్షుం డానంద కందళితాంత రం
గుండై శతానంద శంకర పురందరాది బృందారక బృందంబులను
నారద వసిష్ఠ కణ్వ గాధేయ గౌతమాది సంయమి ప్రకరంబులను

చోళమాళవనేపాళ ద్రవిళ కర్ణాట లాటకళింగాది భూపాలవర్గం బులను గనుంగొని మంద మంద వచనసుధారసధారల మహానం దంబు నొందించి నిజ మందిరంబుల కరుగుట కాజ్ఞాపించిన వార లద్దేవదేవుని పద పద్మంబుల కెఱఁగి, తదీయ దివ్యమంగళస్తవం బొనరించి వీడ్కొని నిజమందిరంబుల కరిగి రనంతరం బాయనంత శయను నిజ మనోరథం బెఱింగి శిల్పకళానిపుణుండగు విశ్వకర్మ చనుదెంచి తదీయాను మతంబునఁ గేళికాసౌధంబలంకరించె నందు. 130

సీ. వలిపెంపు మల్లెగుత్తుల పందిరొకచోట
నొకచోట వీణారవోజ్జ్వలంబుఁ
గలికిరాపచ్చ బంగరు టుయ్యె లొకచోట
నొకచోట శ్రీచంద నోత్కరంబుఁ
జెలువైనపన్నీటి జలయంత్ర మొకచోట
నొకచోట మదమరాళోదితంబుఁ
దళుకు బళ్కెంపు నిద్దపుటద్ద మొకచోట
నొకచోట శారికా శుకరవంబు

గీ. మిసిమిఁ గుల్కుపదార్వన్నె పసిఁడిగోడఁ
జెక్కుపాంచాలికాతండ మొక్కచోటఁ
జారుచంద్రోపలస్తంభ హీరకాంతు
లుప్పతిల్లెడి తెల్వన్నె లొక్కచోట. 131

సీ. గాధేయుఁడమరేంద్ర గణికాలలామంబు
పైఁ గన్ను వేసిన ప్రల్లదనము
వ్రేపల్లెలోఁ జిన్ని వెన్నుఁ డర్మిలిగొల్ల
చిగురుబోండ్లఁ గలంచు చిన్నతనము
వనవీధియందు శంతనరాజు సురసరి
ద్రమణిఁ గూడినయట్టి రంతుతనము
సిరులిచ్చు నన్నన్న గురునిపట్టపురాణి
మరులుకొల్పినటించు పరుసుదనము

గీ. దారుకాటవిదారిలోఁ దారి మాని
దారలనుగోరిపలుమాఱు మారుబారిఁ
గూరికేరు పురారి బేజారితనము
లందమిగురొత్తఁజేసె నయ్యంతికమున. 132

ఉ. హెచ్చినవేడ్కతోడ రచియించిరి నిద్దపుగోడలందు ల
క్కచ్చుపడంగఁ జిత్రగతి నచ్చపు బంధవిశేషపద్ధతుల్
జెచ్చెరఁగూఁడుగొన్ని యెదఁ జేరిచి నాథులఁగూర్చుకొంచుఁదా
గ్రుచ్చికవుంగిలించుకొని కొన్ని మనుష్యమృగేంద్రరూపముల్. 133

సీ. సకియతోఁ బెడమర్లి సల్లాపమాడెడి
యలరువిల్తుని దేహ మమరవ్రాసి
కొమరొప్పఁగారతి కుచయుగంబున కోర
గిలెడి మన్మథరూప మెలమివ్రాసి
చౌసీతిబంధన శ్రమకుల్కి పడుకల్కి
కేలూఁదు కందర్పు లీలవ్రాసి
భ్రాజిష్ణుఁడై జగత్త్రయము గెల్వఁగఁబోవు
మధుసూద నాత్మజు మహిమవ్రాసి

గీ. వెలయు శుక పిక శారికా వీరభటశ
తంబు లిరుగడ నిలువమాధవముఖాది
దండనాథులు గొల్వఁ గొల్వుండు మరుని
చక్కదనమెంచి వ్రాసె నుత్సవము గాఁగ. 134

గీ. తేఁటరతనాల పెట్టెలో దినదినమ్ము
జిలిబిలిగ దుగతిగ రాగములు మనోహ
రంబుగాఁబాడుచుండ వజ్రంపుకీలు
కుందనపు బొమ్మలందందఁ గొమరుమిగులు. 135

ఉ. మేటి విటంకభాగముల మించినవేడ్కఁ గుటుంబయుక్తులై
పాటిగ జాతివాక్యములు పల్కుచుఁ బావురముల్ చెలంగెరాట్
పాటలగంధగంధులకుఁ బంకరుహాంబక శాస్త్రముల్ నిరా
ఘాటముఁగాఁగ దెల్పెడి యగణ్యకళా గురుమూర్తులో యనన్. 136

క. బంగరు నీటవిగారపు
రంగుపవిన్ వ్రాయునట్టి రతిపతివిద్యా
భంగప్రసంగ మెలమిఁ జె
లంగెడి బల్పందు వాల్పెడంగమరునటన్. 137

వ. మఱియు మరకత పద్మ రాగ మణి స్తంభ వలభిద్వారకవాట దేహ
ళీవిరాజితంబును, చంద్రకాంతస్థగిత సోపానమార్గ శోభితంబును,
మహేంద్రనీలజాలక రంధ్రవినిర్గత పారిజాతప్రసూన పరిమళమిళిత
నవీనగంధవహ బంధురంబును, హాటకకుడ్య ప్రకీలిత ముకురావ
ళ్యాన్యోన్య ముఖాంభోజాత వీక్షావిలాస బంధురంబును, విలంబమా
నముక్తా ఫల వకులమల్లికా పాటలప్రముఖ తరుకుసుమ మాలికాభి
రామంబును, గంధకర్పూర కస్తూరి కాగరు ధూపవిరాజమానంబును,
నవరత్నఖచిత హంసతూలికా తల్పవిచిత్రంబును, శరచ్చంద్రచంద్రికా
విడంబిత ధవళదుకూల వికరప్రకాశితంబును, గనకకలశమణిద
ర్పణ తాలవృంతతాంబూలపేటికా కళాచీవికురుంబంబును, రమణీ
యమణిమయ ఖచిత దీపికా స్తంభ ప్రభాభాసమానంబును, సకల
మధుర ఫలభరితంబునుగా విశ్వకర్మరచియించిన కేళీసౌధాంతరం
బున. 138

సీ. ఒకకుందనపు బొమ్మ హొయలు గుల్కుచుఁ జేరి
లీలఁ గెంగేలఁ దాంబూల మీయ
నొకజీవరత్నపుత్రిక నవీనసుగంధ
కుసుమంపు వీవన విసరుచుండ
నొకచారు సాలభంజిక ముద్దులొలుకంగఁ
దళుకు క్రొమ్మించు టద్దంబుఁజూప
నొకయంత్ర పాంచాలిక కరండ మొగిఁబూని
గంధకస్తూరి కాగరులొసంగ

గీ. నట్టి మహనీయ మోహనంబై తనర్చు
హంసతూలిక తల్పంబునం దమంద
లీలవేంకట నరసింహబాలకుండు
సిందువేడుకఁ బవళించి యుండెనంత 139

సీ. సరిగంచు నెఱికచ్చు జిలతారు చీరపై
రతనంపు మొలనూలు ప్రతిఘటించి
వలిగుబ్బ పాలిండ్ల నలదు కుంకుమనంటి
రంజిల్లుపై జాణ రవికఁ దొడిగి
బలునీలముండాలుఁ దులకించు నెఱివేణి
నిండార మల్లెపూదండఁ జెరివి
మొలక వెన్నెల నిగ్గులొలుకు ఫాలమునందుఁ
బొలుపొందఁ జేర్చుక్క బొట్టునిలిపి

గీ. తగిన బుద్ధులఁ గఱపుచు నగవులలరఁ
గనకలతికాముఖాంగనల్ గారవమునఁ
గమల గంధినిఁ బొదివి నెయ్యమునఁ దెచ్చి
యలరు పానుపుకడనిల్పిరతి ముదమున. 140

సీ. తొలుదొల్త మురిపెంపుఁ జిలుక రాయనిచేత
హరికథల్ వినువట్టి గరువతనము
గారామెలర్పంగ గంధాద్రిపైనుండి
సందేశమంపిన సాహసంబు
వరునకు నెఱిఁగింప వాఙ్నిపుణంబులఁ
బలికెడి నెరవైన ప్రౌఢిమంబు
మరుబాణములచేత విరహార్తి చేఁదూఁగి
మదిజాలిపడిన కౌమారదశయు

గీ. నిపుడు బరికింపలేదయ్యె నిందుముఖికి
నబ్బురంబగు వ్రీడాభరంబటంచు
ముదిత లచ్చెలి డించివేర్పునఁ దొలంగి
చనిరి తారొండు సమం కుత్సవముతోడ. 141

గీ. వెలయ లజ్జామహాంబోధి వీచికలను
మునిఁగి సంభ్రమమొలయ నెమ్మొగమువంచి
వేల బొటవ్రేలఁ బ్రాయుచుఁ గేలు మోడ్చి
తల్ప పర్యంకమున నిల్చెఁ దలిరుబోఁడి. 142

చ. అగధరు చూపులప్డు శబరాంబుజ గంధి పదాంబుజంబులన్
సొగవునఁ గాంచి నాభిఁగని చూచుకమాని ముఖాబ్జమండలిన్
నెగడి, కపోలమెక్కియుఁ గనీనికలం బ్రసరించుఁగాని యా
మగువలలాటసీమ కచమండలి కేఁగవు కూర్మియెట్టిదో. 143

ఉ. చిత్తము పల్లవింప సరసీరుహ లోచనుఁడంత భిల్లరా
ణ్మత్తమరాళయాన కుచమండలమంటఁ గవుంగలించి బ
ల్మెత్తని పువ్వుఁబాన్పుపయి మెల్లనఁజేర్చి ముదంబెలర్పఁగా
నత్తఱిఁ జెక్కునొక్కి మృదులాధరమాధురిఁ జొక్కి వేడుకన్. 144

క. తనుసకలావయ వాలో
కనముఁబచరించి పిదపఁ గంజదళాక్షుం
డును మది హెచ్చిన తమిన
వ్వనితా హారములనంటు వాంఛ జనింపన్. 145

క. ముక్తాహారంబుల నను
రక్తింజూచెడి విధంబు రంజిల్లఁగన
ర్మోక్తులు బల్కుచు గళసం
యుక్తపటంబోరగించి యుల్లాసమునన్. 146

గీ. అధర మధురామృతా స్వాదనాతిశయముఁ
జేసి పతిమోవి నిర్జరస్థితివహింపఁ
దనువు మధ్యాంబరస్పర్శఁదవిలిమిగులఁ
గామరూపంబు ధరియింపఁగడఁగెనపుడు. 147

సీ. ఫణిరాజ తల్ప శుంభత్కరచ్యుతమాన
బాలామణీ నీవిబంధనంబుఁ
గుంభిరక్షకదంత కురువింద చుంబిత
తరళనేత్రీగండదర్పణంబు
ధవనఖాంకూర క్షతవ్యథారోమాంచ
కుసుమగంధీ లసత్కుచయుగంబుఁ
బ్రాణేశదీర్ఘ దోర్దండపరీరంభ
పీడితకాంతా తనూలతంబు

ఆ. నతుల ఘర్మసలిల మతుల చిత్తానంద
మతుల పారవశ్య మతులకంప
మతుల మణితమంత్ర మతుల ప్రణయకోప
మతుల సౌఖ్యమయ్యె నక్కలయిక 148

సీ. తులలేని జాతి కెంపుల చెక్కడపు హొయల్
గులుకు టుప్పరిగెలో నిలిచినిలిచి
మిలమిలఁబొదలు జాబిలి రాలఁగీలించు
తేటవెన్నెల బైలఁ దిరిగితిరిగి
కమ్మగొజ్జఁగి నీటికాల్వ చెంగట మల్లె
పొదరిండ్ల లోపలఁ బొంచిపొంచి
పసమించు సిరము కప్రపుదుమారము చిందు
కృతకాద్రి గుహలలోఁ గేరికేరి

గీ. సారె సారెకుఁ జెంచునాంచారుతోడఁ
గూడి వేంకట నరసింహ బాలకుండు
నిండు వేడుకఁ బుష్పకోదండ కేలి
నలరి సంతోషవార్ధి నోలాడుచుండె. 149

గీ. సూనబాణాసనుని కేలిఁజొక్కిచొక్కి
లీల బాహ్యరతంబులఁ దేలి తేలి
ప్రథమ పరిహాసమున రమాప్రాణవిభుండు
చెంచూపుబోఁడి తోడఁ గ్రీడించు వెలమి 150

సీ. ఘర్మాంబు కణసిక్తగంధ లేపనములుఁ
దారుమారైన ముత్యాలసరులుఁ
దాంబూలికారాగ దంతక్షతంబులు
బ్రక్కలంటిన పాణిపల్లవములు
సడలిన రత్న కాంచన భూషణంబులుఁ
జిందఱగాఁజెంద చిన్నికురులుఁ
గటుల పైపీడ్వడు కనకాంబరంబులుఁ
దిరుగడై పెనఁగొన్న దేహలతలుఁ

గీ. గలిగి వేడుక లాపినకాలమందు
మెత్తనగు పుష్పశయ్యపై నొత్తిగిల్లి
నిదురఁజెందిరి దంపతుల్ నిండు వేడ్క
నందమలరార శేషాద్రిమందిరమున. 151

క. సతిపతు లంతట మేల్కాని
యతులిత సుఖభోగవాంఛ నలరారుచు సం
తత నూత్న గరిమఁబొదలిరి
శ్రితజన రక్షాధురీణ శీలత మెరయన్. 152

చ. క్షమలభవాననాండమను కాంచన పాళిఘటించి యందు లో
కములను గన్నులన్ రెయింబగళ్లను, వేలము లొప్పజీవులన్
సమభటకోటినిల్పి రవిచంద్రుల నా నృపులన్ లగించి శ్రీ
రమణియుఁదానుగూడి చతురంగమునాడుచుఁనుండె వేడుకన్. 153

సీ. పరతత్త్వ గుహ్యప్రభావ మాపాలంబు
మూలమంత్రము దుంప, మొదటివేరు
బలితంపుమ్రాను కోమలదివ్యదేహంబు
పదసంఘములు చారు పల్లవములు
కరసహస్రములు శాఖాకదంబము నేత్ర
కమలంబులురుమంజుసుమచయములు
శిరము లగ్రంబులు కురులు బల్లిపెలు
మంజుభాషణములు మధురసములు
గీ. వనధి రాట్కన్యకామణి వరఫలంబు
గా భవన్నామమునఁ బొల్చు కల్పతరువు
మన్మనోనంద నారామ మండలమున
శ్రీ లొసంగుచు నిలుచుఁగా శ్రీ నృసింహ! 154

ఉ. పాలిత భక్తజాల పరిపంధి మహావనదావపావక
జ్వాల హిరణ్య చేల వనజాతభవోద్భవ గానలోల గం
గా లహరీ సురాలయ నగస్ఫటికాద్రి పటీర శక్ర శుం
డాల హిమాలయద్యుతి విడంబిత కీర్తివిశాలమాలికా! 155
(షడ్బంధ విధ కందము)

హారదర హీరకీర్తి
సారస వరపురహర శరశరధర మూర్తి
సార ధరధీర శౌరీ
నారద గరళ ధర ఖచర నర సుర వంద్యా! 156

ఉత్సాహము: కపట వసుకురంగ దనుజ కంధరప్రఖండనా!
కపివర ప్రయుక్తగోత్ర ఘటిత సేతుబంధనా!
యపకృతాద్రి చరవిరాద్ధశాన్య కంఠలుంఠనా!
తపనవంశ సంభవప్రతాప భూపమండనా! 157

గద్యము

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్ష వీక్షాప్రసాద పరిపాక లబ్ధప్రసిద్ధ కవితావిలాస కళాధురీణ శ్రీమదాపస్తంబసూత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర వద్దిపర్తి వేంకటామాత్య పుత్ర సకలసుజనవిధేయ కోనంరాజ నామధేయ ప్రణీతంబైన వేంకటేశ్వరోపాఖ్యానంబను శృంగార ప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము సంపూర్ణము.

* చామరబంధము, శకటబంధము, శార్ఙ్గబంధము, పుష్పమాలికాబంధము, మృదంగబంధము, గోమూత్రికాబంధము, అను నాలుబంధములు కలిగి యున్నవి.



# 1వ అనుబంధము

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 12-9-1984

## అద్భుత వాస్తవాలు

విశాఖ జిల్లా, ఎలమంచిలి తాలూకాలో సర్వసిద్ధి అనే గ్రామం ఉంది. ఆ ఊరి కరణంగారు వద్దిపర్తి కోనంరాజుగారు. వీరు 1754లో జన్మించి, 1834లో పరమపదించారు. ఎనభై ఏళ్ళు పరిపూర్ణాయుర్దాయం అనుభవించి కవిగా, మహా భక్తుడుగా, అద్భుత దివ్య శక్తి సంపన్నుడుగా, ఆ రోజుల్లో కీర్తితులైనారు. గొప్ప రామభక్తులు కోనంరాజుగారు.

ఒకసారి పూరీ జగన్నాధస్వామిని దర్శించడానికి ఈయన ప్రయాణమై పరివారంతో వెళ్లుచుండగా జగన్నాధ క్షేత్రానికి సమీపంలో నరసింహ ఘాటీ అనే ప్రదేశంలో యాత్ర సుంకం చెల్లించకపోతే ముందుకు పోనిచ్చేది లేదని అధికారు లీయనను నిర్బంధించారు. జగన్నాధస్వామి రథోత్సవం వేళకు అక్కడకు చేరాలని కోనంరాజుగారి తీవ్రమైన కోరిక. పరివారానికీ, తనకూ సరిపడు సుంకం చెల్లించటానికి ఆయన దగ్గర డబ్బు లేదు. నిజానికి యాత్రికుల దగ్గర సుంకం వసూలు చేయకూడదు. అది దురధికారుల దౌర్జన్యం.

అప్పుడు కోనంరాజుగారు 'ఓ జగన్నాధ స్వామీ! నీవు కదలవద్దు' అని పద్యాలు చెప్పారు. అక్కడ జగన్నాధంలో రథం కదలలేదు. ఎంత ప్రయత్నించినా ఫలించలేదు. కోనంరాజుగారిని ఇక్కడ విడిచిన తరువాతనే అక్కడ రథం కదిలింది. తరువాత ఆయన స్వామివారిని దర్శించి స్తుతించారు. ఇదంతా ఆ రోజుల్లో ప్రజలు ఆ నోటా ఆ నోటా చెప్పుకున్నారు. ఆ నాటి ఇంగ్లీషు దొరల వరకూ ప్రాకింది ఈ సంగతి. మద్రాసులోని ఉన్నత ప్రభుత్వోద్యోగులకూ, క్రైస్తవ మతవ్యాపనం కోసం శ్రమిస్తున్న పాదరీ దొరలకూ, ఇదంతా నమ్మశక్యంకాని వింతగా అనిపించింది. జిల్లా కలెక్టర్లు, మిషనరీ దొరలు, కోనంరాజుగారి అమోఘవాక్కు, యోగ

శక్తులు, దైవభక్తిద్వారా ఆయన ప్రకటించగల మహిమలు, పరీక్షించాలని, 'ఇవి నిజం కావు' అని నిరూపించాలని, ఉబలాటపడ్డారు.

విశాఖపట్నం జిల్లా ఉన్నతాధికారులు, రెవెన్యూ, పోలీసు, న్యాయ శాఖల గొప్ప ఉద్యోగులు, ఇంకా కొందరు ఫాదరీలు కోనంరాజుగారి దగ్గరకు వచ్చి 'మీరు మాకేమైనా మీ యోగశక్తుల నిదర్శనం చూపగలగాలి' అని కోరారు. 'శ్రీరాముడి దయ ఉంటే అదెంతపని' అన్నారు కోనంరాజుగారు. మరయితే 'మేం చెప్పినట్లు చేయగలరా?' అన్నారు వాళ్ళు' ఆ రాముడి దయ' అన్నారు కోనకవిగారు.

'ఏంలేదు మిమ్మల్ని పడవలో మేము అండమాన్ ద్వీపం చేర్చి అక్కడ వదిలేస్తాము. మీరు ఎటువంటి సాధనమూ లేకుండా ఒంటరిగా విశాఖ రేవు తీరాన ఉన్న పోలవరం చేరాలి. మీకిది సాధ్యమా?' అన్నారు. 'ఓహో! లండన్‌దాకా రమ్మన్నా వస్తాను. అది సాధ్యం కాదనే ప్రసక్తే లేదు' అన్నారు కోనకవి. ఈ డాబులు పరీక్షచేయాలని గట్టిగా నిర్ణయించుకున్నారు దొరలు. 'సముద్రంలో మీరు ప్రయాణం చేసే మార్గాన్ని మేము ఓడల్లోనూ, ఒడ్డునా కనిపెడుతూనే ఉంటాము' అన్నారు దొరలు 'మీ ఇష్టం' అన్నారు కవిగారు. అండమాన్ ద్వీపంలో వదిలేశారు కోనంరాజుగారిని.

కార్తీక శుద్ధ ఏకాదశినాడు ఉపవసించి శ్రీరాములవారి మీద పద్యాలు చెప్పి కోనంరాజుగారు సముద్రజలాలపై యోగాసనంతో మఠం వేసుకొని బయలుదేరారు. రేవు పోలవరం చేరుకున్నారు. రేవు పోలవరం దగ్గర ఒడ్డున సాగివారు, పేరిచర్లవారు, మొదలైన క్షత్రియులు, దొరలు, కలెక్టరులు, మంగళ వాద్యాలతో కోలాహలంగా తమకు ఎదురొచ్చారని, దొరలు కరచాలనం చేసి ఎంతగానో అద్భుత మనస్కులైనారనీ, కోనంరాజుగారు స్వయంగా వ్రాసుకున్నారు. ఆ దొరల్లో ఛార్లెసు, ఫిలిప్ బ్రౌన్‌దొరకూడా ఉన్నారని తరువాత తమకెవరో చెప్పారని కోనంరాజుగారు వ్రాశారు. ఈ అండమాన్ నుండి రేవు పోలవరం యోగాద్భుత సముద్ర తరణం కోనకవి పద్యవృత్తాంతంగా వ్రాశారు. దీనిని స్వర్గీయ పురిపండా అప్పలస్వామి గారి నుండి ఈ రచయిత వ్రాసుకున్నారు.



-అక్కిరాజు రమాపతిరావు.

# 2వ అనుబంధము

శ్రీ అడిదం రామారావు పంతులు (రిటైర్డ్ సీనియర్ తెలుగు పండితులు, శ్రీ మహారాజావారి కళాశాల, విజయనగరం) గారిచే రచింపబడి విజయనగరం ఆంధ్ర విజ్ఞాన సమితి వారిచే జూన్ 1940న ప్రకాశింపజేయబడిన ద్వితీయ ప్రమరణమగు ''విస్మృత కళింగాంధ్రకవులు'' ప్రథమ భాగము (95 నుండి 105వ పుట వఱకు) నుండి గ్రహించబడినది.

## వడ్డిపర్తి కోనంరాట్కవి

(క్రీ.శ. 1754 - 1834 సం)

ఇతఁడార్వేల నియోగిబ్రాహ్మణుడు. ఆపస్తంభసూత్ర శ్రీవత్సగోత్రజుఁడు. రామరాజ పౌత్రుఁడు. వేంకట తమ్మయామాత్యుని పుత్రుఁడు. తల్లిపేరు రామాంబ. వీని యగ్రసోదరులు పర్వయ్య, వేంకటేశ్వరులు అనువారలు, కాపురము విశాఖపట్టణ మండలములోని ''సర్వసిద్ధి'' యనుగ్రామము.

ఆ ఊరు సర్వసిద్ధి పేరు కోనమరాజ
వడ్డిపర్తివారు వాస్తవంబు
బ్రాహ్మణుండ నేను బ్రాబంధికుండనఁ
బరగువాఁడ ధాత్రి నెఱఁగువాఁడ

కోనంరాట్కవి బాల్యము, విద్యాభ్యాసము మొదలగు వాటినిగూర్చి యేమియుఁ దెలియరాకున్నది. విద్యాబుద్ధులు నేర్చి పెరిఁగి పెద్దవాఁడైన పిదపఁ గులక్రమాగతముగ వచ్చు కరిణీకముఁ జేకొని, పిత్ర్యమగు మూఁడువందల యెకరముల పరిమితిగల నౌఖరీ యినాంభూములవలన వచ్చు నాదాయముచే సుఖముగ జీవయాత్ర గడిపిన ధన్యుఁడు. సాధారణముగా నాంధ్రకవీశ్వరులఁ బట్టిపట్టిన దరిద్రతా దేవత యొక్క కటాక్ష వీక్షములకుఁ గొంతదూరముగ ఁ దొలఁగినవాఁడగుట చేతనే కవితావృత్తి జీవనాధారముగఁ జేసికొన వగత్యము లేనివాఁడై కాలము గడిపెను. గ్రామాధికారిగానుండియుఁ గవిత్వకళయందధి కాదరము కలవాఁడై, కృషిచేసి, సరసకవిత్వవైభవములను జూపు ప్రబంధరత్నములఁ గావించి, కీర్తికాయుఁడయ్యెను. ఆర్వేలనియోగులగు కుందూరివారి వంశములోని యొకకవి చెప్పిన జమాబందీదండకమువంటి యొక సీసమాలికనే కమిటీ యుత్తరమనుపేర నీకవిస్న॥ 1209 ఫసలీలో జరిగిన యినాం భూముల పైసలాఖుసంబంధించిన జమాబందీనిగూర్చియు, నాఁటికాలమున

మిరాశీదారులు పడిన ప్రవాసకష్టములం గూర్చియుం జెప్పి దానిని జమాబందీ సాగించు దొరవారికి వినిపించి తనతోబాటు తన మిత్రులగు నితర కరణముల కష్టములం దొలంగించెనని చెప్పుదురు. ఆసీసమాలిక యిచటం బొందు పఱుపంబడినది.

## కమిటీ పుత్తరం

సీసమాలిక :

బారాస్న నౌసవ ఫసలీనియాదాస్తు పరగణా వుప్పలం పక్కినాండ
ఫిబిరేవరను తేది ఖిన్నవో రోజ్సరికి కరణాల భోగట్ట కరుణ వినుడి
యేమయా! తాతగారూ! మీకు క్షేమమా మామయ్యగారూ నమస్కృతంబు
పదివేలు పదివేలు భావగా రో! హో! హో! యిప్పుడయా మీరు యిప్పుడేపె
వాయనా! లెస్సమున్నారోయి మీరంత మనవారు కుశలమా? మరిదిగారు
బంధువు లాత్మసంబంధులు మొదలుగా భాషింతురొక కొన్ని భాషణములు
మీబసెక్కడనయ్య! మాబసేటావల వసతి కాకరకాయ వాటమయ్య
జిల్లుడాకుల మేత చీంకటి చెయ్యూత పాలుడప్పి యజీర్తిపాలుసేత
నొకమాతస్నానంబు నొకమాతపానంబు నొకచోట భోజనం బొంటిపూట
కావి కానీ యిట్టికబురులకే మొచ్చె ముందరదారికి మొదలుచెప్పు
మీమధురాలెన్ని? మీయెడభూమెంత? మీవూరు బీడెంత మెట్టుయెంత?
పల్లపుభూమెంత? పదునాలుగేళ్లకు పంటెంత? శిర్దెంత? ప్రజలుయెంత?
నాగళ్లునాశిర్దు వాడెంత? తవులెంత? పెల్లెంత? బాకెంత? శిస్తుయెంత?
సాలుమగ్గాలు కంసాలి దుకాణాలు కోమటంగణములు కొండలెన్ని?
చెరువులునూతులు తరువులుగమి లెన్ని? ఇళ్ళ వైనంబు పెరళ్ల రీతి
సగ్రామమునకు విశ్వాసపాల్లములగాయతు సామ్యవరకు ఆగతమునకటి
సాధారణాది పరీధావివరకు పండినపంట రాబడినెనుక రెండు
దగద్రమాదీచమొదల్ కాళయుక్తి సంవత్సరంబుకు తుదవచ్చుమునను
మూండుముద్దత్తులు మూటికి యేకట్ట దినకకులుత్తాది దినమునెట్టు
ఝూడాదరోబస్తు సనదిలరాబడి పంటమిరాసీల పంటరుసుము
వాకర్ల పంటయు సకలమురాబడి గాముగానావనూల్ కట్టుబళ్లు
పోతులు గేదెలు సామ్నారునాగళ్లు యెద్దులమందలు యెసగ పెద్ద
నాయలవైనము సాయకారీమొదల్ మేకలుగొఱ్ఱెల నేకమైన

పూర్వపుమాన్యముల్ తరువాత మాన్యముల్ కొన్నభూములప్రతిగొన్నయట్టి
ఫీరస్తుకల్గిన పారమాఖీఖత్తు యిస్మెంటుకాగిత మిచ్చినార
కరువులోగడికి లెఖ్ఖలుబోయెమావద్ద కరువులో లెఖ్ఖలు గానరావు
రెండేళ్ల లెఖ్ఖలులేవు నాదగ్గఱ మూడేళ్ల లెఖ్ఖలు బోయెమాకు
నాలుగేళ్ల విజూడ నాదగ్గఱను లేవు కడగి అయిదేళ్ల కాకరము లేదు
పదునాలుగేళ్లకు పదపరుచున్నారు యింకాపదేళ్లకు యిస్తునేను
ఝూముప్రొద్దెక్కెను శాలికుడా కచేరీకి వస్తున్నావ లేక మాను
తున్నావొ జెప్పుము తప్పుజల్మానాకు కాసుకుగతిలేదు కాపులివరు
ఇదిగొవస్తినటంచు అదిగొవస్తినటంచు చంకలెఖ్ఖగదించి సరవినేఁగి
యీపంచగూర్చుండ నాపంచగూర్చుండ నంతలోపల రవియస్తమింప
చిరచిరలేచి ముందరసాగువారల గూడిడేరాచేరి కొంతసేపు
తాటియాకులువిప్పి తారుమారులు చేసి దీపాలముందర తిరగవేసి

గీ. ఆరుయేడ్పెల్లు వీరు చీకాకుపడిరి
గాన వారల రక్షించికరుణ జేసి
శెలవు వేగంబొసంగవె సారసాక్ష
వినుతగౌరీశ వుపమాక వేంకటేశ.

N.B. ఈ మాలిక కేవలము వినోదార్థము వ్రాసిన కారణమున కోనంరాట్కవి సమర్థుఁడయ్యును ఛందోవ్యాకరణాదులను పాటింపలేదని మనమూహింపఁదగి యున్నది. ఆకారణముచేతనే దీనిని నేను యధామాతృకముగాఁ బ్రకటించితిని.

అ. రా.

కోనకవి క్రీ.శ. 1754 సంవత్సరములోఁబుట్టి 80 సంవత్సరములు జీవించి, 1834 సంవత్సరములో స్వర్గస్థుఁడయ్యెను. ఈ కవివరుఁడు తన కవితాశక్తిచే నద్భుతకార్యము లొనర్చెనని యొక ప్రసిద్ధిగలదు. దానిని స్థిరప ఱచు సమాచార మొకటి నీతని కృతియగు "**మహాలక్ష్మీ పరిణయము**" పీఠి కలో నీకవి మునిమనుమలును, ఏతద్గ్రంధ ప్రకాశకులును, అగు శ్రీయుత వీర రాఘవస్వామి పంతులుగారు నుడివియున్నారు. ఆ సమాచారమునే యిచట సం గ్రహముగాఁ జెప్పుచున్నాఁడను. కోనంరాట్కవి యొకప్పుడు కొంతపరిజన ముతో శ్రీజగన్నాథము యాత్రార్థమై వెళ్లియుండెను. అప్పుఁడవి రథోత్సవది నములు. సుంకముచెల్లించినగాని శ్రీ స్వామివారి దర్శనము లభ్యముకాకుండెను. అట్టి సుంకముఁ జెల్లింపనిష్టములేనివాఁడై, యతఁ డీరీతిని స్వామివారిని స్తుతించుచుఁ బద్యములను జెప్పెను.

వద్దిపర్తి కోనంరాట్సువి

సీ. మాణిక్యపురపురో మార్గమందున్నాను
గుండలిశయన యటుండు; పోకు!
ఘూటాలనరసింహ ఘాటిమధ్యావనీ
మండలందున్నానటుండు; పోకు!
నరసింహలోకాధి నానాధ్వమధ్యస్థ
లోర్వియందున్నా నటుండు; పోకు!
నిజపురీంద్రద్యుమ్న నిలయభూతలమునం
దున్నాను వడియటుండుండు; పోకు!

తే.గీ. పోకుపోకు జగన్నాథ పుణ్యమూర్తి
దితిసుత విపక్ష! త్రైలోక్యదీనరక్ష!
పతితపావనబిరుదాంక ! బహువరాకు
సేవకునిఁ బ్రోవుదయఁజూడు చిత్తగించు.

ఇట్లు కొన్ని పద్యములు చెప్పునరికి నట్టికవితాప్రభావము గారవించి భక్తునిపై స్వామికరుణ జూపెనో యన, రథమెంత మందిలాగి శ్రమపడుచున్నను గదలక నిలిచిపోయెను. అంతఁగర్లాకర్లిగ నీకవిప్రభావము మహంతిమొదలగువారువిని, సుంకముగైకొనకయే యాతనిని, ఆతనిపరిజనమును శ్రీస్వామివారి దర్శన ముచేయ ననుమతించిరి.

గీ. జగతి నాలుగువర్ణముల్ సమము చేసి
కుడువఁజేసితివౌ భళీ! కుడుచువేళ
నేహ్యమినుమంతయును లేక సహ్యముగను
శ్రీ జగన్నాథ! చేసితే చిత్రముగను.

అని చెప్పఁగా రథము యెప్పటియట్లు కదలినడచెనని చెప్పు చున్నారు.

గ్రంథరచనావిషయము : కోనంరాట్సువి వేంకటేశ్వరోపాఖ్యానము, రేవతీపరి ణయము, శ్రీ మహాలక్ష్మిపరిణయము, జానకీరామశతకము మొదలగుకృతులను రచించెను. ఈ విషయము శ్రీ మహాలక్ష్మిపరిణయమందిట్లు చెప్పఁబడియున్నది.

ఉ. ఆమహితాన్వయంబున రమాధిపభక్తి జనించి జానకీ
రామకృతుల్ రచించితిని, రైవతపుత్రి వివాహకావ్యమున్
గామితమొప్ప వేంకటనగ ప్రభు దివ్యచరిత్ర మాసుధా
ధామదివాకరంబుగను ధన్యుఁడ నీధరణీతలంబునన్.

మీఁది మూఁడు ప్రబంధములలో నొకటియగు శ్రీమహాలక్ష్మీపరిణయము, ముద్రితమై కతిపయదినములనుండి ప్రచారములోనికి వచ్చియున్నది. ఇది యైదాశ్వాసముల శృంగారరస ప్రబంధము. ఇందలికథ శ్రీ లక్ష్మీనారాయణుల వివాహమహోత్సవము. ఇది పద్మపురాణ ప్రసిద్ధమని కవి యిట్లు మనకుఁదెలిపి యున్నాఁడు.

సీ॥ కైలాసమందు శంకరుఁడద్రికన్యకు
బోధసేయు పురాణగాథలందు
రాణించుపద్మపురాణోక్త కథలలో
నంబుజాలయ వివాహప్రబంధ
మాంధ్రభాషరచించి యస్మత్కులాభీష్ట
దైవమౌ నరసింహ దేవునకును
కృతిసమర్పింతు ..........

కోనంరాట్కవి నిరుపమానసాహితీ పటిమయు నవర్గళకవితా ధార యుఁగలవాడని యాకృతియే ఘంటాపథముగఁ జెప్పుచున్నది. కవిత్వము మూఁడుపాళ్లు సంస్కృతము, నొకపాలు తెలుఁగు, గలిగి కర్ణపేయమై యొప్పు చుండును. వ్యాకరణ విరుద్ధములగు ప్రయోగములు విరళముగాఁ గానఁబడు చున్నను, నవిగణింపఁదగినవికావు. అట్టి నెరసులీతనిసుధామాధురీవాగ్ఝరిలో మటుమాయమగుచున్నవి. మొత్తముమీఁద నీ మహాలక్ష్మీపరిణయమును 18, 19 శతాబ్దములలో వెలువడిన ప్రబంధములలోఁ బ్రసిద్ధివడసియున్నవానిలోఁజేర్చి, యున్నతస్థాన మీయనగునని చెప్పవచ్చును.

కవి యీగ్రంథమును శ్రీ సింహాచలనరసింహస్వామికి నంకితమొనర్చెను. కవితాధోరణి తెలియుటకుగవికృతములగు గ్రంథములనుండి కొన్ని పద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాఁడను.

మ. క్షితి నార్వేలనియోగిపుంగవులలో శ్రీ వత్సగోత్రోద్భవుల్
చతురోపాయసమర్థవైభవకళాచాతుర్యవంతుల్ జగ
ద్వితసత్కీర్తికళానిధుల్ సుగుణ సందీప్తప్రభావోన్నతుల్
మతిమంతుల్ హితకార్యవంతులుమహామంత్రీశ్వర గ్రామణుల్

ఉ. బంగరుమేడలం జలజపాణులు వీణలఁ గేలఁబూని సా
రంగసమాఖ్యరాగ మలరంబలికించినఁ జేరనిల్చు నో
జంగొమరారె విద్రుమనిశాకరకాంతధగద్ధగ ప్రభా
భంగవిశాలసాల ఘనబంధురచిత్రకురంగజాలముల్.

ఈ పద్యమునుబట్టి కవికి సంగీతమందుఁగూడ నభినివేశము గలదని యూహింపవచ్చును.

చ. మలదొరముద్ధుపట్టి మెడమంగళ సూత్రము కంపమొంద దు
జ్జ్వలసురవాహినీమణికి సాగదు చంచలజీవనంబు నె
న్నడఁదడబా టొకింతయుఁ గనంబడ దవ్వెలిగుబ్బ తేనికిన్
హాలహాలమొక్క సొరెగగనాంబరుఁడానెడువేళఁ జూడఁగన్.

కవి యీ పద్యమునందు ''ల'' ''డ'' లకుఁ బ్రాసమున మైత్రిఁ గూర్చినాఁడు.

క. పలుకులు కపురపుమొలకలు
వలపులు క్షణ భంగురములు వావులుసున్నల్
నిలుకడలు నీటిబుగ్గలు
అలివేణుల నమ్మఁజూడ రార్యులు జగతిన్ (3. ఆశ్వా)

మ. వరుఁడన్నన్ ధనమన్న సత్యమనిన న్వాత్సల్యమన్నన్ మనో
హరుఁడన్న న్పరమార్థమన్న సుకృతంబన్నన్ తపంబన్న స
ద్గురువన్నన్ వ్రతమన్నఁ గోరికననసంతోషంబనన్ జీవితే
శ్వరుఁడన్నన్ విభుఁడన్న నీకునబలా వైకుంఠుఁడెల్లప్పుడున్.
(5. ఆశ్వా)

చ. సమయమెఱింగి యవ్విభుని సన్నిధికేగి తదీయదివ్య చి
త్తముతెఱఁగెల్లఁగాంచి వనితామణుల న్వెలయించువేళ, క
య్యమునకుదూఁకువేళ మృగయారతినొందెడువేళ కోపభా
వము గనువేళమాని, మృదుబాషలవిన్నపమాచరింపుమీ
(శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము, 1. ఆశ్వా)



# 3వ అనుబంధము

ఓం

శ్రీరస్తు

శ్రీ మహావిష్ణుని దశావతారాభి వర్ణనము.

# జ్ఞాన సాధనము

శ్రీ మహాలక్ష్మి పరిణయాద్య నేకాంధ్ర ప్రబంధ
నిర్మాణచాతురీ ధురీణుండగు

**వద్దిపర్తి కోనంరాట్కవిచంద్ర పౌత్రుండగు**

**(ద్వితీయ) కోనంరాజ పుత్రుండగు వేంకటరెడ్డివార్యునిచే**

సూక్ష్మ పదముగ కూర్చబడి

సకలజనోపయోగముగ ప్రచురింపబడినది.

ప్రథమ ముద్రణము క్రీ॥శ॥ 1930



శుభమస్తు

అవిఘ్నమస్తు

ఉ॥ ఏ విభువంద నార్చనము లే విభుచింతయు నామకీర్తనం
బేవిభు లీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో
షావలిబాసి లోకము శుభాయుతవృత్తి జెలంగు నండ్రు నే
నావిభు నాశ్రయించెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్ ॥

క॥ వినుమీ సంసారంబను వననిధిలో
మునిగి కర్మ వాంఛలచే వేదన
బొందెడు వానికి విష్ణుని గుణ
వర్ణనము దెప్పుసుమ్మ మునీంద్రా ॥

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః
శ్రీమహాగణాధి పతయేనమః
శ్రీ శారదాంబాయేనమః

## శ్రీ మహావిష్ణుని దశావతారాభి వర్ణనము

### జ్ఞానసాధనము

శ్రీ రామరఘురామ । సీతాపతేరామ।
సుజనపోషకరామ । సుగుణాభిరామ ।

1. అఖిలాండకోటి । బ్రహ్మాండనాయకరామ ।
అంతరాత్మారామ । అభినుతించెదను ॥ శ్రీరామ ॥

2. సర్వవిఘ్నంబులను । సమయింపగాజాలు ।
సర్వజ్ఞ విఘ్నేశు । సన్నుతించెదను ॥ శ్రీరామ ॥
3. అన్ని విద్యలకెల్ల । ఆటపట్టయినట్టి ।
అంబుజోద్భవురాణి । నాత్మలోదలతు॥ శ్రీరామ ॥
4. శ్రీ పార్వతీపతిని । శ్రీ మహాదేవుని ।
చిత్తమందునదలచి । చేతువందనము ॥ శ్రీరామ ॥
5. గురువర్యుమది నెంచి । చరణపద్మంబులకు ।
సాష్టాంగములు జేసి । సన్నుతించెదను॥ శ్రీరామ
6. ఈ విధంబుగనిష్ట । దేవగణంబులను ।
భక్తితో గొనియాడి । పరమమోదమున ॥ శ్రీరామ ॥
7. వరధర్మకామార్థ । వర్జితులైనట్టి ।
పరమమునులందరికీ । భక్తితో మ్రొక్కి ॥ శ్రీరామ ॥
8. ప్రహ్లాదుడాదిగా । పరమభక్తులనెల్ల ।
పరమజ్ఞానులనెల్ల । భక్తితోబొగడి ॥ శ్రీరామ ॥
9. పశుపతి కైనను । పంకజోదరు కైన ।
పరమేశ నీమహిమ । వర్ణింపతరమా ॥ శ్రీరామ ।
10. నీమహామహిమలను । నిత్యంబుగొనియాడి ।
వర్ణింతునోదేవ । పరమమోదమున ॥ శ్రీరామ ॥

విశ్వసృష్టి

11. పరమాత్మయనునట్టి । పరబ్రహ్మమునందు ।
యామూలప్రకృతి । యణగెశక్తిగను ॥ శ్రీరామ ॥
12. ఆవరణవిక్షేప । మనిశక్తిద్వివిధామై
భువిపరిణమించేను । భూతతతిలోన ॥ శ్రీరామ ॥
13. విక్షేపశక్తి చే। వివిధంబులగుస్థూల ।
సూక్ష్మభూతములన్ని । సృష్టింపబడియె ॥ శ్రీరామ ॥
14. ఆవరణశక్తి । యజ్ఞానమునుగల్పించి ।
ఆత్మచైతన్యమును । ఆవరణజేసె ॥ శ్రీరామ ॥
15. ప్రకృతికిపరుడైన । పరమపురుషునియందు ।
ప్రకృతి కారణముగను । ప్రభవించునిచ్ఛ ॥శ్రీరామ॥

16. ఆద్యంతములులేని । అపరమేశునకు ।
సృష్టిసంకల్పంబు । చిత్తమునబొడమె ॥ శ్రీరామ ॥
17. పరిశుద్ధ జలములను । బాగుగానిర్మించి ।
వటపత్రశయనుడై । వరలెనంతటను ॥శ్రీరామ ॥
18. నారంబులందుననూ । తీరుగాశయనింప ।
నారాయణుండని । నామంబుగలిగే ॥ శ్రీరామ॥
19. పవళించియుండంగ । పరమేశ్వరుని నాభి ।
స్థానమునపద్మంబు । జనియించెనంత ॥ శ్రీరామ ॥
20. పద్మగర్భంబుననూ । పరమాత్మ యంశమున ॥
బ్రహ్మదేవుఁడంత । ప్రభవించెనపుడు॥ శ్రీ రామ ॥
21. తపయనుశబ్దంబు । తనచెవినివినబడగ ।
తపమొనరించెను । విపరీతముగను ॥ శ్రీరామ॥
23. ఆతపంబుకు మెచ్చి । ఆదినారాయణుడు ।
ప్రత్యక్షమైబలికె । పరమదయతో నూ ॥ శ్రీరామ॥
24. సృష్టికర్తవుగమ్ము । శ్రీఘ్రంబుగానిపుడు ।
మునుపటివలెనీవు । అనియానతిచ్చె॥ శ్రీరామ ॥
25. అంతర్హితుండయ్యె । నంతటవిష్ణుండు ।
ఆయాజ్ఞమన్నించె । హంసవాహనుడు ॥ శ్రీరామ॥
26. అంతటను ఆకాశ । మమరంగనిర్మించి ।
ఆవెనుక వాయువును। నవటగల్పించే ॥ శ్రీరామ ॥
27. అగ్ని దేవునిల్పి । ఆ సమయంబునను ।
వరుణదేవునిగూర్చె । వరుసమీరగను ॥ శ్రీరామ ॥
28. పుడమిదేవతలంత । పొందుగాగల్పించి ।
పంచభూతంబులను । పరిపూర్తి జేసె॥ శ్రీరామ॥
29. పంచతన్మాత్రలను । పంచేంద్రియంబులను ।
పంచప్రాణంబులను । పదిలముగనిల్పి ॥ శ్రీరామ ॥
30. మహదహంభావమును । మనసేంద్రియంబులను ।
బుద్ధీంద్రియుంబులను । పొందుగాజేర్చె ॥శ్రీరామ॥
31. పదియు నొకరుద్రులును । పంద్రెండుసూర్యులును
ఉడురాజుతారలును । ఉద్భవంబైరి ॥ శ్రీరామ ॥

32. వరసిద్ధసాధ్యులను । గరుడగంధర్వులను ।
అసురగణంబులను । నంతసృష్టించె ॥ శ్రీరామ॥
33. సనకసనందనులు । సనత్కుమారుడును ।
కలహాశనుండంత । గల్పింపబడిరి ॥ శ్రీరామ॥
34. సంకల్పమాత్రమున । సంభవించినవారు ।
అజునిమానసపుత్రూ । లనియుంచబడిరి ॥ శ్రీరామ॥
35. దేవేంద్రుడాదిగా । దేవసంఘంబులు ।
స్వర్గంబుపాలింప । శాసంపబడిరి. ॥ శ్రీరామ॥
36. అఖిలభూతంబులును । అజ్ఞానవశమున ।
కర్మానుబంధమున । గలిగెలోకమున ॥ శ్రీరామ ॥
37. జననమరణంబులును । ఘనశోకమోహములు ।
జనులందరునుబొందె । జన్మతోడుతను ॥ శ్రీరామ ॥
38. పదునాల్గుభువనములు । పలువిధంబులగూర్చి ।
పద్మగర్భుండుండె । పరమమోదమున ॥ శ్రీరామ॥
39. బ్రహ్మదేవునిచేత । బహువిధంబులసృష్టి ।
అమరించిసర్వాంత । ర్యామియైయుండె ॥ శ్రీరామ॥
40. విశ్వమెల్లనునిటుల । వివిధముగ సృజియించి ।
విశ్వమయుడైయుఁడె । విశ్వంబులోన ॥ శ్రీరామ॥
41. నిరపేక్షకుండగుచు । నిష్కళంకుండగుచు ।
నిశ్చలుండైయుండె । నిఖిలజగమునను ॥ శ్రీరామ॥
42. సర్వరక్షకుడగుచు । సర్వేశ్వరుండగుచు ।
సర్వసాక్షిగనుండె । సత్స్వరూపమున॥ శ్రీరామ॥
43. దుష్టులనుదండింప । శిష్టులను రక్షింప ।
అవతారములదాల్చే ॥ నామహాత్ముండు॥ శ్రీరామ ॥

## మత్స్యావతారము

44. అలమత్స్యరూపమున । జలనిధిలోజొచ్చి ।
సోమకునిబరిమార్చి । శ్రుతులన్ని దెచ్చి॥ శ్రీరామ॥
45. బ్రహ్మదేవునికిచ్చి । పరమాదరంబునను ।
బ్రహ్మనిష్టులచేత । పఠనజేయించె ॥ శ్రీరామ॥
46. శ్రీశుకుండాదిగా । శిష్టలొకముమెల్ల ।
శ్రద్ధతోపఠియించి । సిద్ధులైనారు ॥ శ్రీరామ॥

47. అజ్ఞానజనములు । ఆశ్రద్ధగానలేక ।
విజ్ఞానహీనులై । వెలసిరీభువిని ॥ శ్రీరామ॥

## కూర్మావతారము

48. దేవలోకమునందు । దేవదానవులెల్ల ।
దేవేంద్రపదమొంద । దీక్షవహియించి ॥శ్రీరామ॥
49. అధిక బలంబునను । ఆరాక్షసులు వేగ ।
దేవగణంబులను । దండింపసాగె ॥శ్రీరామ॥
50. అంతటనుదేవతలు । ఆదినారాయణుని ।
రక్షింపరమ్మనుచు । ప్రార్థనలు జేసె ॥శ్రీరామ॥
51. ఆ మొరలు చెవిసోక । ఆదిదేవుండవుడు ।
ఉత్సాహమునుగూర్చె । నుభయగణములకు ॥శ్రీరామ॥
52. పాలసంద్రమునందు । బరగవారలచేత ।
కవ్వముగమందరము । గల్పించియంత॥ శ్రీరామ॥
53. పర్వతముచుట్టునను । ఫణిని రజ్జుగ జేసి ।
దేవదానవులచే । ద్రిప్పించేనంత॥ శ్రీరామ॥
54. పర్వతముబరువోట । పాతాళమునకృంగ ।
దేవదానవులపుడు । దీనత్వమొంది॥ శ్రీరామ॥
55. ఓ దేవదేవుడా । ఓ జగన్నాధుడా ।
కావసమయంబిదియె । కరుణామయుండ ॥శ్రీరామ
56. ఆపదుద్ధారకుడా । ఆదినారాయణుడా ।
కావవేశీఘ్రమున । దేవదేవేశ ॥ శ్రీరామ॥
57. దేవదానవులిట్లు । దీనులైవేడంగ ।
దీనరక్షకుడపుడు ।దిక్కు కాదలచి ॥ శ్రీరామ॥
58. కూర్మావతారమున । కొండక్రిందకునేగి ।
కొండవీపునదాల్చి । కుదురుగానిలిపె ॥శ్రీరామ॥
59. అంతటనుదేవతలు । నసురులెల్లరుగూడి ।
ఆద్రికవ్వముజేసి । అబ్ధిమధియింప ॥శ్రీరామ॥
60. హాలాహలముమొదట । నాసమయంబునను ।
ప్రభవించిమండుచును । భయముగలిగించె ॥శ్రీరామ॥

61. ఓపార్వతీనాథ ॥ ఓ భక్తవత్సలుడ ।
పాహిపాహియటంచు । ప్రార్థనలు చేసి॥ శ్రీరామ॥
62. అసురులునుదేవతలు । నంతరుద్రునివేడ ।
హాలాహలముకంఠ । మందతడునిలిపె॥ శ్రీరామ॥
63. ఆవెనుక జ్యేష్ఠయును । ఆ వెనుకలక్ష్మియును ।
చంద్రుడావెనువెంటఁ । జన్మంబుగనిరి ॥శ్రీరామ॥
64. అంతట నెవిష్ణుండు । ఆదిలక్ష్మిని జూచి ।
మోహించివరియించె । ముదముతోడుతను ॥శ్రీరామ॥
65. ఆ వెనుకనమృతంబు । ఆవిర్భవంబొంద ।
ఆ మహావిష్ణుండు । ఆత్మనూహించి॥ శ్రీరామ॥
66. మజ్జగంబులవారి । మోహింపగా జేయు ।
మోహనాకారుడై । మూర్తితాబూని॥ శ్రీరామ॥
67. దివ్యసుందరమైన । దివ్యమంగళమైన ।
స్త్రీరూపమునుదాల్చి ॥ చిత్తములు చెదర॥ శ్రీరామ॥
68. రాక్షసగణములను । భ్రమలలోమునిగించి ।
అమరులకమృతంబు । సమకూర్చివేగ॥ శ్రీరామ॥
69. అంతర్హితుండయ్యె । ఆజగన్మోహనుడు ।
వైనతేయునిపైని వైకుంఠమునకు॥ శ్రీరామ॥
70. ఆ మహావిష్ణుండు । ఆదిలక్ష్మినిగూడి ।
వైకుంఠభువనమున । వసియించి యుండె ॥శ్రీరామ॥

## వరాహావతారము

71. జయవిజయులను బంట్లు । జగదీశ్వరునికృపను ।
ద్వారపాలకులగుచు । ద్వారముననుండ ॥ శ్రీరామ॥
72. సర్వజ్ఞుడైనట్టి । స్వామినిదర్శింప ।
సనకసనందనులు । చనుదెంచిరంత ॥శ్రీరామ॥
73. ద్వారపాలకులపుడు । ద్వారమందుననిలచి ।
ఆమునివర్యులను । ఆటంకపరుప ॥ శ్రీరామ॥
74. ఆమునులంతటనె । యధికరోషంబునను. ।
పుడమిజయవిజయ యులను । పుట్టశపియింప॥ శ్రీరామ॥

75. ఆ శాపమునుదెలసి । ఆదినారాయణుడు ।
కావలివారలను । గరుణించిపలికె ॥శ్రీరామ॥
76. అసురులైజన్మించి । యటమూడుజన్మముల ।
తనతోనుపోరాడి । తరియింపుడనియె॥ శ్రీరామ॥
77. అటుపైని శ్రీవిష్ణు । వందుజేరుండని ।
వరమిచ్చిపొండనియె । వాసుదేవుండు ॥శ్రీరామ॥
78. సనకసనందనులు । స్వామినిదరిశించి ।
స్వస్థానగతులైరి । సన్నుతులు జేసి॥ శ్రీరామ॥
79. కమలజువంశమున । కశ్యపబ్రహ్మయని ।
ఒక మహామునియుండె । నుర్వియందునను । శ్రీరామ॥
80. అదితియు దితియంచు । నతవికినిరువురు ।
భామినులుండిరి । భార్యలై వెలసి ॥ శ్రీరామ॥
81. పుడమి జయవిజయులు । పడుచు దితిగర్భమున ।
అసురులైజనియించి । రతిగర్వమునను ॥ శ్రీరామ॥
82. హిరణ్యాక్షుండనియు । హిరణ్యకశిపుండనియు ।
నామధేయంబులను । నయముగాగనిరి ॥శ్రీరామ॥
83. కాంచననేత్రుండు । కడుగర్వముననవని ।
జాపజుట్టగజుట్ట । జనులుబీతిలిరి ॥ శ్రీరామ॥
84. వాసుదేవుండపుడు । వరాహరూపమున ।
దానవునిఖండించి । ధరణితగనిలిపె ॥ శ్రీరామ॥

## నృసింహావతారము

85. ఆహిరణ్యాక్షునికి అనుజుడైతనరారు ।
హిరణ్యకశపుండు । హరికృత్యమెరిగి ॥ శ్రీరామ॥
86. కాలాగ్నిరుద్రుడై । కడుక్రోధమూర్తియై ।
విష్ణుదేవునిపైకి । వెడలెగర్వమున ॥శ్రీరామ
87. ఆత్మజుడైనట్టి । హరిభక్తుడైనట్టి ।
పరమపావనుడైన । ప్రహ్లాదునపుడు ॥శ్రీరామ॥
88. హరిభక్తిమానుమని । హరిసేవకూడదని ।
బహువిధంబులసుతుని బాధింపసాగె ॥శ్రీరామ॥

89. బహుకఠినశిక్షలచే। బహువిధబాధలచే ।
తనసుతునిదండించె । తగనికోపమున॥ శ్రీరామ॥
90. హరిహరీశ్రీనాథ ॥ ఆర్త చింతామణి ।
కారుణ్యమయమూర్తి। కరిరాజవరద॥ శ్రీరామ॥
91. ఆదినారాయణుడా । ఆపదుద్ధారకుడా ।
అచ్యుతాననుబ్రోవు । అఖిలజగదీశ॥ శ్రీరామ॥
92. అన్నిలోకములందు । అన్నిభూతములందు ।
యెందెందువెదకినను । అందందుకలవు॥ శ్రీరామ॥
93. సర్వజ్ఞసర్వేశ । సకలలోకాధార ।
సత్యస్వరూపుడా । సత్కృపనుగావు ॥శ్రీరామ॥
94. అనుచుప్రహ్లాదుండు । ఆర్తరక్షకు వేడ ।
కరుణతోప్రహ్లాదు । గానగానెంచి ॥ శ్రీరామ॥
95. నరసింహరూపమును । ధరియించివేగమున ।
రాక్షసేశ్వరుద్రుంచి । ప్రహ్లాదుగాచె॥ శ్రీరామ॥

## వామనావతారము

96. ప్రహ్లాదునకుధర్మ । పరుడువిరోచనుఁడు ।
కొమరుండుజన్మించె । కోర్కిదీరగను ॥ శ్రీరామ
97. అతనికితనయూడై । అవనియందుజనించె ।
బహుకీర్తివంతుడౌ । బలిచక్రవర్తి ॥శ్రీరామ॥
98. బహుతపంబులుజేసి । బ్రహ్మదేవునివల్ల ।
బహువరంబులుగాంచి । ప్రబలుడైయతడు ॥శ్రీరామ॥
99. దేవేంద్రుడాదిగా । దేవబృందంబులను ।
పడగొట్టిదేవేంద్ర । పదవినైగొనియె॥ శ్రీరామ॥
100. అదితి ఆసమయమున । అతిదీనతనుబొంది ।
తనవల్లభునిజేరి । తగనిట్లు బలికె॥ శ్రీరామ॥
101. బలినిగెలిచెడునట్టి । బలశాలిపుత్రూని ।
కరుణింపుమననంత । కశ్యపబ్రహ్మ ॥శ్రీరామ॥
102. పయోభక్షణమనెడు । వ్రతమునుపదేశించి ।
ఆదినారాయణుని । ధ్యానించుమనియె ॥ శ్రీరామ॥

103. పరమనియమముతోడ। పరమభక్తియుగలిగి ।
పరమాదరముతోడ। వ్రతముతాసలిపె ॥ శ్రీరామ॥

104. అదితిభక్తికిమెచ్చి । ఆదినారాయణుడు ।
ప్రత్యక్షమైబలికె । పరమదయతోను॥ శ్రీరామ॥

105. నీగర్భమునజొచ్చి । నేవామనుండనై ।
పుట్టిబలిగర్వంబు । పాలియింతుననియె ॥ శ్రీరామ॥

106. అదితియీవార్తతన । అధిపున కెరిగించి।
సేవజేయుచునుండె । చిత్తమలరంగ॥ శ్రీరామ॥

107. ఆమెగర్భముజొచ్చి । ఆదిపురుషుండపుడు ।
వామనరూపమున । వసుధనుదయించే ॥శ్రీరామ॥

108. బలియజ్ఞ మొనరింప । వామనుండరుదెంచి ।
బహుదానపరుడైన । బలిని యాచించి ॥ శ్రీరామ॥

109. మూడు పాదంబులను । భూమిదానమువడసి ।
పాదద్వయంబునను । వసుధదివిగప్పి॥ శ్రీరామ॥

110. మూడవపదమునకు । పుడమిజూపమటంచు ।
పరమపురుషుండపుడు । బలినిశాసించె ॥శ్రీరామ।

111. మూడవ పాదమును । ముదముతో తనశిరసు ।
పైనుంచబలివేడె । భక్తితోడుతను ॥శ్రీరామ॥

112. పరమపురుషుండంత । పరమాదరంబునను ।
బలిభూమిదానముకు । బహుసంతసించి ॥శ్రీరామ॥

113. సావర్ణిమనువపుడు । స్వర్గాదిపత్యమును ।
బలికొసగ నియమించె। భద్రంబుగాను ॥శ్రీరామ॥

114. బలినంతవరకునూ । పాతాళలోకమును ।
పత్నీసమేతముగ । పాలింపుమనియె ॥శ్రీరామ॥

115. భక్తవత్సలుడైన । పరమేశ్వరుండచట ।
కావలియుండుటకు ॥ కరుణుంచిజనియె ॥ శ్రీరామ॥

## పరశురామావతారము

116. కార్తవీర్యార్జునుడు । కడుబలంబునమెరసి ।
ధరణీశ్వరులలోను । తగుపేరుబొంది ॥శ్రీరామ॥

117. తపతపోమహిమచే । తనయోగబలముచే ।
సకలలోకంబులను । సంచరించుచును ॥శ్రీరామ॥
118. ఆతండు జమదగ్ని । ఆశ్రమంబునకరిగి ।
తనపరివారముతో । తానచటనిల్చే ॥ శ్రీరామ॥
119. ఆమహోముని యపుడు । హోమధేనువు చేత ।
బహుభక్ష్యభోజ్యములు । బాగుగావడసి ॥శ్రీరామ॥
120. కార్తవీర్యునకపుడు । కడుప్రేమతోనచట ।
ఆతిధ్యమొనరించె । అదివ్య తపసి ॥శ్రీరామ॥
121. ఆతిధ్యమునుబొందీ । ఆనందమునపొంగి ।
ఆహోమదేనువును । హరియింపదలచి ॥శ్రీరామ॥
122. తనభటులనంపించీ । తనపురికి ధేనువును ।
బలిమితో దెప్పించె । పార్థివుండంత ॥శ్రీరామ॥
123. పురుషోత్తమాంశమున । పరశురామాఖ్యుండు ।
జమదగ్నిపుత్రుడై । చరియించుచుండె॥ శ్రీరామ॥
124. కామధేనువుబోవు । కతమెల్లదెలిసికొని ।
భార్గవరాముండు । పరశువునుబూని ॥శ్రీరామ॥
125. అర్జునుపురమునకు । అతివేగముననేగి ।
అతనితలద్రుంచే । అతివిక్రమముననుు ॥శ్రీరామ॥
126. తమధేనువును తెచ్చి । తనతండ్రికర్పింప ।
అర్జునుని పుత్రులు । అతిదుఃఖ మొంది॥ శ్రీరామ॥
127. అంతట జమదగ్ని । యాశ్రమంబునకేగి ।
ఆతనితలద్రుంచి। రతిఘోరముగను ॥శ్రీరామ॥
128. ఆసంగతినిదెలిసి । యాపరశురాముండు ।
అతిదుఃఖమునుబొందీ । అధికక్రోధమున ॥శ్రీరామ॥
129. అర్జునుతనయూల । నందరినికడతేర్చి ।
ఇలక్షత్రియులద్రుంచె । నిరువదొకమారు॥ శ్రీరామ
130. వారలరుధిరంబు । వసుధకర్పణచేసి ।
తొమ్మిదిమడుగులను । నెమ్మినిర్మించె ॥ శ్రీరామ॥

## శ్రీరామావతారము

శ్రీరామ రఘురామ। సీతాపతేరామ
సుజనపోషకరామ। సుగుణాభిరామ।

131. నీలమేఘశ్యామ । నిగమగోచరరామ ।
నిరుపమగుణధామ । నీకువందనము ॥శ్రీరామ॥
132. పలు మొగంబులవేల్పు । పలువకుపాత్రుడై ।
విశ్రావసుబ్రహ్మ । విశ్వమునబుట్టె ॥శ్రీరామ॥
133. అతనికిముగ్గురు । సుతులుద్భవంబైరి ।
రావణుడు జ్యేష్ఠుడై । రాజిల్లెనంత ॥శ్రీరామ॥
134. పదిశిరస్సులు నిరు । వదికరంబులతోడ ।
అతడుద్భవంబందె । నత్యద్భుతముగ ॥శ్రీరామ॥
135. ద్వితీయతనయుడై । పృథ్వియందుదయించె ।
కుంభకర్ణుండనెడు । ఘోరరూపుండు ॥శ్రీరామ॥
136. విజ్ఞాననంతుడై । విభీషణుండనని ।
మూడవతనయుడై । ముదమొప్పవెలసె ॥శ్రీరామ॥
137. రావణాసురుడపుడు । బ్రహ్మదేవునిగూర్చి ।
బహుతపంబును జేసె । భక్తిమీరగను ॥శ్రీరామ॥
138. ఆ తపస్సుకుమెచ్చి । అన్ని వరంబులను ।
బహుప్రీతితో నిచ్చె ॥ బ్రహ్మదేవుండు ॥శ్రీరామ॥
139. ఆ తపోబలముచే । అతి గర్వమునుబొంది ।
అన్ని లోకంబులను । అతడువిహరించె ॥శ్రీరామ॥
140. దేవేంద్రుడాదిగా । దేవతలనోడించి ।
దేవకన్యలబట్టె । తీవ్రమోహమున ॥శ్రీరామ॥
141. కడుఘోరమైనట్టి। కార్యములుజేయుచును ।
ఘోనులను భూసురుల । మర్దింపదొడగె ॥శ్రీరామ॥
142. అలకాపురముకేగి । అలకుబేరునిగెల్చి ।
అతనిపుష్పకము । నపుడపహరించె ॥శ్రీరామ॥
143. కుంభకర్ణుడుకూడ । ఘోరతపమొనరించి ।
సురవరేణ్యులనెల్ల । స్పర్ధింపదొడగె ॥శ్రీరామ॥
144. దేవతలందరును । దేవదేవునిజేరి ।
రావణుబాధలను । రయమునను దెలుప ॥ శ్రీరామ॥

145. బ్రహ్మాదిదేవతలు । వైకుంఠపురి కేగి ।
విష్ణుమూర్తికి మ్రొక్కి । వివరించిరిట్లు ॥శ్రీరామ॥
146. రావణుండొనరించు । రాక్షసబాధలను ।
భరియింపగాలేము । భక్తరక్షకుడా ॥శ్రీరామ॥
147. అనుచువేడినయంత । సత్యాదరముతోడ ।
ఆ మహావిష్ణుండు । అపుడు కరుణించి ॥శ్రీరామ॥
148. భూభారముమదీర్ప । పుడమి పై దశరథుని ।
పుత్రుడవై బుట్టి ॥ బ్రోతుపొండనియె ॥శ్రీరామ॥
149. ఆ దశరథేశునకు । అయోధ్యపురమున ।
పత్నులుముప్వురు । వరలుచుండగను ॥శ్రీరామ॥
150. కౌసల్యగర్భమున । గలిగెశ్రీరాముండు ।
కైకగర్భమునందు । గలిగె భరతుండు ॥శ్రీరామ॥
151. లక్ష్మణ శత్రుఘ్న । లనుపుత్రులిరువురు ।
సుమిత్రసుతులైరి । సొంపుమీరగను ॥శ్రీరామ॥
152. అంతవిశ్వామిత్రు । డను మౌనియజ్ఞంబు ।
చేయువసురులుచేరి । చెరపబూనగను ॥శ్రీరామ॥
153. ఆరాక్షసులజంప । ఆరామలక్ష్మణుల ।
అడవికి బంపుమని । అడిగె దశరథుని. ॥శ్రీరామ॥
154. దశరథుండామాట॥ దాటలేకనుచింత ।
వందిమౌనినివేడె । వంపలేననుచు ॥శ్రీరామ॥
155. ఆమునియంతటనే । అత్యుగ్రుడగుటచే ।
శ్రీరామలక్ష్మణుల । శీఘ్రమునపంపె ॥శ్రీరామ॥
156. రామలక్ష్మణులు వి॥ శ్వామిత్రుతోనేగి ।
బహుశస్త్రవిద్యలను । భక్తితోనేర్చి ॥శ్రీరామ॥
157. యజ్ఞశాలకుబోయి । అసురులపొగరణచి ।
రాయియైపడియున్న । రమణివీక్షింప ॥శ్రీరామ॥
158. రామునిపాదంబు । రాయినితాకంగ ।
ఆరాయినాతియై । అతనిస్తుతిచేసె ॥శ్రీరామ॥
159. ఆమౌనిచంద్రుండు । ఆ రాఘవుంతోనా ।
జనకుని పురికేగె । జనులుమెచ్చంగ ॥శ్రీరామ॥

160. శ్రీరాములంతటను । శివునివిల్లువిరచి ।
జనకుని సుతసీత । వనితను వరించె ॥శ్రీరామ॥
161. తనపురంబునకపుడు । జనకుండుదశరధుని ।
రప్పించితగినట్లు । రంజిల్లజేసె ॥శ్రీరామ॥
162. రామునకు జానకిని । లక్ష్మణునకూర్మిళను ।
పరిణయంబులుజేసె । బహువైభవముగాను ॥శ్రీరామ॥
163. మిధిలేశుసోదరుడు । మిగులవేడుకతోను ।
భరతశత్రుఘ్నుల వి । వాహములు జేసె॥ శ్రీరామ॥
164. మాండవియు శృతకీర్తి । మహితప్రేమంబునను ।
భరతశత్రుఘ్నులను వరిణయంబైరి ॥శ్రీరామ॥
165. అంతటను దశరధుడు ॥ ఆనందమునుబొంది ।
అయోధ్యాపురికి । అరుగుచుండగను ॥శ్రీరామ॥
166. క్షత్రియవంశంపు । శత్రువుండైనట్టి ।
పరశురాముండంత । బలదర్పమునను ॥శ్రీరామ॥
167. శౌర్యంబుతోడతను । సమరంబునకువచ్చి ।
శ్రీరామచంద్రుని । జేరితానోడె ॥శ్రీరామ॥
168. దశరధుఁడతటను । తనపట్టణంబునకు ।
సహచరులతోనరిగె । సంతోషమునను ॥శ్రీరామ॥
169. శ్రీరామచంద్రుని । జేయయువరాజుగా ।
దశరధుడు వశిష్ఠుని । దయసురమ్మనియె ॥శ్రీరామ॥
170. రామునిపట్టాభి । రాముగాజేయంగ ।
సంభారములనన్ని । సమకూర్చెనంత ॥శ్రీరామ॥
171. ఈరేడువర్షములు । శ్రీరాము నడివికి ।
బంపి రాజ్యమునిమ్ము । భరతపుత్రునకు ॥శ్రీరామ॥
172. అని కైకవరములూ । అడిగిరాజేంద్రుని ।
ప్రాణముల విసగించె । పట్టుదలతోను ॥శ్రీరామ॥
173. వరములిచ్చితినంచు । బలుకంగనామాట ।
శ్రీరామచంద్రుని । చెవిబడ్డయంత॥ శ్రీరామ॥
174. రాజాజ్ఞమన్నించి । రాముడు సీతయును ।
కానలకుసౌమిత్రి । తో నరిగిరపుడు ॥శ్రీరామ॥

175. ఆరామలక్ష్మణులు । అధిక సంతోషమున
తపసులసేవించి । ధన్యతనుగనిరి ॥ శ్రీరామ॥
176. అంతట భరతుండు ॥ అన్న గారినిజూడ ।
తనపరివారముతో । తగనేగుదెంచి ॥ శ్రీరామ॥
177. దశరధుమరణంబు । తనయన్నకునుదెల్పి ।
రాజ్యపాలనజేయ । రమ్మనుచువేడె ॥ శ్రీరామ॥
178. రాజాధిరాజైన । రామనీరాజ్యంబు ।
పాలింపనాతరమ । పరిచారకుడును॥ శ్రీరామ॥
179. నీవురాకుండిన । నేను నీతోగూడ ।
నీసేవ జేయుచును । వేనడవినుందు॥ శ్రీరామ॥
180. ఆమాటకు వశిష్ఠ । డానందమునుబొంది ।
శ్రీరాముజననంపు । కారణము దెలుప ॥ శ్రీరామ॥
181. రామునిపాదుకలు । ప్రకటభక్తినిదెచ్చి ।
పట్టాభిషేకంబు । భరతుండు జేసె॥ శ్రీరామ॥
182. శ్రీరాముడటుపైని । ఘోరకాననమందు ।
దనుజులబరిమార్చి । మునులసేవించి ॥శ్రీరామ॥
183. తీరుగాపంచవటీ । తీరంబునకునేగి ।
ఖరదూషణాది । రాక్షసులవధియించె ॥శ్రీరామ॥
184. మారీచునంతటను । మాయజింకగ జేసి ।
రామునిసన్నిధికి । రావణుడుపంపె ॥శ్రీరామ॥
185. సీతమ్మ యాజింక । చిత్రరూపముగాంచి ।
తనకు తెమ్మని వేడె । ఘనునిశ్రీరాము ॥శ్రీరామ॥
186. శ్రీరాముడంతటను । చిత్రహరిణముతోడ ।
జని జంపెనద్దాని । ఘనభాణమునను ॥శ్రీరామ॥
187. అంతటను హరిణము । హా! లక్ష్మణాయని పడియె
అదివిని లక్ష్మణుని । అతివపంపించె ॥శ్రీరామ॥
188. కూడెసమయమటంచు । క్రూరుడౌ రావణుడు ।
యతివేషమును దాల్చి। యతివదరిజేరి ॥శ్రీరామ॥
189. తనరథముపై సీత। దర్పమున నిడికొనుచు ।
లంకకుగొనిపోయి । రాజసంబుననూ ॥శ్రీరామ॥

190. అశోకవనమందు । ఆ జానకినినిల్పి ।
కావలిగాదనుజ । కాంతలనునుంచే ॥శ్రీరామ॥
191. జనకునిసుతవార్త । వినిన జటాయువు ।
శ్రీరామునకు దెల్ప । చింతలోమునిగి ॥శ్రీరామ॥
192. ఋష్యమూకాన వసిం । చు సుగ్రీవునితో ।
సఖ్యంబురాముండు । సరసతనుజేసె ॥శ్రీరామ॥
193. వాలినివధియించీ । వాయుపుత్రునివలన ।
జానకియున్నట్టి । జాడదెలిసికొని ॥శ్రీరామ॥
194. వానరసేనలచే । వారధినిగట్టించి ।
లంకేశునగరముకు । రాముండు జేరి ॥శ్రీరామ॥
195. రాక్షససేనలను । రణమందు వధియించి ।
కుంభకర్ణాదులను । గూలగానేసి ॥శ్రీరామ॥
196. రావణాసురుద్రుంచీ । రాక్షసులరాజ్యంబు ।
అతనితమ్మునకొసగె । అతిమోదమునను ॥ శ్రీరామ॥
197. విభీషణుండంత । వినయంబుతోడుతను ।
సీతమసమకూర్చె । శ్రీరామునకును ॥శ్రీరామ॥
198. శ్రీరాముడంతటను । సీతతోడనుగూడి ।
అనుజసమేతుడై । అయోధ్యకరిగె ॥శ్రీరామ॥
199. అంజనాతనయుడును । ఆదిత్యసూనుడును ।
విభీషణునితోను । వెడలిరాపురికి ॥శ్రీరామ॥
200. శ్రీరామచంద్రుండు । సీతాసమేతుండై ।
సంతోషముననొందె । సామ్రాజ్యపదవి॥ శ్రీరామ॥
201. దేవతలు దివినుండి । దివ్యపుష్పంబులను ।
వర్షించెనయోధ్య । పౌరులుప్పొంగ ॥శ్రీరామ॥

## శ్రీకృష్ణావతారము

అవనిపై రాక్షసులు । అధిపులుకొందరును ।
దుష్టులైచరియింప । దురితములు హెచ్చే ॥ శ్రీరామ॥
203. భూదేవిదుష్టులను । మోయంగలేనందు ।
బ్రహ్మదేవునితోను । బల్కెనంతటను ॥శ్రీరామ॥

204. బ్రహ్మాదిదేవతలు । వరుసగా భూదేవి ।
క్షీరపయోదధి । తీరమునకేగి ॥శ్రీరామ॥
205. విష్ణుదేవునికొరకు । వేవిధులప్రార్థింప ।
విష్ణుండుజిష్ణుండు । వినియభయమొసగి॥ శ్రీరామ॥
206. భూభారమునుదీర్ప । భువిరామకృష్ణులై ।
యాదవకులమందు । యవుడవతరించి ॥శ్రీరామ॥
207. దుష్టరాక్షసులను । దుర్యోధనాదులను ।
వరుసగాజంపించే । పెరవుమీరగను ॥శ్రీరామ॥

**బుద్ధావతారము**

208. బుద్ధావతారమున । భూతదయవెలయించి ।
సిద్ధులను సాధ్యులను । శ్రీఘ్రమునబ్రోచె ॥శ్రీరామ॥

**కలికావతారము**

209. కలియుగాంతమునందు । కలికి రూపమునొంది ।
కుజనులను గడతేర్చి । సుజనులనుబ్రోచు

210. సర్వభూతంబులును । స ర్వాత్మయందుండ ।
సర్వసిద్ధియవెడు । సత్రుదేశమున ॥శ్రీరామ॥
211. వద్దిపర్తివారీ ! వంశంబునందునను ।
కోనమరాజునకు । కొమ్మనరసమకు ॥శ్రీరామ॥
212. సుతుడనైజనియించి । సుకృతంబు జేకూర ।
వెంకటరెడ్డియని । వెలసిభువియందు ॥శ్రీరామ॥
213. నీపాదములసేవ । నిత్యంబుగోరుచును ।
నీకర్పణంబుగను । నీపదముల్వ్రాసె ॥శ్రీరామ॥
214. ఈ పదము నెవరైన । నెలమితో జదివినను ।
ఆమహావిష్ణుండు । అలరించుకృపను ॥శ్రీరామ॥
216. సన్మంగళమురామ । చంద్రభూపాలునకు ।
సన్మంగళముసర్వ । సాక్షికృష్ణునకు ॥శ్రీరామ॥
217. మంగళము సీతకును । మంగళము రుక్మిణికి ।
మంగళము భువినున్న । మనుజకోటికినీ ॥శ్రీరామ॥

సంపూర్ణము శ్రీరామార్పణమస్తు

శ్రీ మాత్రే నమః

# శ్రీదేవి

# శరన్నవరాత్ర పురాణము



రచయిత

కీ॥శే॥ అయితం కాశీవరప్రసాదరావ్